# ఫారెక్స్®
# మొట్టమొదటి ఎంపిక!

## ఎందుకంటే క్రొత్త మేలుపర్చబడిన ఫారెక్స్® మొదటు మొదటు ఘన ఆహారాలకు మారే పాపాయికి సహాయకరంగా అత్యావశ్యక పదార్థాల సమ్మేళనం.

ఫారెక్స్. పాపాయి యొక్క పెరుగుదల మరియు సున్నిత జీర్ణశక్తికి అనువుగా ప్రొటీన్లు మరియు క్రొవ్వు పదార్థాల సరియైన కలయిక.

దీనిలో పాపాయి అవసరాలను పూరించి అతడి రక్తాన్ని ఆరోగ్యవంతంగా వుంచడానికై తగినంత ఐరన్ కలదు.

పాపాయి ఎముకలు మరియు పళ్లు చక్కగా పెరగడానికి సహాయకరంగా ఫారెక్స్‌లో కాల్షియం, ఫాస్ఫరస్ ఆదర్శవంతమైన నిష్పత్తిలో కలవు.

వీటితోపాటు ఇప్పుడు క్రొత్త ఫారెక్స్ కలపడానికి సులభం.... మరింత రుచికరం కూడా.




క్రొత్త మేలు పర్చబడిన **ఫారెక్స్®**

**పాలు చేర్చే అవసరం లేదు.**
కేవలం నీటిలో కలిపి పట్టండి.

CLARION/B/GX/13/183 T

**ఉషాకిరణ్ మూవీస్**



# కారుదిద్దిన కాపురం




## కుటుంబ యాత్రా స్పెషల్

ప్రతి మనిషికీ రకరకాల కోరికలు వుండటం సహజం. అయితే కొందరు వున్నవాటితోసరిపెట్టుకుంటే మరికొందరు లేనివాటికోసం అర్రులుచాస్తారు. నేలమీద నిలబడి ఆకాశానికి నిచ్చెనలు వేసేవారు మరికొందరు. పచ్చని సంసారాల్లో కార్చిచ్చు రగిల్తే చూసి ఆనందతాండవం చేసేవారు మరికొందరు. సునిశితంగా పరిశీలిస్తే ఈ మానవసహజమైనవాంఛలు మనలో ప్రతి ఒక్కరిలోనూ అంతో ఇంతో అంతరంగాల్లో చోటుచేసుకుంటాయి. ఇది సహజం. ఇలాంటి విభిన్న, విచిత్ర మనస్తత్వాల చిత్రీకరణే ఉషాకిరణ్ మూవీస్ వ్యంగ్య, హాస్యరస గోపురం 'కారుదిద్దిన కాపురం'లో మనకు కన్పిస్తుంది. ప్రతి పాత్ర ప్రత్యేక ఔన్నత్యాన్ని ప్రదర్శిస్తూ వాస్తవమేననిపిస్తుంది.

అందుకు తార్కాణంగా రిటైర్ అయిన ఇంజనీరు రాఘవరావునూ, అతనిభార్యనూ, మూడో కూతురు సుగుణనూ, పరాయి వాళ్ళు పచ్చదనంచూస్తే కంటతడిపెట్టే పొరుగింటి పుల్లారావు, పుల్లమ్మనూ, రాఘవరావు మొదటి అల్లుడు మన్మథ రావునూ, రెండో వియ్యపురాలు సూర్యకాంతాన్నీ ముఖ్యంగా మనం ఇక్కడ ప్రస్తావించుకోవచ్చు.

రాఘవరావు ఆడపిల్లల తండ్రి. ఆడపిల్లల తండ్రి బాధలు అందరికీతెలుసు. అతనంటే అందరికీ అలుసు- ముఖ్యంగా అల్లుళ్ళకీ, వియ్యపురాళ్ళకీ. రాఘవరావుకి ముగ్గురాడపిల్లలు, ఒక భార్య, అప్పుచేసి తిప్పలుపడి కట్టిన ఒక ఇల్లు, కొంచెం గుండెజబ్బు, ఓ కారుకు ఓనర్ కావాలన్న చిరకాలవాంఛ, అతని చరస్థిరాస్తులు. రాఘవరావు నీతి నిజాయతీగల ఇంజనీరు. ఇంటిఅప్పు తీర్చేసరికి ఆయాసంవచ్చింది. ప్రభుత్వం తీసుకున్న తొందరపాటు నిర్ణయంవల్ల 55ఏళ్ళకే రిటైర్ అయ్యాడు.



కోర్టు ఉద్యోగుల పక్షాన ఇచ్చిన తీర్పు ప్రకారం 58 ఏళ్ళవరకూ పదవిలో కొనసాగమని ప్రభుత్వం ఆహ్వానించింది. మళ్ళీ ఉద్యోగంలో చేరాడు. కట్నాలిచ్చి పెళ్ళిళ్ళుచేయగల స్తోమతులేని రాఘవరావు తన తదనంతరం ఆఇల్లు అమ్మేసి వచ్చిన డబ్బులు ముగ్గురు కూతుళ్ళకూ కట్నంగా పంచుకోమని చెప్పి ఇద్దరాడపిల్లల పెళ్ళిళ్లు చేశాడు. మూడోపిల్ల యం.ఎ., పి.హెచ్.డి.దాకా చదువుకోవడంవల్ల అంతటివిద్యార్హతలుగల వరులుదొరకడం అసాధ్యమైంది. అదీకాక వచ్చిన వరులందరూ కట్నాల రాసులకోసం కక్కుర్తిపడటం మామూలైపోయింది.

ఇన్ని ఇబ్బందులెదుర్కొంటున్నా రాఘవరావుకు కారుమీద మోజు తగ్గలేదు. ఆఫీసుకు పోయేటప్పుడూ, వచ్చేటప్పుడూ కారు మెకానిక్ కనకయ్య ప్రాణాలు అప్పడంలా కొరుక్కుతింటూవుంటాడు రాఘవరావు. అదీ టూకీగా రాఘవరావు పాత్ర.

భర్త ఆశలను, ఆదర్శాలను, ఆశయాలను, ఆకాంక్షలను అడుగడుగునా గమనిస్తూ, వాటిని ఆచరణలో పెట్టడానికి అండదండలందించే అనుకూలవతి అయిన భార్య అందరికీ లభిస్తుందా చెప్పండి! ఆ విషయంలో రాఘవరావు అదృష్టవంతుడేనని చెప్పాలి. ఆయన మీద, హోదా మీద, ఆస్తిమీద, ఆశయాలమీద ఎవరైనా కన్నేసి కన్నుకుట్టి ఏడుస్తారని ఎప్పటికప్పుడు దిష్టి తీసి పారేస్తూనేవుంటుంది. అదుగో! తిరిగి ఉద్యోగంలో చేరడానికి రిక్షా ఎక్కబోతున్న రాఘవరావుకు హితబోధచేస్తోందే.... ఆవిడే... అతని భార్య ఇందుమతి.




సత్యం


ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం


ఎస్.జానకి


ఎస్.పి.శైలజ


భాస్కరరాజు


శివ


సుబ్రహ్మణ్యం


అట్లూరి రామారావు



అటుచూడండి... దొంగచాటుగా ఇవన్నీ గమనిస్తూ ఓర్వలేక పుట్టెడు దుఃఖాన్ని దిగమింగుకొంటూ పూజా మందిరంలో వున్న భర్త పుల్లారావుకు ఈ దుర్వార్త మోసుకెడుతోందే... అదిదే



పొరుగింటి పుల్లమ్మ. పచ్చని సంసారాల్లో చిచ్చురగులుకుని వాళ్ళ బతుకులు చితుకుల్లో కాలిపోతుంటే...ఆ మంటల వెలుతురులో తమ కుటుంబాలను చక్కదిద్దుకునే మనస్తత్వాలుగల వ్యక్తులే ఈ పుల్లమ్మా, పుల్లారావులు. మామూలు మనుషులు కారు వీళ్ళు. మనతో వుంటూనే వెనకాల ఎసరు పెట్టే చాప కిందనీళ్లు. ఇదీ వీరి లక్షణం. ఇలాంటి వాళ్ళు మీకూ ఎదురవుతారు జాగ్రత్తసుమీ!

పెద్దల్లుడు మన్మథరావుని పరికించి చూద్దాం...గుండెజబ్బు మామగారు ఏ నిముషంలోనైనా 'హరీ' అంటాడనీ, ఆస్తిలో వాటా వెంటనే పంచుకోవచ్చనీ ఆశపడి నాలుగేళ్ళనాడు రాఘవరావు పెద్దకూతురు హేమను పెళ్లాడాడు. మామగారిచావు వాయిదాల మీద వాయిదాలు పడుతూ వుండటంవల్ల ఆశ నిరాశగా మారింది. అందుకనమా మామగారి మరణంకోసం గుంటకాడ నక్కలా కూర్చున్నాడు. మామగారి మరణం గురించి జోతిష్కులను అనుక్షణం సంప్రదించే దానవుని మానవరూపం మన మన్మథరావు.

ఇక రెండో కూతురు రూప భర్త సుబ్బారావుని పరిచయం చేసుకుందాం. సుబ్బారావు నిబ్బరమైన మనిషి. నిదానస్థుడు. నిగర్వి. భార్యపట్ల ప్రేమాభిమానాలు, పెద్దలపట్ల గౌరవాదరాలుగల తల్లిచాటు పిల్లాడు. అతనితల్లి సూర్యకాంతం. రాఘ



వరావు నిజంగా గుండెజబ్బు మనిషాకాదా? డాక్టర్ సర్టిఫికెట్ సరైందా, కాదా? రెండేళ్లలో పోతాడా, పోడా? ఇల్లమ్మితే వచ్చే డబ్బులో తమకు వాటావస్తుందా, రాదా? అని ఆరాలు తీయడానికి ఒక డిటెక్టివ్‌ను నియమించిందంటే ఆమె మనస్తత్వం అర్థమైపోవడంలా? వియ్యపురాలిమీద, వియ్యంకుడిమీద అలిగినప్పుడల్లా కొడుకునీ, కోడల్నీ విడదీయడానికి ప్రయత్నించే అత్తలకు ప్రత్యక్ష సజీవ సాక్ష్యం సూర్యకాంతం. కట్నం కోసం గడ్డితినే కసాయి అత్తగార్లకు ప్రతినిధి ఈ సూర్యకాంతం. అందుకే సూర్యకాంతం అనే బదులు సూరేకారం అందే బావుంటుందేమో!

ఇక మూడో కూతురు సుగుణ ఆదర్శ వంతురాలు. తన చదువుకు తగిన మొగుడు దొరకడం కష్టమనీ, తల్లిదండ్రులు తనకి తగిన వరుడు తేలేరనీ గుర్తించింది.



వచ్చిన ప్రతి సంబంధం తిరగకొడుతుంది. వాళ్ళు పెట్టే షరతులకూ, అడిగే కట్నాలకూ విసిగిపోయి చివరికి ఒక మతాంతరుణ్ని చేసుకుంది.

ఇన్ని పాత్రల గురించి ఎన్నో కోణాలనుంచి తెలుసుకున్నాంకదా...! కాపురంలో కలతలురేపి తిరిగి అందర్నీ ఒకటిగా కలిపి కాపురాన్ని సరిదిద్దిన కారు గురించి ప్రస్తావించుకోలేదుకదూ...!

సరే! ... మొత్తానికి కారు మెకానిక్ కనకయ్య ప్రాణాలు తిని అప్పుచేసి ఓ కారు కొన్నాడు రాఘవరావు. చచ్చేలోగా కారు ఓనర్ను కావాలన్న అతని ఆశ తీరింది. అది ఒకప్పుడు యాక్సిడెంటులో తుక్కుతుక్కైన కారు. దాన్ని నానా యాతనాపడి రాఘవరావు మీదున్న గౌరవంతో రిపేరుచేసి కొత్తదానిలా రూపొందించాడు కనకయ్య. కారు కొనడానికి డబ్బు లేకపోతే సేట్‌జీ దగ్గర అప్పు కూడా ఇప్పించాడు కనకయ్య. కట్నం ఇవ్వకుండా, చెప్పిన సమయానికి చావకుండా మామగారు కారుకొంటే అల్లుళ్లు ఊరుకుంటారా? అక్కడే పుట్టింది రాఘవరావు సంసారంలో ముసలం. ఈ కష్టాల కడలినీదించి ఒడ్డున చేర్చడం ఆ 'కారు' కర్తవ్యంకదామరి!

ఆ కారును చూసి కళ్ళల్లో నిప్పులు పోసుకున్న వాళ్లందరికీ బుద్ధి చెప్పింది ఆ 'కారు'. ఆఫ్టరాల్ కారేమిటి? కాపురాన్ని సరిదిద్దడమేమిటి? అన్నది మీ ప్రశ్న కదూ!?! ఆ కారు చరిత్ర మరపురానిది, మధురమైనది. డ్రైవర్, క్లీనర్ లేనిది. అదో విచిత్రమైన కారులెండి. దాని 'చేతలన్నీ చిత్రాలే దాన్ని గురించి ఇప్పుడే ఎలాచెప్పమంటారు? కథను అడుగడుగునా కొత్త మలుపులు తిప్పుతూ ఉత్కంఠ కలిగించే ఈ కారు కథ దృశ్యంగా వెండితెరపై చూడటం మీ వంతు. అన్ని వయసులవారు, అన్ని తరగతులవారు సకుటుంబంగా చూడదగిన వ్యంగ్య, హాస్యరస చిత్రం ఉషాకిరణ్ మూవీస్ 'కారుదిద్దిన కాపురం' ఈ కారులో ప్రత్యేక యాత్రకు మీ ఊరొస్తున్న నటీనటులు- నూతన్‌ప్రసాద్, రాజేంద్రప్రసాద్, వేలు, నగేష్, పద్మనాభం, మాడా, కమలాకర్, విద్యాసాగర్, రమాప్రభ, పవిత్ర, మమత, శ్రీలక్ష్మి, వై. విజయ, సంగీత, కల్పనారాయ్, శ్రీశైలజ, డిస్కోశాంతి.

సాంకేతికవర్గం : పాటలు : వేటూరి సుందరరామమూర్తి; సంగీతం : సత్యం; ఛాయాగ్రహణం : నవకాంత్; కళ : భాస్కరరాజు; కూర్పు : గౌతంరాజు; నృత్యాలు : శివ-సుబ్రహ్మణ్యం; నిర్మాణ నిర్వహణ : అట్లూరి రామారావు; నిర్మాత: రామోజీరావు; కథ, మాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : డి.వి.నరసరాజు; విడుదల: మయూరి.



# చతుర

సంపుటి : 9 ఆగస్ట్ 1986 సంచిక : 7

## ఈ నెల సమగ్ర నవల

అందం విషయంలో ఆమెకు ఏలోటూ లేదు! అయినా అవిటితనం వల్ల వయసు మించిపోతున్నా పెళ్ళికాక బతుకు కన్నీటి మయమైంది.

అయితే ఓ అపరిచితుడు-"రాజకీయాలలో తిరిగిన నేను ప్రస్తుతం ఆ రంగంలో ఏర్పడ్డ కుత్సిత వాతావరణంపై అసహ్యంతో దానికి దూరంగా వుంటున్నాను. ఆర్థికంగా పెద్దగా లేనివాడినే. అయినా భార్యను పోషించుకోగలనన్న నమ్మకం, ధైర్యం నాకుంది. మనుషుల కష్టనష్టాలూ, బాధలూ నాకు తెలుసు. అవిటివాళ్ల జీవితాలు ఎంత కష్టనిష్టూరాల మధ్య నలుగుతుంటాయో, ఎలాంటి బాధలకు లోనవుతుంటాయో నేను అర్థం చేసుకోగలను. ఎన్నో ఒడిదుడుకులూ, బాధలను ఎదుర్కొన్న నేను కనీసం ఒక బాధామయజీవికి సంతోషకరమైన జీవితం కల్పిద్దామని ఆశించాను" అంటూ ఆమెను పెళ్లాడటానికి ముందుకొచ్చాడు.

అనుకోని అదృష్టంలా లభించిన అతని తోడును అందర్నీ కాదని అందుకున్న ఆమె అతని సమక్షంలో సేదదీరిందా?

అతన్ని నమ్మి అతని జీవిత సహచరిగా బంధం ఏర్పరచుకున్న ఆమె ఆతర్వాత ఎలాంటి అనుభవాలను ఎదుర్కొన్నది? వాటి ప్రభావం ఆమె జీవితాన్నెటు నడిపింది?

**కొమ్మిరెడ్డి విశ్వమోహనరెడ్డి**

కలం నుంచి వెలువడిన కరుణామయ రచన

# అశ్రుతర్పణం

సహజత్వం గల సంఘటనలతో, సరళమైన కథనంతో అక్షరరూపం కల్పించిన 'అశ్రుతర్పణం' ఈ నెల 'చతుర' సమగ్ర నవల!

కవర్ పేజీ ఫొటోగ్రాఫర్ : జగ్‌మోహన్

## సూపర్ రిన్‌తో తళతళలాడే ఆ తెల్లదనం




**సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు**

మరే ఇతర డిటర్జెంట్ బిళ్ళ లేదా బార్ కంటే తెలుపు.

హిందూస్తాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి.

# 'గూడు' నవలపై చతుర సమీక్షలు

**జూన్ 'చతుర' నవల 'గూడు' పై పాఠకుల నుంచి మాకు అందిన 'చతుర సమీక్ష'లలో ఉత్తమంగా వున్న మూడింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము. ఈ శీర్షికలో ఉత్సాహంగా పాల్గొన్న పాఠకులందరికీ మా కృతజ్ఞతలు! బహుమతులు పొందిన ముగ్గురికీ మా అభినందనలు!**

## అందమైన ముగింపు

(ప్రథమ బహుమతి రు.100/- పొందిన సమీక్ష)

మధ్య తరగతి మనుషుల జీవన పోరాటాన్ని కళ్ళకు కట్టినట్టుగా వర్ణించిన నవలా రత్నాలలో ఇది ఒకటి. వాస్తవానికి దగ్గరగా, అనవసర కాల్పనికతకు తావివ్వకుండా క్లుప్తంగా సాగింది 'గూడు'. ఏకబిగిన చదివించి కొన్ని చోట్ల ఆలోచింపజేసింది కూడా.

ఉదాహరణకు- "మన తండ్రులు దానకర్ణులు. మన తల్లులు అన్నపూర్ణలు. మనది కర్మభూమి. గతంగతః - అనుకుంటూ జరిగిందాన్ని ఒక పీడకలలా మర్చిపోయి జీవిత శకటాన్ని నడిపెయ్యడంలో మనల్ని మించిన ఆధ్యాత్మిక బోధకులు లేరు" అన్న వాక్యాల్లో మన ఆలోచనాసరళిని సూటిగా, సున్నితంగా విమర్శించడంజరిగింది. "అవును...నిజమే. మనం ఇలాంటి స్థితిలోనే జీవితాన్ని గడిపేస్తున్నాం" అన్న భావాన్ని ఈ వాక్యాలు పాఠకునిలో కల్గిస్తాయి.

కథానాయకుడు 'కరుణాకరం' పాత్ర చిత్రణ మన సమాజంలోని మధ్యతరగతి వ్యక్తి స్వభావానికి అద్దంపట్టినట్టుగావుంది. మిగతా పాత్రలను మలచడంలోనూ ఆ నేర్పు స్పష్టంగా కనబడుతుంది. నీతికి, నిజాయితీకి నిలబడ్డ వేదాంతిలాంటి తండ్రి, లౌక్యం తెల్సిన సుందరమ్మగారిలాంటితల్లి భర్తఅసమర్థతనువిసుక్కుంటూ,వున్నంతలోనే సర్దుకుపోతూ రాజీపడే భార్య అన్నపూర్ణ, ఈనాటి గడుగ్గాయిలైన ఆ పిల్లలూ-మధ్యతరగతి కుటుంబాల్లో సర్వసామాన్యం. మనలో ఇంకా వెంకటస్వామి, పానకాలు వంటి మంచివాళ్ళుండబట్టే జీవితం ఈ మాత్రమైనా ప్రశాంతంగా గడుస్తోందన్న అభిప్రాయం సర్వజనామోదం. మనలో వేళ్ళూనుకుని వున్న దోపిడీ వ్యవస్థకు ప్రతినిధులుగావున్న రామనాథం, లక్ష్మీపతి, మురళి, వాళ్ళ కుటిల వ్యవహారాలు బెడిసికొట్టటం- "ఎప్పటికైనా మంచి చెడును జయిస్తుంది" అన్న నమ్మకాన్ని కలుగజేస్తుంది. కెప్టెన్ బిందుని తొలి చూపులోనే ప్రేమించి, పెళ్ళాడుతాననడం, అమెరికానుంచి చిట్టిబాబు డబ్బు పంపడం నవలలో అందమైన మలుపులేగానీ అవి అనవసరం-ఇల్లు కట్టడంతోనే కథ కంచికి వెళితే, చదివినవారికి మనస్తాపం, ఇల్లు కట్టడానికో రకమైన భయం ఏర్పడేదేమో! అలాగాక నవలను అందంగా మలచి, ఆనందంగా ముగించడంతో పఠితుని పెదవులపై చిరునవ్వు నిలుస్తుంది చివరకు.

—జి. కృష్ణవేణి
లంకపల్లి, ఖమ్మంజిల్లా.

## అవగాహన ముఖ్యం

(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)

ఇల్లు కట్టడంపై అనుభవంకానీ, కనీసం అవగాహనకానీ లేకుండా రాసినట్లుంది 'గూడు' నవల. సింపుల్‌గా చెప్పాలంటే బీదహీరో పెద్దింటి హీరోయిన్‌ను ప్రేమించడం, ఆ హీరోయిన్ తండ్రి హీరోను కష్టాలపాలుచేయడం, చివరకు హీరో ఆ కష్టాలన్నీదాటి హీరోయిన్ తండ్రిని పశ్చాత్తాపపడేట్టుచేసి హీరోయిన్‌ని పెళ్ళిచేసుకోవడంలాంటి కథే ఇదిగూడా. కాకపోతే 'ఇల్లు కట్టడం' అనేది హీరోయిన్ అయితే, లక్ష్మీపతి హీరోయిన్ తండ్రి

అనుకుంటే సరిపోతుంది. పైగా 14 రీళ్ళకు సరిపోయే సినిమాని 20 రీళ్ళకు పొడిగించినట్లుగా అనవసరమైన వర్ణనలు, సంభాషణలు చోటుచేసుకున్నాయి. చివర్లో తమ్ముడు అమెరికా నుంచి 50వేలు పంపించడమూ, చెయ్యినరం మెలిక తిరిగి నంత మాత్రాన్నే లక్ష్మీపతి తన అక్ర మాలకు పశ్చాత్తాపపడటం...పానకాలు, వెంకటసామి ప్రత్యక్షమై క్షణాల్లో ఇల్లు పూర్తిచేయడం అంతా సినిమాస్టైయిలే.

అవగాహన విషయానికొస్తే అది కూడా అంతంతమాత్రం. ఇల్లు కట్టుకోవ డానికి ఋణాలిచ్చే ఏ ప్రభుత్వ సంస్థ అయినా ప్లాన్, ఎస్టిమేటు, తక్కువయ్యే సొమ్మును జమచేసుకోగలిగే ఇంటి యజ మాని తాహతూ- అన్నీ పరిశీలించిన తరువాతే లోన్ఇస్తారుకానీ, "ఇదిగో...ఈ నలభయివేలు తీసుకొని నీ ఇష్టమొచ్చినట్లు ఖర్చుపెట్టుకో' అని జేబులో పెట్టేయరు. అలాగే ఎల్.ఐ.సిలోకూడాలక్షకో లక్షన్న రకో పాలసీ తీసుకోంగానే లోన్ ఇవ్వరు. పాలసీ వ్యవధి, ఆ పాలసీకింద తమవద్ద జమపడిన సొమ్మునుబట్టి మాత్రమే లోన్ ఇస్తారు. అంతేకానీ, సెక్షనులోకి వెళ్ళి 'ఈ పాలసీమీద ఎంతిస్తారమ్మా' అని అడగం గానే ఎంత తెలిసినవారయినా 'మూడు వేలిస్తారు. సాయంత్రం వచ్చి చెక్ తీసు కోండి' అనరు. అదీ అప్లికేషను కూడా లేకుండా.

గుంటూరులాంటి పట్నంలో ఇంగ్లీషు లెక్చరరుగా పనిచేస్తున్న కథానాయకుడికి పాలసీ ల్యాప్స్ అయిందీ, లేందీకూడా తెలీదా? అడిగేవాళ్ళకుచెప్పేవాళ్ళు లోకువ అన్నట్టు-రాసేవాళ్ళకుచదివేవాళ్లు లోకువ కాగూడదు.

—టి. నాగభూషణం
హైదరాబాద్.

## ఇది ఇంటింటి కథే

(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)

నెల నెలా 'చతుర'నవలలు చదివే అలవా టున్న నన్ను జూన్ నెల 'చతుర' నవల 'గూడు' ప్రత్యేకించి ఆకట్టుకుంది. మధ్య తరగతి కుటుంబీకులు స్వంత ఇల్లు కట్టు కోవాలంటే ఎదురయ్యే అడ్డంకులు, ఆర్థిక ఇబ్బందులు మనసుకు హత్తుకునేలా వర్ణిం చారు రచనలో. ఈ నవలలోని ప్రతి పేజీ, ప్రతివాక్యం ఎంతో సహజంగా వుండి వాస్తవానికి దగ్గరగా రూపొందింది నవల మొత్తం.

మేము ఇటీవలే స్వంతఇల్లు కట్టాము. అప్పుడుమేంపడినబాధ, ఇబ్బందులుఅన్నీ ఈ నవలలో కళ్లకు కట్టినట్లు అన్పిం చాయి. పొలం, బంగారాలు అమ్మివేసి దొరికినచోటల్లా అప్పులుతెచ్చి, దూరపు బంధువుల దగ్గరకూడాఅప్పులుచేసి మొత్తా నికి ఇల్లు పూర్తిచేశాము. అంచనాకుమించి రెట్టింపుఖర్చయినా ఇప్పుడు మేం అనుభ వించే తృప్తి చెప్పలేనిది. లోనుకోసం పడినపాట్లు, కూలీలతో అవస్థలు అవన్నీ మాటల్లో చెప్పలేం. అయితే మనిషికి నిత్యావసరాలైన కూడు, గుడ్డతోపాటు గూడుకూడాఏర్పరచుకున్నామన్న ఇప్పటి తృప్తిముందు మిగిలిన అప్పులు పెద్దబాధ అన్పించటంలేదు. కొద్ది సంవత్సరాలలో అవన్నీ తీరిపోతే నిశ్చింతగా వుండవచ్చు. ఇల్లు కట్టినన్నాళ్లు డబ్బుకొరత, బంధు వులు స్నేహితుల ఎత్తిపొడుపులు, కొన్ని మోసాలతో ఎంతో బాధపడ్డాము. అవన్నీగూడు నవల్లో చదివేసరికి 'మా లాంటి వాళ్లెందరో గదా' అన్పించింది. ఈ నవలను అపురూపంగా మా లైబ్రరీలో దాచుకుని అప్పుడప్పుడూ చదవాలని అన్పించింది. ఆ నవలలోని విషయాలన్నీ మా స్వానుభవంకావటంతో నా మనస్సుకు బాగా హత్తుకుంది. నవల మొదలుపెట్టి పూర్తయ్యేవరకు ఏకబిగిని చదివేశాము. శైలి, సంభాషణలు ఎంతో హృద్యంగావున్నాయి. ఒక్కమాటలో చెప్పాలంటే నవల చదివిన తర్వాత నా అభిప్రాయాన్ని అలవాటులేకున్నా "చతుర సమీక్ష"కు రాయకుండా వుండలేక పోయాను.

—ఐ. హేమనళిని
హైదరాబాద్.

చతుర సమీక్ష కూపన్, వివరాలు - 124, 125 పేజీలలో

చతుర ప్రహేళికం

## 40 ఏళ్ళ నిద్రలేమి

క్యూబాకు చెందిన టోమాస్ ఇజ్క్వెర్డో గత 40 ఏళ్ళనుంచీ కనీసనిద్రకు కూడా నోచుకోలేనంత నిద్రలేమితో బాధపడుతున్నాడు. అందువల్ల అతని కళ్ళకు శ్రమ ఎక్కువై, అవి మరీ సున్నితంగా తయారవటంతో వాటికి రక్షణగా నల్ల కళ్ళద్దాలను వుపయోగిస్తున్నాడు. ఓ బట్టల మిల్లులో ఉద్యోగం మానుకున్న టోమాస్ 53 ఏళ్ళ వయసులో కూడా మానసికంగా చురుకుగా వుంటూ, తన వయసుకంటే తక్కువవాడిలా కనబడతాడు.

గత 16 ఏళ్లుగా టోమాస్‌పై పరీక్షలు జరుపుతున్న క్యూబాలోని ప్రముఖ మానసిక వైద్యుడు డాక్టర్ పెడ్రో గార్షియా ఫ్లీట్స్, "ఇలాంటి రోగి వైద్య చరిత్రలోనే అరుదు. ప్రపంచంలో ఎక్కడా, ఎవరూ ఈ విధంగా నిద్రలేమితో బాధపడినట్టు ఆధారాల్లేవు'' అంటున్నాడు. 1970లో ఆయన, హవానా సైకియాట్రిక్ హాస్పిటల్‌కు చెందిన మరికొందరు వైద్యుల బృందం కలిసి టోమాస్‌ను 24 గంటల పర్యవేక్షణలో వుంచి అతన్ని దాదాపు 2 వారాలపాటు అనుక్షణం గమనించారు. టోమాస్ కళ్లు మూసుకుని నిద్రపోయే ప్రయత్నం చేసినా అతని మెదడు పూర్తి మెలకువ స్థితిలో వున్న వ్యక్తి మెదడుకు మల్లేనే పనిచేస్తున్నట్టు వారు జరిపిన పరీక్షల్లో తేలింది. "అతనికి సహజంగా నిద్రించే భాగ్యంలేదు. అతను వాడే మందులవల్లకొద్దిగామగతనిద్రపోగలడు" అని ఆ వైద్యులు తేల్చారు.

సాధారణంగా మానవులు నిద్రద్వారా విశ్రాంతి పొందకపోతే ఎన్నో రోజులు బతకలేరు. అందువల్ల టోమాస్ నిర్ణీత కాలానికి కొన్ని గంటల చొప్పున విశ్రాంతి తీసుకుంటాడు. కొన్ని మందులు కలిగించే మత్తులో కూడా అతను మెలకువస్థితిని తప్పించుకోలేకపోతున్నాడు.

వైద్యులు, టోమాస్ మెదడులో నిద్రకు అవసరమైన మెకానిజం దెబ్బతినటమే అతని నిద్రలేమికి కారణం అంటున్నారు. కాని, టోమాస్ చెప్పే కారణం వేరు. అతనికి పిన్నవయసులో టాన్సిల్స్ ఆపరేషన్ జరిగింది. అప్పుడు కంఠంలో రక్తనాళాలు పగిలి నోట్లోంచి రక్తంపడటంతో తను మరణిస్తానేమోనని భయం పట్టుకుంది టోమాస్‌కి. అదే మనసులో తిరుగుతూ పీడకలలు రావటంతో వాటి నుంచి తప్పించుకోడానికి అతను నిద్రను ఆపుకోడానికి ప్రయత్నించేవాడు. అలా కొన్ని వారాలు గడిచేసరికి తను పూర్తిగా నిద్రకు దూరమైనట్టు గ్రహించాడు టోమాస్.

ఆ తర్వాత టోమాస్‌కు నిద్రించే శక్తిని తిరిగి రప్పించడానికి 40 మందికి

# బెణుకుల బాధతో తన గొప్ప రోజు పాడవడం దేనికి?




## నయం చేసే శక్తి మీ చేతుల్లోనే ఉంది.

మీ చేతుల వెచ్చని సౌమ్యమైన స్పర్శ, అయొడెక్స్‌లో గల నయం చేసే శక్తి — ఇవే తనకి కావలసినవి. అందుకే అయొడెక్స్‌ను అందుబాటులో ఉంచుకోండి. ఎందుకంటే అయొడెక్స్‌లో, గాయపడిన ధాతువులను నయం చేసే అయొడిన్, నొప్పిని తగ్గించే మిథైల్ శాలిసిలేట్ చేరి ఉన్నాయి.

**అయొడెక్స్ రోజుకు రెండుసార్లు రెండింతలు గుణకారి.**

నొప్పి తగ్గేవరకూ, ఆ తర్వాత రెండు రోజుల వరకూనూ రోజుకు రెండుసార్లు అయొడెక్స్ వాడమని సిఫారసు చేస్తున్నారు డాక్టర్లు. ఎందుకంటే, నొప్పి ఒక లక్షణం మాత్రమే కాగా అసలు సమస్య లోపలి ధాతువుకైన గాయం.

కనుక మీ ఆప్తులు ఎవరైనా బెణుకులు, కండరాల పట్లు, కీళ్ల పట్లు, ఒళ్లునొప్పులతో బాధ పడటం జరిగితే అయొడెక్స్ మర్దించండి. రోజుకు రెండుసార్లు. తమని రెండింతలు శీఘ్రంగా మళ్లీ చురుకుగా చేసినందుకు వారు మీకు ఋణపడి ఉంటారు.

**అయొడెక్స్®** — నయం చేసే శక్తి గల నమ్మకమైన బామ్.

**SKF** — ఎస్‌కేఎఫ్ ఉత్పాదన.

ELL-1509



పైగా డాక్టర్లు హిప్నాసిస్, ఎలక్ట్రోషాక్ ట్రీట్‌మెంట్, ఆక్యుపంచర్, డ్రగ్స్ లాంటి పద్ధతుల ద్వారా ప్రయత్నించినా ప్రయోజనం లేకపోయింది. చివరికి టోమాస్ భూతవైద్యులను కూడా కలిశాడు.

టోమాస్ నిద్రలేమివల్ల బట్టలమిల్లులో రెండు షిఫ్టుల్లో పనిచేస్తుండేవాడు. 1968లో అనారోగ్య కారణాల వల్ల ఆ వుద్యోగం మానుకున్నాడు. టోమాస్ క్రమేణా జ్ఞాపకశక్తి, ఆత్మవిశ్వాసాలను కోల్పోతున్నట్టు అతని వైద్యుడుగార్షియా ఫ్లెడ్స్ వెల్లడించాడు. ప్రస్తుతం టోమాస్ తన మిత్రులకి, ఇరుగుపొరుగువారికి రకరకాల పనులుచేసి సాయపడుతూ కాలక్షేపం చేస్తున్నాడు. అతను తెల్లవారు జామున 4 గంటల తర్వాత భావాతీత ధ్యానం లేదా మత్తుమందులను ఆశ్రయించి విశ్రాంతి పొందుతాడు.

## లేడీ పైలెట్లు

**1985** నవంబరులో మొట్టమొదటిసారి పైలెట్లతో సహా అందరూ మహిళా సిబ్బందేవున్న విమానం కలకత్తానుంచి సిల్‌చార్‌కు ప్రయాణించింది. ప్రస్తుతం మనదేశంలో 60 మందివరకూ మహిళా పైలెట్లు వున్నారు. వారిలో నలుగురు క్రమం తప్పకుండా విమానాలు నడుపుతుంటారు. మరో 15మంది మహిళా పైలెట్లు వారికి సంబంధించిన అంతర్జా

తీయ సంఘం 'నైన్టీనైన్స్' భారతీయ విభాగంలో సభ్యులు.

మొదట్లో మోహినీష్రాఫ్ అనే మహిళ పైలెట్‌గా శిక్షణ తీసుకుంటున్నపుడు అదే శిక్షణలోవున్న తోటి మగవాళ్లు ఆమెను చులకనగా చూసేవారు. "మహిళలు పైలట్ వృత్తిలో చేరటంద్వారా పురుషుల అవకాశాలను పోగొడుతున్నారని, శిక్షణ పొందుతున్న మహిళా పైలెట్ ఏవో వ్యక్తిగతకారణాలవల్ల మధ్యలోవిరమించుకుంటే అది పైలెట్ కావాల్సివున్న మరో పురుషునికి అవకాశాన్ని నిరోధించటమే అవుతుందని మగపైలెట్ల వాదన.

విదేశ విమానయాన సంస్థలు కొన్ని మహిళా పైలెట్‌కి వివాహమై బిడ్డ కలిగితే ఆమె విమానంలో పైలెట్‌గా వెళ్ళినపుడు ఆ బిడ్డను సాకేభారం తమపై పడుతుందనే ఆలోచనతో మహిళా పైలెట్లను నియమించేందుకు సందేహిస్తున్నారు. అయినా ఓ పశ్చిమదేశ విమానయాన సంస్థలో ఓ తండ్రి కెప్టెన్‌గా, కూతురు కోపైలెట్‌గా పనిచేస్తున్నారు. ఒక్కొక్కసారి ఆ ఇద్దరూ ఒకే విమానంలో పనిచేసిన సందర్భాలు కూడా వున్నాయి. రష్యాలోనూ కెప్టెన్, కోపైలెట్, ఫ్లైట్ ఇంజనీరు ఉద్యోగాలలో మహిళలను నియమిస్తున్నారు.

యునైటెడ్ స్టేట్స్‌లో దాదాపు 20 వేలమంది మహిళా పైలెట్లున్నారు. వీరిలో కొందరు మహిళా పైలెట్లు అంతరిక్ష యానం సైతంచేశారు.

అయితే ఓ యూరప్‌దేశంలో మహిళా పైలెట్ గర్భవతి అయితే ఆమె లైసెన్సు రద్దయేట్టు ఓ ప్రభుత్వ నిబంధనవుంది. గర్భవతి అయిన ఓ మహిళా పైలెట్‌ను



నయాన సంస్థకు 1లక్ష డాలర్లు వృథా అయినట్టే. అందువల్ల అక్కడ ఆడవారిని తీసుకోవడానికి ముందుకు రావటంలేదు. ఇజ్రాయిల్ తూర్పుజర్మనీలోని విమాన యాన సంస్థలలోకూడా మహిళా పైలెట్ల నియామకంపట్ల వ్యతిరేకతేవుంది. మన దేశంలో మహిళా పైలెట్లకు పరిస్థితులు ప్రోత్సాహకరంగానేవున్నాయి. వారిసంఖ్య భవిష్యత్తులో మరింత పెరిగే అవకాశ ముంది.

## జంతువుల నేరాలు

చట్టాన్ని గాడిదతో పోల్చాడు ఒక న్యాయవాది. చట్టం అంత అవివేకమైం దని ఆయన భావం కాబోలు. చట్టంలోని లొసుగులద్వారా నేరం చేసిన కొందరు మనుషులు శిక్ష పడకుండా తప్పించుకుం టుంటే, జంతువులను శిక్షించడానికి కూడా చట్టాలను చేసేందుకు తయారయ్యాయి కొన్ని దేశాలు. పూర్వం గ్రీకులో ఓ మనిషి మరణానికి ఏదైనా జంతువు కారణ మైతే చట్టం ప్రకారం దాన్ని దేశంనుంచి బహిష్కరించేవారు. ఇతర దేశాలలో కూడా జంతువులకుఇలాంటిశిక్షలేవుండేవి. అలా కుక్కలు, పందులు, గుర్రాలు, ఆవులు, చుంచులు, చిలకలు, కోడిపెట్టలు చట్టప్రకారం శిక్షింపబడ్డాయి.

14వ శతాబ్దంలో ఫ్రాన్సులోని నార్మండీలో ఓ పసిబిడ్డ చావుకి కారణ మైనందుకు ఓ పందిని బహిరంగంగా వురి తీశారు. దానికి మనిషిలా బట్టలు తొడిగి వురికంబం వద్దకు తీసుకొచ్చారు. మరో మరణంలో దోషి అయిన ఓ పందిని మామూలు నేరస్థులతో జైలులో పెట్టారు.





రోపణపై ఉరితీసేవారేగాని అది చిన్న పిల్ల కావటంతో వదిలేశారు. 1314లో ఓ మనిషిని కుమ్మి చంపిన ఎద్దును జైల్లో పెట్టి, కోర్టులో విచారణ చేసి, ఉరిశిక్ష విధించారు.

ఆస్ట్రేలియాలో ఓ పెద్ద మనిషిని అసభ్యకరమైన మాటలతో అవమానించి నందుకు ఓ చిలకపై దావా వేయబడింది. కోర్టులో జడ్జితో కూడా చిలకఅదేవిధంగా మాట్లాడింది. జడ్జి కోపంతో చిలకకు ఉరిశిక్ష విధించబోయాడు. కాని తర్వాత విచారణలో చిలక నేర్చుకున్న మాటలను అలవాటుకొద్దీ పలుకుతోందే తప్ప, ఎవరినీ అవమానించడానికి కాదని తేలింది. దాంతో చిలకకు శిక్ష తప్పింది.

కొన్నేళ్ళ క్రితం ఉత్తరప్రదేశ్‌లో ఓ మెజిస్ట్రేటు ఒక దున్నపోతుకు జైలుశిక్ష విధించి అందరినీ ఆశ్చర్యపరిచాడు. కాని దున్నపోతుని జైల్లో వుంచేందుకు జైలు వార్డరు నిరాకరించాడు.

1947లో స్విట్జర్లాండులోని బేజెల్ కోర్టులో ఓ కోడిపెట్ట గుడ్లు పెట్టటం లేదని వేసిన దావాలో అది నిజమేనని రుజువైంది. కోడిపెట్టకు సజీవంగా కాల్చి చంపే శిక్ష విధించబడింది. 1942లో జూరిచ్ కోర్టులో, ఇద్దరు బాలికల్ని చంపిన ఓ తోడేలుకిబహిరంగ ప్రదేశంలో ఉరితీసే శిక్షపడింది.

1932లో కెంటకీలోని కోర్టులో, ప్రమాదకరమైనవిగా భావించిన తొమ్మిది కుక్కలకు మరణశిక్ష విధించారు. మరణ శిక్షను అమలు చేసేటప్పుడు మనిషి చివరి కోరిక తీర్చినట్టుగానే, కుక్కలకు మంచి ఆహారం పెట్టి తర్వాత శిక్షను అమలు చేశారు.





...అట్లైనచో హరిని ఈ స్తంభమున చూపగలవా?
హరి ఎందెందు వెదకిన అందందే గలడు-కానీ ఆ స్తంభమును ఛేదించుట అసాధ్యము తండ్రీ! దాన్ని నాగార్జున సిమెంట్ తో నిర్మించినారటగదా!
MAM -17

# అమృతతర్పణం

కొమ్మిరెడ్డి
విశ్వమోహనరెడ్డి



కుండపోతగా రాత్రంతా కురిసిన వర్షం తెల్లవారేటప్పటికి తెరపిన పడింది. రోడ్ల వెంటా, వీధులలోనూ, మురికికాల్వలలోనూ పేరుకుపోయిన చెత్త ఆ దెబ్బతో ప్రవాహాలలోనికి జారుకుంది. ఎండల్లో వేగిపోయిన భూమి, నెర్రెలు చీలి, దుమ్ము లేచినమట్టి చప్పగా అణగిపోయింది. ఎక్కడ చూసినా సముద్రంలా నీరు! అకాల వర్షం అగ్గిలాగా ఊడ్చివేసిందన్న సామెత నిజమయింది.

రాజ్యలక్ష్మి ఏడుగంటలకు మంచం మీద లేచి కూర్చుంది. తినడం, పడి నిద్రపోవడం అలవాటయిన ఆమెకు రాత్రి కురిసిన కుంభవృష్టిని గురించి తెల్లారి చూస్తేగానీ అర్థంకాలేదు. రాత్రి వర్షం పడుతున్నట్లు అనిపించింది గానీ, అదేదో కలలోలా భావించింది. ఎండాకాలం వర్షం కురియడమేమిటి? సమాజం భ్రష్టు పట్టినట్టే, ఋతువులు కూడా గతులు తప్పాయేమో? అనుకుంటూ మంచం దిగింది. కాలు ఎత్తివేస్తూ కిటికీదగ్గరకు చేరి బ్రష్షూ, పేస్టూ తీసుకుని దొడ్లోకి వెళ్ళింది. బాత్‌రూంలో అరగంటసేపు రోజూ ఆలోచించే ఆలోచనలతోనే పండ్లు తోముకుంటూ కాలం గడిపింది. ముఖం కడుక్కుంటూండగా తలుపు చప్పుడయితే వెనుతిరిగి చూసింది.

శ్యాంరావు ఎదురుగా ఉన్నాడు. ఆమెనుచూసి వెనుకడుగువేసి నిలబడ్డాడు.

"అయిందా రాజ్యం ?" అన్నాడు ఆమెనుచూస్తూ.

"అయింది బావా.... వస్తున్నాను" అంటూ బ్రష్షు తీసుకుని బయటకు నడవబోయింది.

తలుపు దగ్గరున్న అతడు ఆమె చెయ్యిపట్టుకున్నాడు.

ఆ హఠాత్ సంఘటనకు భయపడుతూ ఆమె చెయ్యి లాక్కోబోయింది కానీ బయటపడలేదు.

"భయపడుతున్నావా రాజ్యం! నీకు ఎటూ పెళ్ళికాదు. బంగారంలాంటి సౌందర్యాన్ని అడవిపాలు చేయడం ఎందుకు...?" అన్నాడు ఆర్ద్రోక్తిలో ఆగి ఆమె ముఖంలోకి చూస్తూ.

"ఛీ ఛీ... ఇదేం పని బావా! కనీస మర్యాదకూడా లేదా?" విదిలించుకుంటూ బయటకు పోబోయింది. కాని బయటకు పోకుండా రెండో చెయ్యి అడ్డుపెట్టి, "జీవితం సుఖమయంకావాలంటే సాహసం చేయాలి రాజ్యం! నువ్వంటే నాకు ఎంతో ప్రేమ! నీ అవివాహితనం చూస్తే నాకు జాలి! నీవు సుఖపడాలంటే ఇంతకంటే మార్గంలేదు'' అన్నాడు.

వణుకుతున్న చేతిని లాక్కోడానికి ప్రయత్నించిన రాజ్యానికి అది చేతగా లేదు. శరీరం చలించిపోతున్నది. తాను అతడిని గురించి ఎప్పుడూ ఆలోచించ లేదేమో, ఇంత హఠాత్తుగా ఊహించనిది జరిగేసరికి ఆమెకు భయం భయంగా ఉంది. అతని బారినుండి ఎలా తప్పించు కోవాలో ఆలోచిస్తున్నది.

అంతలో శ్యాంరావు కూతురు సునీత అటు వచ్చింది. వారిద్దరినీ ఆ స్థితిలో చూస్తూనే అక్కడినుండి లోపలకు వెళ్ళింది. సునీతను చూసి శ్యాంరావు రాజ్యలక్ష్మి చెయ్యి విడిచాడు. రాజ్యలక్ష్మి ఛీత్కారంగా అతడి వైపుచూపి లోపలకు వచ్చింది.

ఆమెను చూస్తూనే అనసూయ దగ్గరకు వచ్చి జుట్టుపట్టుకుని ఈడ్చిపడవేసింది. ''ఏమిటే రంకులాడీ! పొద్దున్న లేచి నప్పటినుండే రంకుతనం సాగిస్తున్నావ్?"





అంటూ కొట్టింది.

రాజ్యలక్ష్మి గుడ్లనీరు గుక్కుకుంటూ, ''నేనేం చేశాను అక్కయ్యా?'' అంది అమాయకంగా.

"ఇంకా ఏం చేయాలే! నా కొంప ముంచడానికి సిద్దపడ్డావు. నా మొగుణ్ణి వలలోవేసుకుని, అంతా అనుభవిద్దామను కుంటున్నావ్!ఒసేయ్...నీకురంధిగావుంటే బయట ఎక్కడయినా చూసుకోవే! నా కాపురంలో నీళ్ళుపోస్తావెందుకు?" అంది.

అంతలోనే తండ్రి సూర్యం అటుగా వచ్చాడు-''ఏమిటే?'' అంటూ

"ఇంకేముంది నాన్నా!ఇది ఆయనను బుట్టలోవేసుకుని నా కాపురం నాశనం చేయడానికి సిద్దపడింది. పచ్చని కాపురం గంగలోకలపడానికి త యా ర యి ం ది" అంది.

"ఏం చేసిందిప్పుడు? పొద్దున లేచి నప్పటినుండీ ఒకే అరుపులు?"

"ఆఁ! నీకు అరుపుల్లాగే ఉంటుంది మరి! ఎద్దులాగా పాతికేండ్లు వచ్చినదానికి పెళ్ళిచేయకుండా ఇంట్లో అట్టిపెట్టుకుని, జనంమీద అది ఎగబడుతూ ఉంటే చూస్తూ కూర్చో! కొంపకు మంచి పేరు తెచ్చిపెడుతుంది" అరచింది అనసూయ ఆక్కసుగా.

"అది ఎవరి కొంప కూల్చిందని నీ బాధ! ఎవరి జోలికీ వెళ్ళదు. దాన్ని పట్టుకుని సతాయిస్తావెందుకు?"

"అంతకంటే పొద్దున్నే నాకు వేరే పనేముంది? ఇది నా మొగుణ్ణి తగులు కుంది. నన్నూ, నా పిల్లలనూ బజారున పడేస్తున్నది. పొద్దునలేస్తూనే ఆయనతో బా త్ రూ ం లో సరాగాలాడుతున్నది. ఏదో సామెత ఉందిగా 'ఎక్కడా దొరక్కపోతే అక్కమొగుడే గతి' అంటూ! ఇది ఆ సామెత నిజం చేసింది" అంటూ ఏడుపుమొదలెట్టింది అనసూయ.

సూర్యం నమ్మలేనట్లు రాజ్యలక్ష్మి వైపు చూశాడు.

రాజ్యం తలెత్తి తండ్రివైపు చూస్తూ, "అంతా అబద్దం నాన్నా! బాత్‌రూం దగ్గర బావ నా చెయ్యి పట్టుకున్నాడు" అంటూ లేచి నిలబడింది.

"ఆయనకు అంతకంటే పనేముందే! వగలాడిగా తయారయ్యావ్! నీకు పొగ రెక్కిందే! అది ఎవరు తీర్చుతారా- అని తిరుగుతున్నావ్! నెలకు పదిహేనువందలు సంపాదించుకునే బావమీద కన్నుపడింది. అసలే అమాయకుడు. నీ బుగ్గల సొంపులు చూస్తూ నీవు రెచ్చగొడితే తల ఒగ్గక ఏం చేస్తాడే?"

తాను అతన్ని లోబరుచుకున్నానని అనసూయ అంటుంటే పెద్దగా ఏడ్చింది రాజ్యం! అక్కడినుండి వసారాలోకి వచ్చి గోడకి చేరగిలబడింది. సూర్యం ఆమె దగ్గరగావచ్చి "అసలు ఏం జరిగిందే?" అన్నాడు, ఇద్దరు కూతుళ్ళమధ్య సంఘర్షణ అర్థంకాక! రాజ్యంజరిగింది చెప్పింది.

"వాడు మనిషా! పశువా! ఒంటరిగా వున్న ఆడపిల్ల జోలికి రావడం" అంటూ అరిచాడు సూర్యం. అంతకంటే గట్టిగా తిడుతూ అరుస్తున్నది అనసూయ. శ్యాంరావు నేరుగా తన గదిలోకి వెళ్ళి పడుకున్నాడు. రాజ్యాన్ని ఆక్రమించు కోవాలని చాలారోజులుగా ఆలోచిస్తు న్నాడు. భార్యకంటే అదే మంచి అంద గత్తె! వేరే ఆధారంలేని వ్యక్తి కాబట్టి తప్పకుండా లొంగుతుందనే ధైర్యం అతడికివుంది. అసలే అవిటిది! ఈ దేశంలో అవిటివాళ్ళని చేసుకునే అవివేకులు ఎవరూలేరు. పెళ్ళిపెటాకులు

ఉన్నతమైన నాణ్యత

ప్రియలోనే వుంది




ఎన్నిక చేసిన దినుసులన్నీ సమపాళ్లలో
మేళవించి అద్భుతమైన రుచులతో
రూపొందించినవే ప్రియ పచ్చళ్ళు.
మీ భోజనానికి సంతృప్తి సరిజోడు-ప్రియ
నేడే మీ ప్రియను మీ ఇంటికి తీసుకువెళ్ళండి.

ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI MARKETING
PRIVATE LIMITED

ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ

Kiron/PF/831

లేకుండా పాతిక సంవత్సరాలుగా ఇంటిలో మగ్గిపోతున్నది! అందువల్ల సులభంగా లొంగిపోతుందనే నమ్మకంతో, ఎప్పటి కప్పుడు రెచ్చగొట్టి లొంగదీసుకుందా మనుకుంటున్నాడు. అతనికి ప్రత్యేకంగా ఆమెమీద మమకారమేమీలేదు. కేవలం అవసరానికి వాడుకోవాలన్న ఆలోచనే! చివరకు ఒంటరిగా ఈరోజు బాత్‌రూంవద్ద కనిపించడంతో చొరవచేశాడు. కాని,అది తన కూతురు కంటపడి రసాభాస అయింది. అసలే భార్య అనుమానం మనిషి! ఈ దెబ్బతో వున్నవీలేనివీ కలిపి వాగుతున్నది. ఆమె ఎదురుగా వెళ్ళి జరిగింది చెప్పగల ధైర్యం అతడికి లేదు.

శ్యాంరావు రెండో కూతురు సీత కాఫీ తెచ్చిఇచ్చి, "అమ్మ రమ్మంటున్నది నాన్నా" అంది.

"నీవు పద... వస్తాను" అంటూ కాఫీ తాగడంలో మునిగిపోయాడు. కాఫీ తాగేలోగా అనసూయ అక్కడకు వచ్చింది. ఏడుస్తూ, "ఆవగలాడివలలోపడి మా బ్రతుకులు ఏం చేయదలచుకున్నారు? కనీసం పిల్లలయినా కనిపించడంలేదా? ఎన్నాళ్ళనుండి మీరంకు జరుగుతున్నది" అంది నిలదేసి మాట్లాడుతూ.

"నాకేం సంబంధంలేదు అనూ! వొడ్లో రాజ్యంవుంది. నేను బయటనుండి తలుపు తోశాను. రాజ్యం బయటకు వస్తూంటే చేయి తగిలింది'' అన్నాడు అమాయకంగా.

"ఈ నంగనాచి మాటలు ఎప్పుడు నేర్చుకున్నారు? మీరేదో మంచివారను కున్నాను. ముగ్గురు పిల్లలు కలిగినతర్వాత కూడా ఇంత పచ్చిగా తిరుగుతూ, ఇంకా నన్ను నమ్మించదలచుకున్నారా?" అని చుట్టూ చూసి, "సూట్‌కేసు దగ్గర పెట్టు కున్నారెందుకు?'' అంది.

''శలవు అయిపోవస్తున్నది... వెళ్ళి పోతున్నాను. ఆదివారం వస్తాను"

"అంటే తమరి భాగోతం బయట పడిందని తప్పుకుంటున్నారన్నమాట" అంటూనే విసవిసగా బయటకు వచ్చింది.

రాజ్యం వసారాలో గోడ కానుకుని కూర్చుని ఆలోచిస్తున్నది. ఇలా ఎందుకు జరిగింది? రాత్రివచ్చిన అకాలవర్షంలాగే, తన జీవితంలో విషపుమచ్చ ఒకటి హఠాత్తుగా తనకు తెలియకుండానేపడింది. అరిటాకుమీద ముల్లుపడినా తట్టుకోవచ్చు గానీ, ఆడదానిమీద నిందపడితే అది చెరిగిపోనిమచ్చ! తనకూ కోరికలున్నాయి, ఆలోచనలున్నాయి, ఊహలున్నాయి. నిజమే కానీ ఇలా జరగాలని తాను ఎన్నడూ కోరలేదు; ఆలోచించలేదు. అందరూ మంచివాడంటుంటే బావ మంచి వాడనుకుంది. కాని అతని నిజరూపం ఇప్పుడు చూస్తున్నది. తప్పు ఎవరిదో కనీసం విచారించకుండా అక్క తన మీద మరింత విషం చల్లుతున్నది. దీని కంతటికీ కారణం తాను వారిమీద ఆధార పడటంవల్లనా? లేక కూర్చుంటే లేవలేని-లేచినా నడువలేని-తన అవిటితనంవల్లనా? కారుతున్న కన్నీళ్ళను ఆపుకోలేక పోయింది.

సూర్యం వచ్చాడు. "జరిగిందేదో జరిగిపోయింది. దాన్ని గురించి ఎందుకు ఆలోచించి మనసుపాడు చేసుకుంటావు? వెళ్ళు...వెళ్ళి కాఫీ తాగు'' అన్నాడు మెత్తగా.

రాజ్యం లేవలేదు. లేచే ఓపికాలేదు. లేచి వెళ్ళినా తాగడానికి కాఫీ ఇవ్వకపోగా, ముఖంమీదనయినాపోయగల సమర్థురాలు అక్క!



పక్క ఇంటినుండి "రాజక్కాయ్!" అంటూ ఇద్దరు పిల్లలు సంచులు భుజాలకు తగిలించుకుని వచ్చారు. ఎదురుగా కూర్చుని పలకలు బయటకుతీశారు. ఊరక కూర్చునేకంటే ఏదో ఒక వ్యాపకం వుంటే బాగుంటుందని ఆ ఇద్దరుపిల్లలకూ చదువు చెబుతున్నది. వారిద్దరికీ పాఠం రాయమని చెప్పి తిరిగి తన ఆలోచనలో పడింది.

అసలే అనసూయకు భయంకరమైన కోపం! ఇక ఈ అనుమానంతో ప్రతిరోజూ వేధిస్తుంది. తనమీద ఆమెకు ఏనాడూ సదభిప్రాయంలేదు. ఇహ ఈ వంక పెట్టుకుని సాధించడానికి ప్రయత్నిస్తుంది. ఆమెకు దూరంగా ఉండటం మంచిది! నిలిచిపోయిన తన చదువును తిరిగి కొనసాగించాలి. కనీసం భాషా ప్రవీణ పూర్తి చేసి ఉద్యోగం సంపాదించు కోగలిగితే తాను తన కాళ్ళమీద నిలబడ గలుగుతుంది. ఒకరిమీద ఎల్లకాలం ఆధారపడితే, తన అవిటితనం చూపించి వేధిస్తారు

సూర్యం కాఫీ గ్లాసుతో వచ్చాడు. గ్లాసు తీసుకుని తాగుతూ కొబ్బరిచెట్టు మీదున్న పిచ్చుకలకేసి చూస్తున్నది.

"నాన్నా! నేను చదువుకుంటాను'' అంది కాసేపాగి తండ్రివైపు చూస్తూ.

అతడికి కూడా ఇంటిలో పరిస్థితి బాధగానేవుంది. ఉన్న ఇద్దరు కూతుళ్ళలో పెద్దకూతురు పెండ్లయి, ముగ్గురు పిల్లలతో సంసారం చేసుకుంటున్నది. పాతిక సంవత్సరాల వయస్సు వచ్చినా రెండో కూతురికి పెళ్ళికాలేదు. ఉన్న ఒక్క కొడుక్కూ చిన్న కూతురంటే ఎప్పుడూ సానుభూతి లేదు. వారి ఇద్దరి మధ్య ఎప్పుడయినా రాజ్యం బతుకు బద్దలవుతుంది. భార్య చనిపోయి రెండు సంవత్సరాలయింది. భార్య ఉండగా పెద్ద కూతురు భర్త దగ్గరే ఉండేది. తల్లి చనిపోయిన తర్వాత, సంసార బాధ్యత వహించే పేరుతో ఇంటిలో జొరబడింది. అన్ని పెత్తనాలూ ఆమెవే! ఆర్థికంగా తగిన జీతం, అంతకు మించి కావలసినంత లంచాలూ ఉన్న ఉద్యోగం కావడం మూలంగా, అల్లుడిది ఆ ఇంటిలో పైచేయి అయింది. ఉన్న పొలాలు పండకపోవడంతో ఆ పొలాలకు పెట్టుబడి పెడుతూ వచ్చింది పెద్ద కూతురు. దాంతో వాళ్ళు చెప్పినట్లు తను నడవవలసి వచ్చింది. ఈ పరిస్థితిలో రాజ్యానికి పెళ్ళి చేయడం అసంభవం! ఇంట్లో పెట్టుకుని, ప్రతి నిముషం ఈ అనుమానాలతో వేధించడం మంచిదికాదు. చదువుకుంటే చదువుకోనీ! ఇంట్లో లేకుండా బయటకు వెళ్ళడం ఒకందుకు మంచిదే- అనుకున్నాడు సూర్యం.

"సరే... ఆలోచిద్దాంలేమ్మా!కాలేజీలు తెరిచే టైముందిగా!" అనేశాడు.

"ఇప్పటినుండే ప్రయత్నం చేస్తే మంచిది నాన్నా! ఆడపిల్లలకు ప్రత్యేకంగా ఉన్న కాలేజి ఆదొక్కటే! సీట్లు పూర్తయితే తర్వాత దొరకడం కష్టం?"

"సరే! నేను ఆ విషయం కనుక్కుంటాను. నీవు మనసులో భయాలు పెట్టుకుని బాధపడవద్దు" అంటూ బయటకు వెళ్ళిపోయాడు.

సునీత బయటకు వచ్చింది. "అమ్మ పిలుస్తున్నది... రా" అంది నడుంమీద చేతులు పెట్టుకుని రాజ్యం వైపు చూస్తూ.

"వస్తాను పద... పిల్లలకు పాఠాలు చెప్పి" అంది తలెత్తకుండానే రాజ్యం. ఆ పిల్ల విసవిసా ఇంటిలోనికి వెళ్ళింది.

వెళ్తున్నా మనిలో ప్రపు ఎంత ంది ను నెంది రాజ్యం. పిల్లలు అఖండురాలు ! తెలివితేటలు బాగావున్నాయి. కాని, అవి కొంచెం అతిగా ఉన్నాయని బాధపడింది.

తర్వాత పిల్లలకు పాఠం చెప్పడంలో మునిగిపోయింది.

ఆ రోజంతా అనసూయ ఏదో వంక పెట్టి చెల్లెల్ని తిడుతూనే ఉంది. చివరకు రాజ్యం ఈ తిట్లతో, అవమానంతో భోజనం చేయకుండా పడుకున్నా, అది కూడా తప్పుగానే జమకట్టి పొగరూ, పదమూ ఎక్కువైన అన్నం సహించక పడుకుండని తిట్టిపోసింది. ఆమె ఎందుకు తిట్టేదీ ఎవరికీ తెలియకున్నా, ఇంటిలో రాజ్యం మీద ఏదో ఒక సాధింపు ఎప్పుడూ ఉండేదే గనుక పెద్దగా పట్టించుకోలేదు. తండ్రి సర్ది చెప్పలేకపోతున్నాడు.

మరుసటిరోజే రాజ్యం బలపంతంపల్లి సూర్యం బయలుదేరాడు. కాలేజీలో సీటు దక్కించుకుంటే, ఆ ఇంటినుండి బయటపడవచ్చని ఆమె ఆలోచిస్తున్నది. ముందు ఆ వాతావరణంనుండి బయట పడితే తర్వాత చేయాల్సింది ఏమిటో ఆలోచించవచ్చు.

వాళ్ళు విజయవాడ వెళ్తున్నారని తెలిసి అనసూయ తండ్రిని పిలిచి అడిగింది-"అది చదివి ఏం ఊళ్ళు ఏలుతుంది నాన్నా! అసలే పంటలు పండక ఛస్తుంటే దానికయ్యే ఖర్చు ఎక్కడ తెచ్చి పెడతాం"

"ఒక ఎకరం పొలం అమ్మి తెచ్చి పెడదాం. తప్పేదేమిటే... అది కుంటిది. ఎప్పుడయినా మీ చేతుల్లో ఇలాగే బాధలు పడవలసిందే! చదువుకుని దాని బతుకు అది చూసుకుంటే ఎవరికీ భారంగా ఉండదుగదా"

"నిజమే! అయినా మన ఆర్థిక పరిస్థితి చూడాలిగా!

"కానీ!... ఏమవుతే అదే అవుతుంది" అన్నాడు సూర్యం.

ఆరోజే విజయవాడకు బయలుదేరారు.

ప్రిన్సిపాల్ అరుణను కలుసుకున్నారు. కాలేజీలో చేరే అవకాశం కలుగ చేయవలసిందిగా కోరింది రాజ్యం.

అరుణ తల ఊపింది- "నాలుగు సంవత్సరాలు చదివావుగదా! అప్పుడే మరో సంవత్సరం ఆగివుంటే ఈపాటికి ఉద్యోగం సంపాదించుకునేదానివి" అంది.

"నిజమే మేడమ్! కానీ ఎవరో 'ఆపరేషన్ చేస్తే కాలు వస్తుంది' అని మా వాళ్ళకు చెప్పారు. మావాళ్ళకు చదువు ముఖ్యంకాదు... కాలు బాగయితే చాలనుకున్నారు. మధ్యలో మాన్పించి హాస్పిటల్లో చేర్చారు. అక్కడ ఆపరేషన్ చేశారు.గాని లాభంలేదు. కాలు యథాప్రకారంగానే ఉంది. ఆ తర్వాత ఇంటిపరిస్థితులు చదువుకోకుండా చేశాయి. అందువల్లే మధ్యన నాలుగు సంవత్సరాలు వేస్టుపడింది" అంది రాజ్యం.

"సరే... ఈ సంవత్సరం పోరాడు. కాలేజీ చదువు పూర్తవుతుంది. తర్వాత మరో ఆరు నెలలు బి.యిడి ట్రయినింగు పూర్తిచేస్తే ఏదో ఒక ఉద్యోగం దొరక్కపోదు. నీలాంటివాళ్ళు ఈ సమాజంలో ఉద్యోగమనేది ఉండి, స్వంత కాబడి ఉంటేగానీ, తలెత్తుకుని బతకలేరు. లేకుంటే అయినవాళ్ళే కాకుల్లా పొడుస్తారు"

సూర్యం అన్ని విషయాలు ఆమెకు చెప్పాడు.ఆమె ఆశ్చర్యంగావిని-"రాజ్యం నాలుగు సంవత్సరాలు ఇక్కడ చదువు

కుంది. మంచిపిల్ల. ఎవరి విషయాలూ పట్టించుకోదని నాకు తెలుసు. ప్రత్యేకించి రాజ్యాన్ని నేను ఎప్పుడూ పరిశీలిస్తూనే ఉంటాను. సరే... జరిగిందేదో జరిగింది. ఆ అమ్మాయి తన బతుకు తాను బతుకుతుందిలెండి" అంది సానుభూతిగా.

రాజ్యంకళ్ళనీళ్ళతో తండ్రికివీడ్కోలు చెప్పింది. కాలేజికి అనుబంధంగా హాస్టల్ ఉంది. దాదాపు ఇరవై ఎకరాల ఆవరణలో కాలేజీ ఉంది. కాలేజీ హాస్టల్ భవనాలు ఎప్పుడో వందసంవత్సరాలనాటివి. వాటికి పక్కనే హైస్కూలు కొత్తగా కట్టించారు. రెండింటికీకలిపిఒకటేహాస్టల్. హాస్టల్లో తనకు కేటాయించిన గదికి తన పెట్టె చేర్చుకుంది. విశాలమైన గది. ఆమెతో బాటు మరో నలుగురు ఆ రూంలో వున్నారు. ఆమె సరిగా నడవలేని వ్యక్తి కావడంవల్ల కింది అంతస్తులోనే గది కేటాయించారు.

పిల్లలందరూ కాలేజికి వెళ్ళడంవల్ల ఒంటరిగా గదిలో పడుకొంది. ఒకనాడు ఆ ప్రాంతం సుపరిచితమైనదే అయినా చాలారోజుల తర్వాత మళ్ళీ ఈ వాతావరణానికి వచ్చిపడింది.

విలవిలమంటూ పిల్లలందరూ హాస్టల్ వైపు పరుగెత్తుకు రావటంతో సందడి ఆరంభమయింది. వారిలో చాలామంది అయిదు సంవత్సరాలుగా అక్కడచదువుకుంటున్నారు. కాగా మరికొందరు పది సంవత్సరాలుగా అక్కడే ఉంటున్నారు.

"రాజ్యమక్కవచ్చిందేవ్!" అంటూ ఒక అమ్మాయి రాజ్యం దగ్గరగావచ్చింది.

"ఎప్పుడొచ్చావ్ అక్కయ్యా! నేను గుర్తున్నానా?"

రాజ్యం నవ్వింది. "ఎందుకులేవూ! కాకపోతే మూడు సంవత్సరాలు ఇక్కడ లేను. అమాత్రం గుర్తు పట్టలేననుకున్నావా?"

చాలామంది బాలికలు వచ్చారు. అందరూ రాజ్యాన్ని పలకరించారు.

"ఏమిటీ...మళ్ళీ చదువు సాగించాలని వచ్చావా?" అంది ఒక అమ్మాయి. తల ఊపింది రాజ్యం.

"మంచిదే. మన తెలుగు టీచర్‌గారికి నువ్వయితేనే వాత పెడతావ్!మహాగర్విష్టి. ఇప్పటికీ దేవుడున్నాడని వాగుతుందే" అంది సుమతి.

స్నానాలు చేయడానికి అందరూ కదిలారు. ఉన్న రెండు పంపులవద్ద వంద మంది పిల్లలు నీళ్ళకొరకు పోట్లాడుకుంటున్నారు. మరోచోట బాత్‌రూం కొరకు నేను ముందంటే నేను ముందని పోట్లాడుతున్నారు.

"అక్కా.... ఈ జనంలో నువ్వేంపోగలవు? కొంచెం రద్దీ తగ్గనీ... నేను నీళ్ళు పట్టి తెస్తాను" అంది లలిత.

"ఈరద్దీ ఎప్పుడూ ఇలాగేఉంటుంది" అంది రాజ్యం.

"ఏం చేస్తాం? మనదేశానికి క్రమశిక్షణలేదు. మరి ఈ పౌరులకు మాత్రం ఎక్కడినుండి ఏడుస్తుంది?"

"హాస్టల్లో భోజనమదీ బాగా పెడతారా?"

కిసుక్కున నవ్వింది లలిత. "మామూలే.మార్కెట్లోని పుచ్చిపోయిన కాయలన్నీ మన హాస్టల్ వంటరూం వెతుక్కుంటూ వస్తాయి" అంటూ చీర కుచ్చెళ్ళు బొడ్లో దోపి బకెట్ చేతికి తీసుకుంది. పానిపట్ యుద్ధానికి కదిలిన బాబర్‌లా సీరియస్‌గా పంపు దగ్గరకు వెళ్ళింది. లలిత అంటే వారికి హడల్. ఎవరు పంపుకింద బకెట్ పెట్టినా తీసి

పట్టుకు వస్తుంది. ఆమె నోటికి వెరచి ఎవరూ పోట్లాటకు దిగరు. బకెట్‌తో నీళ్లు పట్టి, బాత్‌రూం వద్దకు తెచ్చింది. క్యూను ఛేదించుకుని లోపలికి తీసుకెళ్ళింది. లోపల బకెట్ పెట్టి, "లోపలకు ఎవరూ వెళ్ళవద్దు" ఆర్డర్ జారీచేసి రూం వద్దకు వచ్చి, "నువ్వెళ్ళి స్నానం చేసిరా అక్కా, తర్వాత నేను చేస్తాను" అంది.

రాజ్యం ట్రంకు పెట్టె తెరచి చీర, జాకెట్, లంగా, టవల్, సోప్‌బాక్స్ తీసుకుని బయటకు నడిచింది. ఆమెను చూస్తూ అందరూ నిలబడ్డారు. అంత మందిలో కుంటుకుంటూ వెళ్ళడానికి రాజ్యానికి సిగ్గేసింది. అయినా తప్పదు. జీవితంలో అనేక ఒడిదుడుకులు మామూలే. ఆ బాత్‌రూంలోనికి వెళ్ళి తలుపులేసుకుంది. అంతవరకూ లలిత తనకోసం నీళ్ళు తెచ్చుకుందని అనుకుంటున్న వారంతా నోళ్లు వెళ్ళబెట్టి చూస్తున్నారు.

"ఒసేవ్! ఈమెగారితో లలితకు ఎప్పుడు స్నేహమయిందే?"

"పాత పరిచయంలేవే! ఈమె మూడు సంవత్సరాల కిందట ఇక్కడే చదువుకుంటుండేదిగదా... అప్పటి పరిచయం. అయినా లలితమ్మగారు ఎంతసేపు స్నేహం చేస్తారు? ఎంతసేపట్లో పోట్లాడుతారు? మనకు తెలుసుగదా" సుమతి మాటలకు తల ఊపిందా అమ్మాయి.

హాస్టల్లో భోజనం ఎనిమిదిగంటలలోపే పూర్తిగావాలి. ఏ కారణం చేతనయినా ఎనిమిది గంటలకు పూర్తి చేయలేకపోతే ఆపూట పస్తు తప్పదు. కాలేజీ పిల్లలు దాదాపు వందమంది ఉన్నారు. మరో వంద మంది హైస్కూలు పిల్లలు ఉన్నారు. అందరికీ ఒకే హాస్టల్ కావడంతో రద్దీగా ఉంటుంది. హాస్టల్ ఫీజు చాలా తక్కువ కావడంతో స్థానికులు కూడా హాస్టల్






సీట్ల కోసం ఎగబడతారు.

"నువ్వు నడవలేవుగానీ, భోజనం ఇక్కడికే తెస్తాను" అంది లలిత.

"మేట్రన్ ఒప్పుకుంటుందో లేదో?"

"దాని తలకాయ! అది ఇంటికి మోసు కెళ్తుంది. ఇక్కడ నిబంధనలు ఏం అమలు చేస్తుంది? అతిగా సీల్గితే పుష్పపగల గొడతాను"

"వద్దులే. గొడవలెందుకు! చెప్పిచూడు దిగిరాలేనని. అంగీకరిస్తే తీసుకురా" రాజ్యం మాట పూర్తిగాకముందే పళ్ళెం చేతిలోకి తీసుకుని కిందకి పరుగెత్తింది లలిత! ఆ తర్వాత లలిత ఒక్కతే కాకుండా, చాలామంది పళ్ళాలలో అన్నం తెచ్చుకున్నారు. రూంలో కూర్చుని తినడం సాగించారు.

లలిత, రాజ్యం ఒక వైపుగా కూర్చు న్నారు. సుమతి పళ్ళెం చేత పట్టుకుని వారి వైపు వచ్చింది, "విశేషాలేమిటి అక్కాయ్?" అంటూ.

"బయట ఏమున్నాయ్ సుమతీ! ఉంటే లోపలే ఉంటాయిగానీ"

"హాయిగా పెళ్ళిచేసుకుని ఉంటావను కున్నాను. గానుగెద్దులాంటి చదువు మళ్ళీ ఎందుకు చదవడం?"

"మరి... తమరుకూడా మానుకోవచ్చు కదా ఈ గానుగెద్దు చదువును?" లలిత వెక్కిరింపుగా అంది. సుమతి కోపంగా చూసింది "నిన్నెవడడిగాడే బోడిదానా! మధ్యన కలుగచేసుకుంటావ్?"

"నోరుముయ్యవే కిలాడిదానా! ఆరాలు తీయడం మానవు నువ్వు"

ఇద్దరూ జుట్టుపట్టుకునే స్థితికి వచ్చారు. రూంలో వున్న మరో ఇద్దరు వచ్చి వారిని చెరోపక్కకులాగారు.




"సుమతీ! నువ్వు మా గదిలోకి ఎందు కొచ్చావ్? నీ గదికి వెళ్ళు! మీరిద్దరూ కలిస్తే పర్షియన్,సత్యభామల్లాగేవుంటుంది" అంది రమ.

సుమతి విసవిస వెళ్తూ, "ఈ బోడి దాని కొరకు రాలేదులే" అనేసింది.

విస్తుపోయిచూస్తున్న రాజ్యం "ఇదేం పోట్లాటే! ఒకచోట ఉన్నవాళ్ళం! ఇలా ఎన్నిరోజులు పోట్లాడతారు?" అంది.

రమ తల ఊపింది- "ఇది మామూలే అక్కాయ్! రెండు కొప్పులు ఒకచోట కూడితే సప్తసముద్రాలు పోటెత్తుతా యన్నది నిజమేగదా"

"దీని రహస్యాలన్నీ నాకు తెలుసు! అందుకే దానికా మంట" లలిత అంటూ పళ్ళెం కడగవానికి లేచింది.

భోజనాలు పూర్తిచేసి, చాపలు తీసు కుని డాబాపైకి వెళ్ళారు. ఎంతెంతస్తులపై నుంచి చూస్తుంటే విజయవాడ విలాస వంతంగా కనిపిస్తున్నది. దూరంగా గాంధీ హిల్, కనకదుర్గ దేవాలయం లైట్లతో కనిపిస్తున్నాయి.

చల్లటి గాలి వీస్తున్నది. చుట్టూవున్న వెలుతురు అక్కడికి కూడా వ్యాపిస్తు న్నది. దాదాపు యాభైమంది జట్లుజట్లుగా కూర్చుని మాట్లాడుకుంటున్నారు. తన చాప పక్కనే రాజ్యానికి కూడా చాప పరచింది లలిత.

"ఇక్కడిలీడర్ ఎవరే?" అంది రాజ్యం పనక వేస్తూ.

"ఉందిలే దరిద్రపు మొహం సరోజ అని! దాని స్నేహితురాలే ఈ సుమతి! ఇద్దరూ కలిసి పగలూ, రాత్రీ షికార్లు కొట్టడం, ఎవరికంటయినా పడితే, తమను చూసినవారి గురించే చెడ్డగా చెప్పడం... ఇద్దరూ ఇద్దరే!"

రమ అక్కడికి వచ్చి కూర్చుంది.

మరో నలుగురు వచ్చారు. వీళ్ళందరూ రాజ్యం కాలేజి విడిచేటప్పటికి ఫస్టియర్‌లో ఉన్నారు. ఈరోజు ఫైనలియర్‌లో అడుగుపెట్టారు. లలితతోబాటు అందరూ ఆమెకు తెలిసినవాళ్ళే అయినా వారి క్లాసులూ, ఈమె క్లాసువేరే కావడంవల్ల పెద్ద పరిచయం లేదు. ఒకటి రెండుసార్లు తెలుగు టీచర్‌తో దేవుణ్ని గురించి తగవు పెట్టుకోవడం వల్ల రాజ్యం కాలేజీలో అందరి నోటా నానింది. పైగా ఆర్థికంగా కొంత ఉండటవల్లనూ, తన అవిటితనం వల్ల ఇతరులతో పనిచేయించుకోవలసి రావడంతోనూ, డబ్బులు ఎక్కువగానే ఖర్చుపెట్టేది. అందువల్ల ఆర్థికంగాతక్కువ యున వ్యక్తులు ఆమె చుట్టూ చేరేవారు. స్వతహాగా అందరితో కలివిడిగా మాట్లాడటం, చెప్పేమాటను అధికారికంగా చెప్పి ఒప్పించడం ఆమెకళ. అందువల్లనే ఆమె చుట్టూ మళ్ళీ అందరూ మూగారు.

"సుమతి మరి ఇదిగాతయారయిందే" అంది రమ లలిత వైపు చూస్తూ.

"కాదు మరి! దాని రహస్యాలు ప్రిన్సిపాల్‌కు చెబితే బాగా అవుతుంది"

"ఏం చేస్తున్నది?" అంది రాజ్యం బావమీద పడుకొంటూ.

"ఏముంది? దానికున్నంతమంది బాయ్‌ఫ్రెండ్స్ ఈ కాలేజీలో అందరికీ కలిపినా ఉండరు. రెండో ఆట సినిమాకి వెళ్ళి గేటువేస్తే గోడదూకి రావడం ఎన్నిసార్లో! అయినా అది సినిమాకనివెళ్తుందిగానీ, నా అనుమానం సినిమాకు పోదని" లలిత ఆకాశంలో చంద్రుణ్ని చూస్తూ చెప్పింది.

"సుమతి మొదటినుండీ ఇలాగే ఉన్నట్లుంది. దానికి బాయ్‌ఫ్రెండ్స్‌తో అన్నీ సంబంధాలే!" అంది స్నేహ.

ఇక సుమతి బాయ్‌ఫ్రెండ్స్, వారి పేర్లూ, మరొకరి బాయ్‌ఫ్రెండ్స్, వారి పేర్లూ వారి ఘనకార్యాలు...వినే ఓపిక రాజ్యానికిలేదు. పాతిక సంవత్సరాల వయస్సులో అన్నీ సక్రమంగావుంటే ఈపాటికి పెళ్ళయి నలుగురు పిల్లలు పుట్టేవాళ్ళు! అవిటితనం నెపంతో పెళ్ళి చేసుకునే పుణ్యాత్ముడులేడు. ప్రేమించే వాళ్ళూ దొరకరు. అందంవుంది, ఆకర్షించే స్థాయీవుంది. కానీ లేచి నడక సాగిస్తే అందరూ హేళనగా చూసేవాళ్ళే! సానుభూతి చూపేవాళ్లు కొందరున్నా, అవిటితనం అపహేళనగా చూసేవారు ఎక్కువ! అందువల్లే మనసులో ఏ భావాలున్నా పురుషుల ప్రసక్తివస్తే గంభీరంగా ఉండటం ఆమె మనస్తత్వం! ఈరోజు కూడా కళ్ళుమూసుకుని పక్కకు తిరిగి పడుకుంది. మిగిలినవాళ్లు కూడా లలితతో మాట్లాడటం ముగించి పడకవేశారు.

ఉదయం లేచేసరికి ఏడుగంటలయింది. సూర్యకిరణాలు వెలుగునింపుతూ వస్తున్నాయి. కళ్ళునలుముకుని లేచికూర్చుంది. తనతోపాటే నిద్రపోయే ఏ ఒకరిద్దరో తప్ప మిగిలినవాళ్లు దిగివెళ్ళారు. మేడ ఎద్దడి కావటంలో ఎవరికి మెలకువవస్తే వాళ్ళు కిందికి దిగిపోయి పనులుచేసుకుంటుంటారు.

లేచి బావముట్టి చంకలో పెట్టుకుని మెట్లు పట్టుకుని కిందికి దిగింది. తనరూం దగ్గరకు వచ్చేటప్పటికి బయటనే నీళ్ళు నిండిన బకెట్ దర్శనమిచ్చింది. లోపల లలిత బావమీదపడి పొర్లుతున్నది.

"కానియ్ అక్కాయ్... ముఖం కడుక్కో!" అంది కూచ్చుని ఆపలిస్తూ.

బ్రష్షు తీసుకుని బయటకు వచ్చింది. నిలబడి కిందికి చూసింది. పంపులదగ్గర

గందరగోళం ఇప్పట్లో పూర్తయ్యే చిహ్నాలులేవు. కొందరు పరాచికాలు, కొందరు కోపతాపాలతో ఉన్నారు. ముఖం కడుక్కుని టవల్‌తో తుడుచు కుంటూ, "వంటమనిషి మరియమ్మ వుందా...వెళ్ళిపోయిందా?" అంది.

"ఎందుకులేదూ ... చూడపోతులా వుంది. దానితో పనేమిటి?"

"ఇంతకుముందు రోజూ ఒక గ్లాసు కాఫీ ఇచ్చేది. నెలకింత అని డబ్బులీసు కునేది. ఉంటే ఇప్పుడయినా అవకాశం ఉంటుందికదాని"

"బయటనుండి వచ్చావుకదా, ఈ కాఫీ బాధలు తప్పవు...పద, వెళ్దాం" అంటూ లేచి బయటకువచ్చింది లలిత. ఇద్దరూ వంటగదివద్దకు వచ్చారు. వంటమనిషి కూరగాయలు తరుగుతూ కూర్చున్నది. వీరినిచూసి నవ్వుముఖంతో "ఎప్పుడొచ్చా వమ్మా?" అంది. రాజ్యంకూడా నవ్వింది. "నిన్న వచ్చాను, కాఫీకావాలి మరియమ్మా దొరుకుతుందా?" అంది.

"అయ్యో నాతల్లీ, నీకు కాఫీ ఇచ్చే దానికి ఏమిటమ్మా! మారాణివి! రామ్మా. రా కూర్చో!" అంటూ స్టూల్ ఆమె ముందుకు జరిపి లోపలకు వెళ్ళింది.

"నువ్వు తాగుతావా లలితా?"

"నాకలవాటులేదు. అయినా ఒకటా రెండురోజులా! అయిదు సంవత్సరాలు ఇక్కడ గడపడం కష్టం! అందుకే దాని జోలికి వెళ్ళను నేను"

"అలవాటుంటే మానుకోలేం కదా?"

మరియమ్మ పెద్ద గ్లాసుతో కాఫీతెచ్చి ఇచ్చింది. కాఫీతాగి బయటకు వచ్చారు. వంటగది ఎదురుగా దగ్గరలో పెద్ద వేప చెట్టు, కిందచుట్టూ అరుగు. ఇద్దరూ అరుగు మీద కూర్చున్నారు.

"ఏకంగా స్నానంచేసే పైకివెళ్ళొచ్చు. నువ్వు ఇక్కడే వుండు. నేను బకెట్, గుడ్డలు తెస్తాను" అంటూ లలిత పైకి వెళ్ళబోయింది. లలిత చెయ్యిపట్టుకుని తాళంచెవులు చేతిలోపెట్టింది రాజ్యం. మరో పదినిముషాలకు బకెట్, గుడ్డలు తెసుకుని వచ్చింది లలిత. అప్పటికి కింద రద్దీ తగ్గిపోయింది. బకెట్‌తో నీళ్ళుపెట్టి తిరిగి పైకివెళ్ళింది. పావుగంటలో స్నానంచేసి, తలారపెట్టుకుంటూ చెట్టు కిందకు చేరింది.

గేటుకీపర్ నారాయణ ఆమెదగ్గరగా వచ్చి పలుకరింపుగా నవ్వాడు – ఎప్పు డొచ్చావమ్మా అంటూ.

"నిన్న వచ్చాను నారాయణా! డ్యూటీలో లేవా ఏమిటి?"

"ఇక్కడ ఎప్పుడూ డ్యూటీయే కదమ్మా! నిన్న ఊరెళ్ళాను"

లలిత రావడంతో నారాయణ వెళ్ళి పోయాడు. "ఏమిటి... వాడు మాట్లాడు తున్నది?" అంది. రాజ్యం లలిత కళ్ళ లోకిచూస్తూ–

"ఏంలేదు...ఎప్పుడొచ్చావని అడుగు తున్నాడు"

"బడాకోర్ దద్దమ్మ వీడు. ఆడపిల్లలను పర్మిషన్‌లేకుండా రెండో ఆట సినిమాకు పంపడం, బయటనున్న మొగపిల్లలకు చీటీలు అందించడం... బ్రోకర్‌గా తయా రయ్యాడు. వీడిని మార్చమని ప్రిన్సిపల్ దగ్గర ఘెరావ్ చెయ్యాలి"

రాజ్యం పకపక నవ్వింది. "నీ నవ్వులకేం లేమ్మా! పాపం పిల్లలు చెడిపోతున్నారిక్కడ" అంది మూతి వంకరగా తిప్పుతూ లలిత.

లలిత అమాయకురాలని రాజ్యానికి మొదటినుంచీ ఉద్దేశం! నోరుచెడ్డ మనిషి




# గ్లూకోన్-డి సూపర్‌హీరో.

ఉక్క పోస్తూ అలుపు పుట్టించే రోజున కూడా ఉరకలు వేసే శక్తి.

అలుపు తెచ్చే వేసవి రోజున మీ అబ్బాయికి కావలసింది గ్లూకోన్-డి: గ్లూకోజు, విటమిన్ డి, కాల్షియం ఫాస్ఫేట్సు గల తక్షణ శక్తినిచ్చే పానీయం.

గ్లూకోన్-డిని పళ్లరసం, పాలు, టీ, కాఫీ, లేదా నీళ్లలో కలిపారంటే కుటుంబం మొత్తానికి ఒక ఉల్లాస పానీయంగా తయారై పోతుంది. 100, 200, 500 గ్రాముల ప్యాకులలో లభిస్తుంది. గ్లాక్సో వారి గ్లూకోన్-డి.




అసలైన, కొత్త, మెరుగైన ప్యాక్ కోసం చూడండి.

## గ్లూకోన్-డి ®

సూపర్‌హీరో అమితంగా ఇష్టపడే శక్తినిచ్చే పానీయం.

GLL-2389

అయితే ఏం, మంచి స్నేహశీలి! పైగా ఇంతకుముందూ, ఇప్పుడూ తనకు సహకారం అందిస్తూనేవుంది. తననుండి అడపా దడపా సినిమాలకు డబ్బు, సబ్బు లాంటివి తీసుకున్నా ఆమెచేసే సేవ ముందు అవి పెద్ద విలువ కలిగినవికావు. ఒక్కొక్కరిని చూస్తే కోపం, అసహ్యం వస్తుంది. మరొకరిని చూస్తే గౌరవం ఏర్పడుతుంది.

అలాగే వీరికిఒకరిమీద ఒకరికి అభిమానం ఏర్పడింది. లలిత హైస్కూలు చదువు కూడా అక్కడే చదవడంతో, ఆమేరకు పరిస్థితులు అర్థం చేసుకుంది. కాని, బయట బాయ్‌ఫ్రెండ్స్ గురించీ వారి విధానాలూ, మోసాలు గురించీ ఆమెకేమీ తెలియదు. వాళ్ళ చేతిలోపడితే మోసాలు చేస్తారు అంటుంది లలిత. కానీ రాజ్యం ఉద్దేశాలు వేరు. ఉద్దేశాలు వేరైనా ఇద్దరూ మొదటి నుండీ కలిసి ఉంటున్నారు; ఇప్పుడూ కలిసి ఉంటున్నారు.

"భోజనానికి వెళ్దాం పద" అంది లలిత.

''ఇప్పుడేం భోజనమే! సరిగా తెల్లారనే లేదు"

"అవునమ్మా! అలాగే ఉంటుంది తమరికి! కానీ ఉదయం ఎనిమిది గంటలకే తినేమాకు తొమ్మిదిగంటలకు కడుపుకాలు తున్నది. సరే నీ పళ్ళెంలో తెచ్చి ఉంచనా?''

"తీసుకురా. ఎవరో ఒకరు తింటారు. ఊరికే వారికి విడిచిపెట్టడం ఎందుకు?''

"నిజమేమరి! ఒకపూట అన్నంతగ్గిస్తే ఫీజు ఏమైనా తగ్గిస్తారు కనుకనా!" అనుకుంటూ లలిత వెళ్ళింది. రాజ్యం తన రూంకువచ్చింది. పెట్టెతెరచి అందులో సోప్‌బాక్స్ వేస్తూ చూసింది. అందులో కాగితాలు సర్ది ఉన్నాయి. లలిత దొంగ తనం చేస్తుందన్న అనుమానం లేదు. అయినా డబ్బులు చూసుకుంది. సరిగానే ఉన్నాయి. పెట్టె తాళం వేసింది. పిల్ల లందరూ భోజనాలు పూర్తిచేసి పైకి వచ్చారు. పుస్తకాలు తీసుకుని కిందికి దిగిపోతున్నారు. లలిత పళ్ళెంతో అన్నం తెచ్చి అక్కడ పెట్టింది. ఇద్దరూ పుస్తకాలు తీసుకుని కిందికిదిగి కాలేజీవైపు నడిచారు.

తెలుగు టీచర్ కన్పిస్తూనే, "నమస్తే మేడం" అంది రాజ్యం చిరునవ్వుతో.

తెలుగు టీచర్ ప్రభావతి రాజ్యాన్ని చూసి నవ్వి..."ఏమే నాస్తికురాలా ఎప్పుడు రాక?" అంది వీపు దువ్వుతూ.

"నిన్ననే వచ్చాను మేడం! మీరు కన్పించలేదు"

"ఏం! మళ్ళీ చదువు కొనసాగిస్తావా? నాస్తికవాదం కొనసాగిస్తావా?"

''అవును మేడమ్! అన్నీ కొనసాగిం చాల్సిందే! ఎవరి అభిప్రాయాలు వాళ్ళవి! అవి స్వేచ్ఛగా చెప్పవచ్చని మీరే సెల విచ్చారు కదా మేడమ్?"

తల ఊపింది ప్రభావతి-క్లాసువైపు కదలిపోతూ. అటే చూస్తున్న లలిత "రోడ్డురోలర్ జ్ఞప్తికి రావడంలేదూ?" అంది.

రాజ్యం నిరసనగా లలితవైపు చూసి "అదేమిటే ! ప్రతి ఒక్కరికీ పేరు పెడతావ్?" అంది.

"అంతేమరి! ఈ మేడమ్ చదువుతునే ఇప్పుడు ఎందరికి పేర్లు పెట్టిందో? రేపు మనం ఉద్యోగాలుచేస్తే పిల్లలు పేర్లు పెట్టరు గ సు క నా... ఇది సహజం అక్కాయ్!"

ఇద్దరూ క్లాసు లో కి వెళ్ళారు. సంస్కృతం మాస్టారు అప్పుడే క్లాసులోనికి




ప్రవేశిస్తున్నాడు. అతన్ని చూసి అందరూ లేచి నిలబడ్డారు. టేబుల్ మీదున్న పెన్సిల్ కిందపడటంతో, దాని కొరకు వంగిన మాష్టారు పిలక ఊగడంతో ఆడపిల్లలు ముసిముసిగా నవ్వారు వారి నవ్వులతో తనకు నిమిత్తంలేదన్నట్లు సకిలించి, గొంతు తడుముకుంటూ పుస్తకం తెరిచాడు.

"అర్థమవుతున్నదా?" అంది సుమతి రాజ్యాం డొక్కలో పొడిచి.

"ముయ్యనోరు! నేను రాసుకుంటున్నాను..." అంది లలిత మండిపడుతూ.

"గోడకు నీవు రాసుకోవే! పెద్ద చీల్చి చదువుతున్నది ఇది!"

పండ్లు బిగించి లలిత సుమతివైపు చూసింది. నీమాపు నాకో లెక్కకాదన్నట్లు తల పక్కకు తిప్పుకుంది. ఆ తిప్పడంలో పొడవు జడ విసురుగావచ్చి, పక్కనున్న రమ ముఖానికి టపీమని కొట్టుకుంది. విసుగ్గా ముఖం పెట్టి "స్కౌండ్రల్స్" అంది రమ.

"నువ్వే పడిసాట్లు" అంది గట్టిగా సుమతి. లెక్చరర్ సైలెన్స్ అంటూ అరచాడు.

"ఒకరితో ఒకరు పోట్లాడుకోవటం తప్ప వీళ్ళు చదివేదేమైనా ఉందా?" అనుకుంది రాజ్యాం. ఎప్పుడూ ఇంతే! ఒకరితో ఒకరు పోట్లాట. అనవసరమైన చర్చ. వీరి చర్చలూ వాగ్వాదాలు వినాలంటే విసుగు, వినకుంటే తప్పదు. వారితో తనకు అవసరం. తాను అవిటి వ్యక్తి! ఎవరో ఒకరి సహకారం ఎప్పుడూ ఉండాలి. ఈ భావనతోనే అందరిలా కన్నుమిన్నుమనకుండా నెమ్మదిగా ఉండటం అలవరచుకుంది.

మధ్యాహ్నం బయటకు వచ్చారు. కొందరు రెండోపూట భోజనానికి వెళ్తున్నారు. అవసరం లేనుకున్నవాళ్ళు బయలులో చెట్లకింద పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు. మరికొందరు గదులకు వెళ్ళి పడకనీరు వేశారు. ఓరియంటల్ స్కూలులో సంస్కృతం ఒక్కటే కొంచెం కష్టం. మిగిలిన సబ్జెక్టులు ఆడుకుంటూ చదివి, రాసేయవచ్చు. సంస్కృతమయినా కొంచెం కష్టపడితే నూటికి ఎనభై మార్కులు సులభంగా వస్తాయి. అందుకే మామూలు కాలేజీల కంటే ఓరియంటల్ కాలేజీలలో పాసయ్యేవారు ఎక్కువ. వారికి చదువుమీదకంటే, ఇతరుల నడవడి గురించి ఎక్కువ ధ్యాస.

లలిత రాజ్యాం దగ్గరగా వచ్చింది- "ఏమిటే అక్కయ్యా! సువ్వు ప్రేమాయణంలో పడినట్లున్నావు కదా?" కిసుక్కున నవ్వింది జడ తిప్పుతూ.

రాజ్యాం లలిత ముఖంలోనికి చూసింది. పెట్టెలో ఉన్న ఉత్తరాలుగానీ చదివిందా? అవునని ఆమె వాలకమే చెబుతున్నది.

"ఎవరా సుబ్రహ్మణ్యం?" అంది లిరిగి.

"చదివావుగా...అది మాత్రం తెలియదూ?" అంది నీరసంగా రాజ్యాం.

"ఎందుకు తెలియదు? నీ నోటినుండి విందామని ఆసక్తి! సరే..ఊరికే ఉత్తరాలు రాయడమేనా? ఇంకాముందుకు వెళ్ళావా?"

"ఈ చెట్టుకిందే కూర్చున్నాను. ఎక్కడికీ వెళ్ళలేదులేవే!"

"అదికాదు...రేడియోస్టేషన్ విజిట్ ప్రోగ్రాం మన పిల్లలు వేస్తున్నారు. మరి నువ్వుకూడా వేస్తున్నావేమోనని?"

రాజ్యాం లలిత ముఖంలోనికి చూసింది. "నిజమక్కా! నీవుకూడా వెళ్ళదలచుకుంటే క్లర్కువద్ద పేరు నమోదు చేయిం

చుకో! పది రూపాయలే ఖర్చు!"

"సరే..నువ్వుకూడారా! ఇద్దరం కలిసే వెళ్దాం!"

ఇద్దరూ క్లర్క్ వద్దకువచ్చి ఎక్స్ కర్షన్ ప్రోగ్రాంకు ఇద్దరి పేర్లూ ఇచ్చారు. ఇద్దరి డబ్బూ రాజ్యం చెల్లించింది.

"అతడు ఎలా పరిచయం?" అంది లలిత ఆసక్తిగా.

"అతడు రేడియో అనౌన్సర్‌గా పని చేస్తున్నాడు. ఒకసారి ప్రోగ్రాం గురించి విమర్శిస్తూ ఉత్తరం రాశాను. దానికి జవాబుగా అతడినుండి ప్రశంసాపూర్వకమైన ఉత్తరం వచ్చింది- ఇటువంటి విమర్శలు తాము ఆహ్వానిస్తున్నామంటూ. ఆ తర్వాత ఒకరి అభిప్రాయాలు ఒకరం తెలుపుకునేవారం. చాలాసార్లు తనను కలుసుకోమ్మని రాశాడు, నేనే తెగించి కలుసుకోలేకపోయాను"

"కానీ అక్కా! ఇటువంటివి నమ్మకూడదు. అనేకరకాల వ్యక్తులుంటారు. అతడెవరో, అతని జీవితమేమిటో తెలియకుండా, రేడియోలో గొంతులువిని ప్రేమిస్తే తర్వాత అభాసుపాలు కావలసి వస్తుంది"

"ప్రతి ఒక్కరినీ అలా ఎందుకు భావిస్తాం? కొందరు వారి ఉద్దేశాలు స్పష్టంగానే తెలుపుతారు. అతడంటే నాకు ఇష్టం ఏర్పడింది. మొదటి ఉత్తరంలోనే ప్రేమ కలిగింది''

లలిత తలఎత్తి నవ్వింది. "మొదటి చూపుల్లో ఉత్తరాల్లో కలిగేది ప్రేమకాదే. ఆకర్షణ...కాంక్ష! ప్రేమ ఎప్పుడూ మొదటిసారి ఛస్తే పుట్టదు. ఒకరినొకరు అర్థం చేసుకున్న తర్వాత, ఒకరి అభిప్రాయం ఒకరికి సరిపడిన తర్వాత, ఒకరి కొరకు ఒకరు ప్రాణం విడిచేందుకైనా సిద్ధమేనన్న అభిప్రాయం ఏర్పడిన తర్వాత ఏర్పడేదే ప్రేమ! అలోగా ఏర్పడేది ఆకర్షణ, జాలి, అభిమానం, దయలాంటివే!"

రాజ్యం ఉత్సుకతతో లలిత ముఖంలోకి చూసింది. "ఇవన్నీ ఎప్పుడు వంట బోశావే?" అంది.

"వంటబోయడమా? ఇంకా కాచనే లేదే! ఇదంతా పుస్తకాల సారాంశం"

రాజ్యంతోబాటు లలిత నవ్వింది. ''ఏమోనే! అతనితో జీవితం పంచుకుంటే బాగుంటుందనుకున్నాను. అయినా తెలిసీ కుంటిదాన్ని పెళ్ళి చేసుకునేవాడెవడే! మరి అతడు అన్నీ తెలిసినా సిద్ధపడుతున్నాడంటే అంతకంటే నాకు కావలసిందేముంది?"

లలిత క్లాస్‌వైపు కదిలింది. ఆమెతో పాటు రాజ్యం.

సాయంత్రం క్లాసయిన తరువాత రూంకు వచ్చారు. మాటలలో మధ్యాహ్న భోజనం ఇద్దరూ చేయలేదు. ఉదయం తెచ్చిన అన్నం పళ్ళెంలో అలాగే ఉంది. ఇద్దరూ దానిమీదపడి ఆబగా తిన్నారు.



**2**

ఓరియంటల్ కాలేజీనుంచి రేడియో స్టేషన్, కనకదుర్గ గుడి, గుణదలమేరీ

ఆలయం- మొదలైనవి చూడటానికి బసు ఏర్పాటు చేశారు. ప్రతి నెలా ఏదో ఒక చోటుకి తీసుకెళ్తుంటారు. ఆరోజు యాభై మంది పిల్లలతో బస్సు ఏర్పాటుచేశారు. ఉదయం తొమ్మిది గంటలకు భోజనాలు ముగించి ముందుగా కనకదుర్గ గుడికి వెళ్ళారు. అలా ఊరిలో ముఖ్యంగా చూడవలసినవి చూస్తూ చివరగా రేడియో స్టేషన్‌కు వచ్చారు. స్టేషన్ డైరెక్టర్ వీరిని ఆహ్వానించాడు. వీరి వెంటనున్న సంస్కృతం మాస్టారు స్టేషన్‌లోని రికార్డింగ్ రూం, అనౌన్స్‌మెంట్ రూం, వివిధ విభాగాల్ని చూపిస్తూ ఉన్నాడు. లలిత రాజ్యం దగ్గరగా వచ్చి, "సుబ్రహ్మణ్యం గురించి తెలుసుకుందామా" అంది మెల్లగా.

"ఎదురుగా మాట్లాడాలంటే నాకు భయంగా ఉందే" అంది బెదురుగా.

"అదేమిటే! భయపడితే పనులు సానుకూలంకావు... రా!" అంటూ పక్కకు లాగింది. ఒక వ్యక్తి దగ్గరగా వచ్చి. "అనౌన్సర్ సుబ్రహ్మణ్యంగారున్నారా?" అంది లలిత. అతడు ఒకరూం వైపు వేలు పెట్టి చూపించాడు.

"వీడెవడో దేభ్యపు పక్షిలాగున్నాడు. తల ఎత్తి ఆడపిల్లల్ని చూడడేమో?" అంది పరిహాసంగా లలిత.

రాజ్యం మనస్సు ఎక్కడో ఉంది. ఆ సుబ్రహ్మణ్యం కనిపిస్తే తాను ఏం మాట్లాడుతుంది? ప్రేమిస్తున్నానని చెబుతుందా? అతడే ఆ ప్రసక్తి తెస్తే ఏం చేయాలి?

చివరకు లలిత సుబ్రహ్మణ్యాన్ని పట్టింది. రికార్డింగ్ దగ్గర కూర్చున్న సుబ్రహ్మణ్యం దగ్గరకు వెళ్ళి, "నమస్తే సుబ్రహ్మణ్యంగారూ! మేము ఓరియంటల్



కాలేజి విద్యార్థులం! మిమ్మల్ని చూద్దా మని ఇటువచ్చాం'' అంది నవ్వుతూ.

అతడు తలెత్తి ఇద్దరినీ చూశాడు. చిరునవ్వుతోనే, "రండి...నా టేబుల్ దగ్గరకు వెళదాం" అంటూ లేచి కదిలాడు. ముగ్గురూ వెళ్ళి టేబుల్ ముందున్న కుర్చీలలో అటు ఇటు కూర్చున్నారు. రాజ్యం ఓరకంట అతన్నే చూస్తున్నది. ఉత్తరాలలో రాసే భాష అందమయింది అను కుంది ఇంతకుముందు. ఇప్పుడు అతని రూపం కూడా అందంగానే ఉంది. జీవితంలో ఇటువంటి వ్యక్తి సాన్నిధ్యంలో గడపడం అదృష్టమే అనుకుంది.

"నాపేరు లలిత! ఫైనలియర్...సర్. ఇక ఈమె పేరేమో రాజ్యం! మీకు పరిచయమేననుకుంటాను''

అతడు తలెత్తి రాజ్యం వైపుచూశాడు ఆశ్చర్యంగా. నోటమాట రాలేదు. చాలా సేపు. రాజ్యం ఉత్తరాలురాస్తుంటే తనూ జవాబు రాస్తున్నాడు. ఆమె ఏ ఉద్దేశంతో ఉత్తరాలురాసినా తనూ అదేపద్ధతిలో జవాబిచ్చాడు. కానీ ఎదురుగా ఇంతవరకూ చూడలేదు. ఒకసారి ఆమెను చూస్తే మరచిపోని అందం, పసిమి బంగారు ఛాయలో లైట్ల వెలుతురులో మిలమిల మెరుస్తున్నది. నును పెక్కిన బుగ్గలమధ్య నిటారుగా సాగిన ముక్కు, మహాకవుల కలాలకు వుండే పోలికలావుందనుకున్నాడు. నిజంగా ఈమె తన భార్య అయితే ఎంతో బాగుంటుంది. జీవితంలో ఎన్ని కష్టాలు వచ్చినా ఈ సౌందర్యాన్ని అనుభవిస్తూ అవన్నీ మరచిపోవచ్చు. ఆమెకున్న కుంటితనం పెద్ద సమస్యకాదు.

"ఏమిటీ ... అలా చూస్తున్నారు?" అంది లలిత. సుబ్రహ్మణ్యం సిగ్గు పడుతూ .. ఇద్దరి వంకా చూశాడు.

"ఇలా దర్శనమిస్తారనుకోలేదు" అన్నాడు సుబ్రహ్మణ్యం. కాఫీ తెమ్మని ప్యూనుతో చెప్పాడు. మొహమాటాని కయినా ఇద్దరిలో ఎవరూ వద్దనలేదు.

"మీ ఉద్యోగం పర్మనెంటేనా?" అంది లలిత దూరాలోచనతో.

సుబ్రహ్మణ్యం నవ్వి, "ఎప్పుడో పర్మనెంటు అయిందండీ! అయినా ఏం లాభం? ఈ ఉద్యోగంలో అరుస్తూ అనౌన్స్ చేయాలంటే ఇష్టంలేదు. ఎక్కడ అయినా ఓ మూల రాసుకుంటూ కూర్చుండే క్లర్క్ పోస్ట్ అయితే ఎంతో బాగుండేది" అన్నాడు.

"అదేమిటండీ! మీ గొంతు రేడియోలో విని ఎందరు తన్మయులవుతున్నారో మీకు తెలిస్తే ఇలా మాట్లాడరు. ఈ గొంతువల్లే కదా మిమ్మల్ని చూడకుండానే మా మిత్రురాలు మిమ్మల్ని ప్రేమించింది"

సుబ్రహ్మణ్యం రాజ్యంవేపు చూశాడు. రాజ్యం తలదించుకునే వేలితో టేబుల్ మీద దిద్దుతున్నది.

"ఏంచేస్తున్నారు ఇప్పుడు?" అన్నాడు సుబ్రహ్మణ్యం రాజ్యంవేపు చూస్తూ.

"కాలేజీలో ఫైనలియర్ చదువుతున్నానండీ!" అంది చిన్నగా.

"మీ ఉత్తరాలు చూస్తుంటే ఎంతో ధైర్యంగా రాసినట్లుంటాయి. మరి ఇంత సిగ్గుపడుతున్నారేమిటి?"

"అంతేమరి! వాగేవాడు రాయలేడు, రాసేవాడు వాగలేడు అన్న సామెత!" అంది లలిత.

కాఫీ తాగేలోపలే మిగిలిన పిల్లలతో మాస్టారు అటుగా వచ్చారు. రాజ్యం వారివేపు చూసి బాధపడింది. అతడితో ఏదేదో మాట్లాడాలని వచ్చింది. కానీ, మాట్లాడిందేమీలేదు. సమయం మించి

పోతున్నది. లలిత, సుబ్రహ్మణ్యం కూడా అలాగే ఉన్నారు. "ఇంతదూరంవచ్చినా మాట్లాడలేకపోతున్నా" అన్నాడు చిన్నగా. లలిత అతనివేపుచూసి, "మరో సారి కలుద్దాం. విడిగా కలిస్తే ఎంత సేపయినా మాట్లాడవచ్చు. ఇలావస్తే ఇదే సమస్య" అంది.

రాజ్యం రెండు చేతులూ జోడించి నమస్కారంచేసి ''మళ్ళీ కలుద్దామండీ!'' అంది చివరిసారిగా.

"తప్పకుండా" అన్నాడు సుబ్రహ్మణ్యం వారి వెనుకగా కదులుతూ. బస్సు దగ్గరగా వచ్చాడు. వారు బస్సులో ఎక్కికూర్చున్న తర్వాత, తనవేపే చూస్తున్న రాజ్యంవేపు చూశాడు. ఆమె సిగ్గుతో తలదించుకుంది. బస్సు కదిలింది. అతడు చెయ్యి ఊపాడు. వాళ్ళిద్దరూ చేతులు ఊపుతూ, నవ్వుతూ వీడ్కోలు పలికారు.

"ఎలా ఉన్నాడే?" అంది లలిత రాజ్యం డొక్కలో పొడుస్తూ.

"నాకేం తెలుసు...నువ్వే చెప్పాలి" అంది సిగ్గుతో రాజ్యం.

"అబ్బో...సంగనాచి తుంగబుర్ర లాంటిదానివే! నేనేదో రెండు మాటలు మాట్లాడాను మీరిద్దరూ కళ్ళతోనే అన్నీ మాట్లాడుకున్నారుగదా! నచ్చాడా?"

రాజ్యం పలుకలేదు. జవాబుగా నవ్వి బయటకు చూస్తూ కూర్చుంది.

"నాకయితే నచ్చాడు. నీవు అందంగా వున్నావు కాబట్టి సరిపోయింది. లేకపోతే నేనే ఛాన్స్ కొట్టేడును. లక్షణంగా నెలకు పదమూడు వందల రూపాయల జీతం సంపాదించుకునేవాడు దొరకడం మాటలా?"

"మళ్ళీ ఒకసారి కలిసి మాట్లాడదామా?" అంది రాజ్యం ఆసక్తిగా.

"ఆదివారం వెళ్దాం! అతనికి ఆదివారం డ్యూటీ ఉంటుంది...మనకేమో శలవు" అంది లలిత.

ఆరోజు రాత్రంతా అదే కలవరింతలతో కాలం గడిపింది రాజ్యం. అతని అందమైన రూపం ప్రతినిముషం తన ముఖంపై వంగివున్నట్లు భ్రమపడుతూ ఉన్నది. అందం, తగిన ఉద్యోగంవున్న అతడు-తనకు అందితే అంతకంటే సుఖం ఇంకేమీ ఉండదు. తన అవిటితనాన్ని అతడు ఏవగించుకోలేదెప్పుడూ. పైగా తనను ఓదారుస్తూ ఉత్తరాలు రాసేవాడు. ఇంచుమించు తన ఈడువాడు.

మళ్ళీ ఆదివారం వచ్చేవరకూ చదువు మీద ధ్యాసతగ్గిపోయి, అతనిమీద ధ్యాసతోనే కాలం గడిపింది రాజ్యం. తాను అయినవాళ్ళు అందరికీ లోకువే. ఎవరూ తనను లెక్కచేయరు. పెళ్ళికాకుంటే కట్నం డబ్బులు మిగులుతాయనుకునే తమ్ముడు, ఇంటిలోస్వతంత్రం తక్కువైన తండ్రి, పీడించడానికి తయారయిన అక్క, ఏదోవిధంగా లొంగదీసుకోడానికి ప్రయత్నించే బావ, కనీస సహకారం చేయలేని బంధువులు-ఇలా అందరిమధ్యన ఎందుకూ కొరగాని బతుకు ఈడుస్తున్నది. అందరూ తన అవిటి తనంచూసి అవహేళన చేసేవాళ్ళే! అదేదో తాను కావాలని సంపాదించుకున్నట్లు. అవిటితనం తన తప్పా? కాదు. అది ఏర్పడటానికి కావలసిన అన్నిహంగులూ ఈదేశంలో వున్నాయి. దాన్ని నిరోధించ డానికి తగిన పరిస్థితులేలేవు. మరి తన తప్పేమిటి? తను అందరికీ లోకువే! ఈ ఈసడింపులూ, హేళనలూ, నిరసనల మధ్య తన బతుకు ఉన్నతంగా,

సుఖంగావుండాలని, అన్ని అర్థంచేసుకుని ఆదరించి సుఖపెట్టే భర్త కావాలనీ తాను కోరుకుంటున్నది. అది ఈరోజు నిజమవు తున్నట్లే అనిపించింది. అతడి ఉత్తరా లలో ఎంతో సంస్కారం ఇమిడివుంది. ఎదురుగా అతనితో మాట్లాడినప్పుడు ఎంతో గంభీరంగా ప్రవర్తించాడు. పైగా అందగాడు.

ఆదివారం రానే వచ్చింది.

నల్లచుక్కల తెల్లచీర కట్టింది. పసిమి వన్నె శరీరంమీద ఆ చీర మరింత తళ తళలాడుతున్నది. సహజంగానే పొడవైన వెంట్రుకలను వదులు జడవేసి మల్లెపూలు పెట్టింది. ఆమె అలంకరణ చూసిన లలిత పెదిమలు కొరుక్కుంటూ, "అక్కా! నేనే మగాడినైతే ఇలాగే ఎత్తుకెళ్ళి పెళ్ళి చేసు కుందును'' అంది నవ్వి.

రాజ్యం చక్రాల్లా కళ్ళు తిప్పింది. "నిజం చెప్పవే! అందంగా వున్నానా?" అంది.

"మనిషయినవాడు మూర్ఛపోయే అందంనీది. ఆ సుబ్రహ్మణ్యం మొగవాడే అయితే వెంటనే నిన్ను పెళ్ళిచేసు కుంటాడు"

రాజ్యం సిగ్గుతో తలవంచుకుంది.

ఇద్దరూ పర్మిషన్ తీసుకునే బయటకు నడిచారు. పోతున్న రాజ్యంవైపు చూసి గేటుకీపర్ నారాయణ గుటకలుమింగుతూ నిలబడ్డాడు – ఈ అందం ఎవడి పాలవు తున్నదోనని ఆలోచిస్తూ.

రిక్షా బేరమాడుకుని స్టేషన్ దగ్గరకు వెళ్ళేసరికి ఒంటిగంట కావచ్చింది. దిగి రిక్షాను పంపించి బయటచెట్టనీడన నిల బడ్డారు. రాజ్యం ఆందోళనగా లలిత చెయ్యిపట్టుకుంది. లలిత రాజ్యం ముఖం లోకి చూసింది.

"అతనితో మాట్లాడాలంటే నాకు సిగ్గుగావుందే!"

"అది విడిచిపెట్టు! ఇంకా సిగ్గంటూ పట్టుకుని వేలాడితే అందే పండు మట్టిలో కలిసిపోతుంది. ఇంత మంచి అవకాశం మళ్ళీరాదు"

"నిజమే...కానీ, ఏం మాట్లాడను?"

"నువ్వు చూస్తూవుండు. మాట్లాడేది నేను! నీకిష్టమే అయితే ఇద్దరూ ఒక నిర్ణయానికి రావచ్చు. తొందరపడి ఒక నిర్ణయానికిముందే రావద్దు. అతని మంచి చెడ్డలన్నీ మనం తెలుసుకోవాలి. మనిషి ఎర్రగావుంటేనే మంచోడని అర్థంకాదు... పాండురోగంవున్న వాడుకూడా ఎర్రగానే వుంటాడు"

పుల్ల విరుపుగా లలిత మాట్లాడు తున్నట్టుగా భావించిందిరాజ్యం. ఆవిధంగా తన మనసు విరిచి అతన్ని తాను ఆక్ర మించుకుందామని లలిత ఆలోచిస్తున్నదా? ఏమో..అతనిస్థాయి బాగుందిగనుక, దానికీ ఆ ఊహ వచ్చి వుండవచ్చు. అయినా తాను తెగించి అతడితో మాట్లాడాలి. సిగ్గు, లజ్జ పనికిరాదు. ఆహారం దగ్గరా వ్యవహారం దగ్గరా మొహమాటం పనికి రాదు. అనుకుంది రాజ్యం.

సుబ్రహ్మణ్యం టేబుల్ దగ్గరికి వెళ్ళా రిద్దరూ. ఆ సమయానికి అతడు రికార్డింగ్ రూంలో వున్నాడని అక్కడివాళ్ళు చెప్ప డంతో, బయటకువచ్చి విజిటర్స్‌రూంలో కూర్చున్నారు. లలితఏదేదో మాట్లాడుతూ నవ్వుతూ జోకులు వేస్తున్నది. పక్క వారితో కల్పించుకుని మాట్లాడుతున్నది. రాజ్యం అవన్నీ చూస్తూ చూడనట్టేవుంది. అతనితో ముఖాముఖీ ఎలా కలో కావ డమా–అన్నదే ఆమె సమస్య. ఇప్పుడు తప్పిపోయిందంటే ఇంత మంచి అవకాశం




చతుర

# కథలు నవలల పోటీ

విపుల, చతుర 100వ సంచికలు వెలువడిన సందర్భంలో మేము ప్రకటించిన కథలు-నవలల పోటీకి మాకు 2110 కథలూ, 357 నవలలూ అందాయి.

ప్రస్తుతం రచనల పరిశీలన జరుగుతున్నది. ప్రతి ఒక్క రచననీ న్యాయనిర్ణేతలు అన్ని కోణాల్లోంచి విశ్లేషించి చూసి, నిష్పాక్షికమైన నిర్ణయాల్ని చేసేందుకు వీలుగా వేర్వేరు స్థాయిలలో ఆయా రచనల పరిశీలనాయజ్ఞం జరుగుతోంది. నవ్యత, సృజనాత్మకత, సమర్థత ప్రదర్శించిన రచయిత (త్రు)లకు, వారి రచనలకు న్యాయం చేకూర్చేందుకు నూతన పద్ధతిలో సాగుతున్న ఈ బహుమతీ నిర్ణాయక కార్యక్రమం ఫలితాల ప్రకటనలో కొద్దిపాటి ఆలస్యం తప్పనిసరి.

అయినప్పటికీ ఫలితాలు వీలైనంత త్వరలోనే పత్రికాముఖంగా మీ ముందుకు తెచ్చే కృషి నిర్విరామంగా సాగుతోంది.



విపుల

దొరకదు ఇక.

"ఎవరికోసం వచ్చారు?" అన్నాడు లోపల్నుంచి వచ్చిన వ్యక్తి ఒకరు.

"సుబ్రహ్మణ్యంగారి కొరకు"

"అతడు టేబిల్ దగ్గరున్నాడు... చూడండి" అంటూ ఆ వ్యక్తి వెళ్ళిపోయాడు.

ఇద్దరూ అయిదునిమిషాలు ఒకరిముఖం వంక ఒకరుచూసుకుంటూ కూర్చున్నారు. లేచి వెళ్ళి ఏం మాట్లాడాలా-? అని రిహార్సల్ చేసుకుంటున్నారు ఎవరి మనస్సులో వారే.

ఇంతలో సుబ్రహ్మణ్యమే అటుగా వచ్చాడు. అతడి ముఖంచూస్తే ఆదుర్దాగా వున్నాడు. తొందర తొందరగా బయటకు పోబోతున్న అతన్ని లలిత 'ఏమండీ' అంటూ పిలిచింది. అతడు వెనుతిరిగి చూసి... "ఓ మీరా!" అంటూ ఇద్దరివైపూ చూశాడు. ఆ సమయంలో వారిని కలుసుకోవడం అతనికి సంతోషంగాలేదని అతని ముఖమే చెబుతున్నది.

"చాలా తొందరగా వెళ్లాల్సిన పని వుంది...సారీ! మీతో మాట్లాడే టైం లేనందుకు చింతిస్తున్నాను. మరోసారి కలుద్దాం" అన్నాడు.

"మంచిదే! మీకు వీలుంటే ఒకసారి కలుద్దామనుకున్నాం."

"సారీ! మిమ్మల్ని అనవసరంగా ఇబ్బంది పెడుతున్నాను. రేపు వస్తే తప్పకుండా కలుద్దాం! లేదా మీకు వీలున్నప్పుడు ఫోన్‌చేసి రండి" అన్నాడు నడుస్తూ ముగ్గురూ బయటకు వచ్చారు. అతడు మరోసారి 'సారీ' చెప్పి స్కూటర్ మీద వెళ్ళిపోయాడు. ఇద్దరూ నిరాశగా రోడ్డుమీదకు రావడానికి చెట్లనీడకింద నడుస్తున్నారు. వారిని అంతకుముందే చూసినవ్యక్తి దగ్గరగావస్తూ, "ఏంపనిమీద వచ్చారండీ?" అన్నాడు కన్నెగరేసి. ఆ వ్యక్తిని చూస్తేనే జులాయిరకంగా భావించింది లలిత. వీడెవడో తమను వెంటపడుతున్నాడనుకుని, "తెలిసినవ్యక్తిలెండి. మాట్లాడివెళ్దామని వచ్చాం" అంది లలిత.

"అతడి భార్య ప్రసవవేదనపడుతున్నదని ఇప్పుడే ఫోన్ వచ్చింది. అందుకే అంత తొందరగా వెళ్ళాడు. లేకుంటే మీతో నింపాదిగా మాట్లాడేవాడే!" అన్నాడతను.

లలిత చివాలున అతడి వైపు తలెత్తి చూసింది. వారి ముఖాలలో కన్పించిన భావంతో, తాను ఊహించింది నిజమే అనుకున్నాడు అతడు. సుబ్రహ్మణ్యం గోపికలలో వీరిద్దరూ ఉంటారని అతని వూహ. తిరిగి వల్లించాడు అదేమాట. "అతని భార్య డెలివరీ టైం! ఇంటి దగ్గర నుండి ఫోన్‌వస్తూనే వెళ్ళాడు"

రాజ్యం షాక్ తిన్నట్లయింది. నడపడానికి కూడా నీరసం వచ్చినట్లయింది. బేలగా లలిత ముఖంలోకి చూసింది.

"అతనికి పెళ్ళయిందా?" అంది లలిత చిన్నగా.

"ఉద్యోగం రాకముందే పెళ్ళయింది. ఈ కాన్పు మూడోది. మీరెవరు?"

"ఓరియంటల్ కాలేజీ స్టూడెంట్స్‌మిలెండి. అతను మాకు కొద్దిగా పరిచయం. ఇటు వచ్చాంగనుక ఒకసారి మాట్లాడి వెళ్దామని వచ్చాం" వడివడిగా అడుగు లేసింది రోడ్డు మీదకు. ఆమెతోపాటు రాజ్యం అదురుతున్న గుండెమీద ఒక చెయ్యివేసి నడిచింది. కనిపించిన బస్సు అందుకుని వెంటనే కాలేజీకి చేరారు.

ఆ పగలంతా లలిత రాజ్యంతోమాట్లాడ





లేకపోయింది. ఏం కదిలిస్తే ఎలా బాధ పడుతుందోనని సంశయం. మధ్యాహ్నం రాజ్యం భోజనం కూడా చేయలేదు. రాత్రి భోజనం తీసుకువస్తే తిననని చెప్పింది రాజ్యం. లలిత బతిమిలాడింది.

"ఏం జరిగిందని! ఇంకా ఏం జరుగక ముందే బయటపడింది. అందుకు సంతో షించాలి, కానీ బాధెందుకు?"

"నాకు ఆకలికాలేదు లలితా! దయచేసి బలవంతపెట్టవద్దు. జరిగిందాన్ని గురించి నేనేమీ బాధపడటంలేదు"

మరింత బతిమిలాడినా తినదని ఆమె తత్వం తెలిసిన లలిత ఏమీ మాట్లాడ కుండా పళ్ళెం అక్కడే పెట్టి, కిందికి వెళ్ళింది. భోజనం చేసి వచ్చేటప్పటికి తన వద్దనున్న ఉత్తరాల్ని ముక్కలుగా చించు తున్న రాజ్యం కళ్ళబడింది. ఆమె కళ్ళ నుండి కారిన నీళ్ళు చారికలుగా ఏర్ప డాయి. చించిన ఆ ముక్కల్ని లలిత తీసుకుని కారిడార్‌లోకి వచ్చి కిందికి విసిరివేసింది.

"మేడిపండు లాంటివాళ్ళు మనుషుల్లో ఎందరో ఉన్నారక్కా! ఎర్రగా ఉందను కుంటాంగానీ, లోపలున్న పురుగులు కనిపించవుగదా"

రాజ్యం మాట్లాడలేదు. చాపమీద పడు కుంది తల ఒకవైపు తిప్పుకుని.

"బాధపడవద్దక్కా! జీవితం చాలా ముందుంది. నీలాంటివాళ్ళు ఏమాత్రం తప్పటడుగులేసినా తేరుకోలేరు. నాలాంటి వాళ్ళయితే విదిలించివచ్చేవాళ్ళం. వాడికో ఉత్తరం రాసిపడేయ్. ఇలా నీచంగా ఇక ముందు ఎవరికీ రాయవద్దని"

"అతని తప్పుకూడా ఏమీ లేదేమో లలితా! అతన్ని ఎన్నడూ 'మీకు పెండ్ల యిందా?' అని నేను రాయలేదు. నేను రాయకపోతే అతడు చెప్పాల్సిన అవసరం లేదు. నేనే తొందరపడ్డానమో అన్ని విషయాలూ తెలుసుకోకుండా"

"వాడయినా రాయవచ్చుగదా... తనకు పెళ్ళయిందని! పెళ్ళికాని పిల్లలతో వాడు ఆటలాడుకుంటున్నాడు. ఉత్తరాలు అలాగే ఉంచి స్టేషన్ డైరెక్టర్‌కు ఇస్తే సరి పోయేది! వాడూ, వాడి భార్యా వీధులలో అడుక్కోవలసివచ్చేది"

"ఎందుకంత ద్వేషం! నేను అందుకో లేనిది మరొకరు అనుభవిస్తున్నారనా? ఆమె జీవితం పాడుచేస్తే మనకు వచ్చే లాభమేమిటి?"

"ఇప్పుడు నీకు బాధకాదా! నీకు నచ్చిన మగవాడు ఈవిధంగా ద్రోహం చేస్తే నీవు భరించడం సాధ్యం కాదు గదా?"

రాజ్యం పలకలేదు ఒక్కక్షణం. వాతావరణం రణగొణధ్వనిగా ఉంది కింద. "లలితా! జరిగింది మరచిపో. నా జీవితం ఇలా కాలిపోవలసి ఉందేమో? ఇంకెవరికీ చెప్పకు!"

"ఎవరికీ చెప్పనుగానీ, నీ మనస్సు జాగ్రత్తపెట్టుకో! వాడి తాతలాంటివాడు వస్తాడు, ఏదయినా ఒక ఉద్యోగం సంపా దించుకుని నీ కాళ్ళ మీద నీవు నిలబడితే. ఏ ఆడదానికయినా జీవితంలో ఇలాంటి సంఘటనలు సహజం అక్కా! అది మరచిపోతేనే మంచిది"

"అంటే నీకు ఇది అనుభవమేనా?"

లలిత విషాదంగా నవ్వింది—"టెన్త్ చదివేటప్పుడే పప్పులో కాలేశాను. అది కాలకముందే తీయగలిగాను. ఆనాటినుండీ జాగ్రత్తగానే ఉంటున్నాను"

"లలితా! జీవితంలో మొట్టమొదట ఊహలు లేపినవాడిని నువ్వు మరచిపో

గలిగావా? అతన్ని గురించి నీకు ఏమీ అనిపించదా?"

"ఏమీ అనిపించదు. వాడు చచ్చా దన్నా సానుభూతీ, ద్వేషం ఏదీ చూపను"

"నేను అలా మరచిపోలేనేమో? ఎందు కంటే తప్పు అతడు చేయలేదనే అను కుంటున్నాను. నేనే పెర్రిమొర్రి ఊహ లల్లుకుని అతన్ని ప్రేమించి పెళ్ళి చేసు కుందామనుకున్నాను. అందువల్ల తప్పు నాదేనేమో?"

లలిత మాట్లాడలేకపోయింది. ఇప్పుడు రాజ్యంస్థానంలోతానేఉంటే సుబ్రహ్మణ్యం ఇంటికివెళ్ళి, అతగాడి పెళ్ళాం ముందే చీర ఝాడించినంత వేగంగా ఝాడించి వచ్చేది. కాని, రాజ్యం తనదే తప్పని అతన్ని వెనకేసుకొస్తున్నది. అంటే అతగాడిని చాలా గాఢంగా ప్రేమి స్తున్నది. కాదు...అలా అనుకుంటున్న దేమో? స్త్రీలు ఇంత సులభంగా ప్రేమించ బట్టే పురుషులు అంతే సులభంగా మోస గించి కారాకిళ్ళీ ఊసినట్లు తోసివేస్తూ, మరో కొత్త వ్యక్తి కొరకు అన్వేషణ సాగిస్తున్నారు. రాజ్యం పైకి రాకపోవ డంతో తానుకూడా ఉక్కపోస్తున్న ఆ గదిలోనే పడుకొంది. కాని తొందరగా నిద్రపట్టలేదు. తన జీవితాన్ని గురించి ఆలోచిస్తున్నది. అప్పుడప్పుడు లేచి రాజ్యంపైపుచూస్తున్నది. రాజ్యంవెల్లకిలా పడుకుందేగానీ, తెరచిన కన్ను మూయ లేదు. అప్పుడప్పుడు కళ్ళనుండి కన్నీరు కారుతున్నది.

* * *

ఉదయం నిద్ర లేచేటప్పటికి ఎనిమిది గంటలు కావస్తున్నది. స్నానం చేయడా నికి కిందకు వచ్చింది రాజ్యం. వేపచెట్టు కింద చాలామంది చేరి గుసగుసలాడు కుంటున్నారు. తన విషయం తెలిసి వారు కూడారేమోనని అనుమానం వేసింది. తన విషయం బహిరంగంగా తెలిస్తే అందరిలోనూ అభాసుపాలు కావలసి వస్తుంది. లలిత పంపుదగ్గర నీళ్లుపడుతూ వారివైపు చూస్తున్నది. రాజ్యం రావడంతో బకెట్ బాత్‌రూంలో పెట్టింది.

"ఏమిటి జనం కూడారు అక్కడ?" అంది అనుమానంగానే రాజ్యం.

"ఇంకేముంది? సుమతి ఘనకార్యం మట! రాత్రి రెండుగంటలప్పుడు గోడ దూకి హాస్టల్‌కు వచ్చిందట. ఆ సమయా నికి మేట్రన్ కాపువేసి కూర్చుని పట్టే సింది. తెల్లారి ప్రిన్సిపాల్ వచ్చిన తరు వాత ఏంజరుగుతుందో ఊహించి చెప్పు కుంటున్నారు" అంది లలిత నవ్వుతూ.

"పర్మిషన్ తీసుకోకుండా బయటకు ఎందుకు వెళ్ళడం?"

"నా ప్రియుణ్ని కలుసుకోడానికి పర్మిషనివ్వండి మేడమ్–అంటే మేట్రన్ ఇస్తుందా ఏమిటి? అడ్డదారిన వెళ్ళింది... అడ్డదారినే వచ్చింది. ఖర్మకాలి దొరికి పోయింది"

"ఇక్కడున్న పిల్లలు అంతబరి తెగించి ప్రవర్తిస్తున్నారా?"

"ఆహా...ఇక్కడేకాదు. ఎక్కడున్న పిల్లలయినా ఈ వయసు అంతే మరి! లలిత నవ్వింది. "ఇక్కడున్న కాలేజీ పిల్లలు ఇరవై సంవత్సరాలలోపు ఎవరూ లేరు. వారి మానసికస్థితి ఎలాఉంటుందో ఇక ఆలోచించుకో"

నిజమేననుకుంది రాజ్యం. యుక్త వయస్సులో కోరికలు సహజం. అవి తీర తానికి బదులు, బంధనాలు ఎక్కువైతే తెంచుకొని బయటపడటానికే ప్రయత్ని స్తారు. సీత, సావిత్రి కథలు ఎన్ని

చెప్పినా, వాళ్ళు ఆవయసులో ఇంతకంటే ఘోరంగా ఆలోచించి ఉంటారని బతికి ఉంటే చెప్పేవాళ్ళే. చచ్చారు గనుక మహాపతివ్రతలయ్యారుగానీ, బ్రహ్మచారి ముదిరినా, బెండకాయముదిరినా పనికి రారంటారు. నిజమే! పాకానికి వచ్చిన స్త్రీకి కోరిక తీరకపోతే పిచ్చిముదిరి చెడి పోతుంది-అన్నసామెత నిజమే.

లలిత చెప్పుకుపోతున్నది. "సుమతి ఇక్కడ అసాధారణమైన వ్యక్తి. ఏవో సిద్ధాంతాలంటూ కలవరిస్తుంటుంది. తన సిద్ధాంతాలను అనుసరించే యువకులతో తిరుగుతున్నానంటుంది. ఆమె తండ్రిని రాజకీయాలలోచంపేశారట. ఆ కక్ష తీర్చు కోవాలని కేకలేస్తుంటుంది. ఆమెసిద్ధాంతం సంగతేమోగానీ రోజూ బయటకు వెళ్ళి రాక తప్పదు. ఎక్కడెక్కడ తిరుగు తుందో అందరూఊహించేవాళ్ళే. ఒకసారి తెలుగు లెక్చరర్ కళ్ళబడింది ఒక యువ కుడితో! మరుసటిరోజు అతడు తనఅన్న అంటూ లెక్చరర్‌కంటే ముందే ప్రచారం చేసుకుంది. అదే లెక్చరర్‌కంట రెండో సారి మరో వ్యక్తితో బయటపడి, అతడు తన మామ అంటూ ప్రచారం చేసుకుంది. ఏది ఏమయితే ఏం.... ఒకసారి అబార్షన్ చేయించుకుంది ఇక హాస్టల్లో ప్రెసిడెంటు ఉంది. దానితో ఒకటే ముద్దులు... కౌగిలిం తలు..."

రాజ్యం బాత్‌రూం తలుపు వేసు కుంది. లలిత వారి దగ్గరకు వచ్చింది. అందరి దృష్టిలో పతితురాలయింది సుమతి. మేట్రన్ కంటబడకుండా చాలా మంది గోడదూకి వెళ్ళి వస్తున్నారని వారికి తెలుసు. నిన్నటిదాకా సుమతి అదృష్టానికి వీళ్ళంతా ఈర్ష్యపడినవాళ్లే, తమకా అవకాశం దొరకనందుకు తెగ బాధపడినవాళ్ళే! కానీ ఈరోజు సుమతి దొరికిపోయిందిగనుక పతితగా ముద్రవేసి సంతోషపడుతున్నారు. మనిషి సహజ నైజం అదే.

పదిగంటలకు ప్రిన్సిపాల్ వచ్చారు. ఆమె ఎదురుగా సుమతిని హాజరు పర చింది మేట్రన్! ప్రిన్సిపాల్ తన ఎదు రుగా నిలబడ్డ సుమతిని పైనుండి కింది దాకా చూసింది. "నిజమేనా?" అంది కళ్ళద్దాలు చేతితో కదిలిస్తూ.

"నిజమే మేడం" అంది సుమతి పైట సర్దుకుంటూ.

"ఎందుకు వెళ్లావు?"

"నేనో రాజకీయ పార్టీకి కమిట్ అయినదాన్నని మీకు తెలుసు. నా అవసరంకొద్దీ వెళ్ళాను. గేటు వేశారు గనుక గోడదూకి రావలసివచ్చింది"

"నీ రాజకీయాలు బయటకు వెళ్ళిన తర్వాత చూసుకో! ఒక ఆశయం కొరకు ఈ హైస్కూలు, కాలేజీ ఏర్పరచారు. కానీ నువ్వు అందుకు అనుగుణంగా నడవడంలేదు. పైగా నీ రాజకీయాలంటూ బొప్పిస్తున్నావు. ఇప్పటికే నీకు మూడు సార్లు వార్నింగ్ ఇవ్వడమైంది. సరి అయిన సంజాయిషీ ఇవ్వకపోతే సస్పెండ్ చేయక తప్పదు"

సుమతి మాట్లాడలేదు. ప్రిన్సిపాల్ వెనుకనున్న కిటికీని, కూర్చున్న కుర్చీని చూస్తూనిలబడింది. మేట్రన్ పక్కన నిల బడింది. ప్రిన్సిపాల్ రాసుకుంటూ కూర్చుంది. ప్రిన్సిపాల్ ఉన్నప్పుడు ఆవరణలో ఎవరూ పిల్లలు ఉండరు. అందువల్ల నిర్మానుష్యంగా ఉంది చెట్టు కింద! తలెత్తి సుమతివైపు చూసింది ప్రిన్సిపాల్.

"ఏమైనా చెప్పుకునేది ఉందా?"




"నేను చెప్పేది ఒకటే మేడమ్! నేనే తప్పు చేయలేదు"

"బయటకు వెళ్ళేదానికి పర్మిషన్ తీసుకున్నావా?"

"తీసుకోలేదు"

"అదికూడా తెలియదా?" గాండ్రించింది ప్రిన్సిపాల్ "ఇదంతా చూస్తే నువ్వు తప్పుచేయడమే వృత్తిగా పెట్టుకున్నట్లు కనబడుతున్నది. బయటకు వెళ్ళు" అంది తూష్ణీ భావంగా. సుమతి బయటకు వచ్చి హాస్టల్ వైపు సాగింది.

మధ్యాహ్నం ఒంటిగంటకు సుమతిని కాలేజీనుంచి వెళ్ళగొట్టారన్న వార్త అందరికీ తెలిసింది. జరిగేది అదేనని అందరికీ ముందే తెలుసు. అందువల్ల ఎవరూ ఆశ్చర్యపోలేదు. రాజ్యం ఈ విషయం వినడంతో పదిమందినీ ఒకచోటికి చేర్చింది. "ఈరోజు సుమతికి అయింది.. రేపు మనకూ కావచ్చు! తప్పును సరిదిద్దుకునే అవకాశం ఇవ్వాలిగానీ, జీవితాంతం బాధపడే విధంగా శిక్షించడం మంచిది కాదు. ఫైనలియర్‌లో ఉన్న సుమతి చదువు ఆపివేస్తే ఆ అమ్మాయి ఏం కావాలి?" అంది.

'ఈ కుంటిపిల్ల కూడా గోడలు దూకిపోయేలా ఉంది ...' అనుకున్నారు కొందరు. మరికొందరు ఈ విషయం ఆలోచించాల్సిందేననుకున్నారు. రేపు మరొకరు బలికావచ్చు. అందువల్ల ముందే మేల్కొనడం మంచిది.

"ఇక్కడ మడిగట్టుకుని కూర్చున్న వారు చాలా తక్కువమంది అని మనకు తెలుసు. రేపు మరొకరు ఈవిధంగా తొలగించబడరనే నమ్మకమేమిటి?" అంది రమ.

మొత్తానికి అందరిమధ్యా ఐక్యత ఏర్పడింది. ప్రిన్సిపాల్‌తో ధైర్యంగా మాట్లాడగల వ్యక్తి ఉంటే మంచిదిగనుక, హాస్టల్ ప్రెసిడెంటునుగాకుండా, రాజ్యంను నాయకురాలిగా ఎన్నుకుని, విద్యార్థినుల తరఫున మాట్లాడటానికి ప్రిన్సిపాల్ దగ్గరకు పంపారు. లోపల ఎంత పిరికిగా ఉన్నా రాజ్యం పైకి ధైర్యంగానే ఉంది. ఇక్కడ ఏదో ఒకటి కెలుకుతూ ఉంటేనే అధికారులు భయపడుతుంటారు. నోరు మూసుకుని ఉంటే ఒక్కొక్కరినే మెడబట్టి గెంటివేస్తారని తెలుసు. మిగిలిన వారందరూ ప్రిన్సిపాల్‌ను చూసి జడుసుకునేవారే.

రాజ్యం, లలిత, రమ, మరికొందరు ప్రిన్సిపాల్ రూం చేరేసరికి ఆమె యోగ నిద్రలో మునిగివుంది- కుర్చీలోనే వెనక్కువాలి. పైకప్పువంక చూస్తున్న ఆమె కళ్ళు మూతలుపడుతూ, తెరుస్తూ ఉన్నాయి. అలికిడి విని లేచి సరిగ్గా సర్దుకుని కూర్చుంది. కళ్ళెగరేసి "ఏమిటి రాజ్యం?" అంది మెత్తగా.

"మీరు సుమతిని ఇక్కడ్నించి పంపేశారన్న విషయం విని వచ్చాము మేడమ్!" అందిఎదురుగా నిలబడి.

"ఆ పిల్ల చేసిన తప్పు తెలుసుగా! ఒకరిని క్షమించి వదిలితే రేపు మరొకరు కూడా ఇదే తంతు ఆరంభిస్తారు. కాలు కుళ్ళిపోవడం ఆరంభిస్తే తలదాకా వెళ్ళే వరకూ ఆగదని మీకు తెలుసుగదా!"

"నిజమేననుకోండి. కానీ ఫైనలియర్‌లో ఉంది. ఈ సంవత్సరం అయితే ఏదో ఉద్యోగం సంపాదించుకునే అవకాశం ఉంటుంది. ఇలా అర్ధాంతరంగా బయటకు పంపిస్తే ఒక నిండు జీవితం బలయిపోతుంది మేడమ్!"

"నిజమే! ఒకరికొరకు ఇక్కడున్న

రెండువందల మందినీ బలిచేయమంటావా? అప్పటికీ గతంలో రెండు మూడుసార్లు క్షమించి వదిలేశాం!"

"మేడం! మా అందరి రిక్వెస్ట్ ఒకటే! ఇకముందు సుమతి తప్పుచేయకుండా మేం హామీ ఉంటాం! మరోసారి తప్పు జరిగితే ఆమెతోపాటు మామీద కూడా మీరు చర్య తీసుకోవచ్చు! ఈ ఒక్కసారికీ క్షమించండి"

"ఆలోచిద్దాం! మీరు వెళ్ళండి" అంది ప్రిన్సిపాల్. అందరూ బయటకు వచ్చారు. ప్రిన్సిపాల్ ఆఫీసుకు ఎదురుగా ఉన్న చెట్టుకింద చేరారు అందరూ. జరిగిన విషయం చెప్పి, "ఎవరూ ఈపూట క్లాసులకు వెళ్ళకూడదు. సుమతి మీద చర్య నిలుపుచేస్తేనే మనం క్లాసులకు వెళ్ళాలి" అంది రాజ్యం. బయటనుండి వచ్చే వాళ్ళను చెట్టుకిందకు తెచ్చి నిలిపేశారు. ఎండకు నడిచిరావడంతో ఉస్సురంటూ చెట్టు నీడన కూలబడ్డారు వాళ్ళు. హాస్టల్ ప్రెసిడెంటుకు మండిపోతోంది వీరి వ్యవహారం! ఇప్పుడు తననాయకత్వంపడిపోతే, రేపు ప్రెసిడెంటుగిరి ఊడలాగుతారు. అసలే రమ, లలిత అతిగాపోయే పిల్లలు వాళ్ళు ఇప్పుడు సహకారం ఇస్తున్నది తన స్నేహితురాలికే. వ్యతిరేకిస్తే అదో పెద్ద తంటా. ఏం మాట్లాడలేక ఒకవైపు జడను వేళ్ళతో దువ్వుకుంటూ తల వంచుకుని కూర్చుంది.

రెండుగంటలకు ప్రిన్సిపాల్ నుండి పిలుపు వచ్చింది రాజ్యానికి. లోపలకు వెళ్ళింది. ప్రిన్సిపాల్ రాజ్యం వైపు చూసి నవ్వింది. "సరే! ఒక వ్యక్తి జీవితం నాశనం చేయడం నాకు మాత్రం ఇష్టమా? కానీ తప్పు తప్పే! నీమీద నాకు నమ్మకముంది. ఇకముందు తప్పుచేయదని నువ్వు హామీ రాసిస్తే క్షమించి విడిచి పెడతాను"

రాజ్యం బరువుగా ఊపిరి విడిచింది. తాను హామీ ఇవ్వకుంటే సుమతి బయటకు పోతుంది. హామీ ఇస్తే సుమతి రేపు తప్పుడు పనిచేయదని నమ్మకమేమిటి? ఎలాగయినాసరే... ఒక మనిషిని కాపాడటానికే ప్రయత్నిద్దామనినిర్ణయించుకుంది. హామీ రాసివ్వడానికి ఒప్పుకుంది.

రాతలయిపోయిన తరువాత పిల్లలు బిలబిలమంటూ క్లాసుల్లోకి పరుగెత్తారు.

సుమతిని తమ రూంలోకి మార్పించవలసిందిగా మేట్రన్‌ను కోరింది రాజ్యం. మేట్రన్ తల ఊపి అంగీకరించింది. "నువ్వు చాలా మంచి పిల్లవు! మరో ఆరు నెలలు అది నీకు గుదిబండ.జాగ్రత్త పెట్టుకో! లేకుంటే నీ జీవితం పాడవుతుంది" అంది హెచ్చరిస్తూ.

సాయంత్రం తన బిచాణా తీసుకుని లోపలకు అడుగు పెట్టింది సుమతి. మేట్రన్, ఆ రూంలో ఉన్న ఒకరిని బయటకు రమ్మంది గానీ మొత్తం ఆరుగురిమీ కలిసి ఉంటామని రాజ్యం చెప్పడంతో ఆమె అంగీకరించింది.

"నీ సహాయం నేను మరువలేను అక్కా!" అంది సుమతి కళ్ళనీళ్ళు కారుస్తూ.

"ఇందులో ఊడబొడిచిందేమీ లేదులే! ఇకనయినా జాగ్రత్తగా ఉండు"

సుమతి తల ఊపింది. మనస్సులో మాత్రం ఈ కుంటిదానికి పవర్ పెరిగిపోయిందే అన్న బాధ ఏర్పడింది. ఇంత వరకూ తననూ, ప్రెసిడెంటునూ చూసి మిగిలినవాళ్ళు భయపడేవాళ్ళు. వాళ్ళందరూ ఇప్పుడు తమను వెక్కిరిస్తూ, ఈ కుంటిదాన్ని నెత్తిన పెట్టుకుంటున్నారు.




* పచ్చని పైరు విప్లవానికి..
* పాడి పరిశ్రమాభివృద్ధికి..
* గ్రామసీమల సౌభాగ్యానికి..
మార్గదర్శి

# అన్నదాత

## వ్యవసాయదారుల సచిత్ర మాసపత్రిక



సాలు చందా రూ. 24/- మాత్రమే

పోస్టేజి ఉచితం

విడిప్రతి రూ. 2/-



అన్నదాత
ఈనాడు కాంపౌండ్
సోమాజిగూడ, హైదరాబాద్-500004
ఫోన్: 223422

రోజులు గడిచి పోతున్నాయి. ప్రతి విషయంలోనూ రాజ్యం ముందుండటంతో అందరికీ ఆమెఅంటే గౌరవం ఏర్పడింది. వయస్సురీత్యా అందరికంటే ఆమే పెద్దది. ఇక మంచి మాటలతో అందరినీ ఆకట్టుకునే సామర్థ్యం ఉంది.



## 3

సంవత్సరాంతం పరీక్షలు పూర్తయ్యాయి. పిల్లలు ఒకరికొకరు వీడ్కోలు చెప్పుకుంటున్నారు సంతోషంగా. మళ్ళీ జీవితంలో కలుస్తామో లేదోనని గాఢంగా కౌగలించుకుంటున్నారు-ముద్దు పెట్టుకుంటూ.

లలిత, రాజ్యం ఇద్దరూ రైల్వే స్టేషన్‌కు వచ్చారు. బండి రావటానికి ఇంకా టైముంది. "ట్రైనింగ్ ఎక్కడికి వెళ్తావ్ అక్కా?" అంది నిలబడిన రైలును చూస్తూ.

"అసలు ఏం చేయాలా అన్నది ఇంటికివెళ్ళి ఆలోచించాలి. అంతవరకూ ఒక నిర్ణయానికి రాలేను. ఏదయినా ఉద్యోగం కొరకు ప్రయత్నిస్తాను" అంది రాజ్యం.

"ఏది చేసినా ఈ మొగవాళ్ళతో స్నేహం చేయకు. సుబ్రహ్మణ్యంలాగే వాళ్ళూ తయారవుతారు" అంది లలిత చిన్నగా నవ్వుతూ.

రాజ్యం నవ్వింది. "తప్పు ఇద్దరిదీ అవుతుందే! సుబ్రహ్మణ్యం నన్ను మోసం చేశాడని అనుకోలేకున్నాను. అతన్ని ఆరాధించడం నాతప్పేనేమో! అందువల్లే అతని మీదున్న అభిమానం ఇంకా చావడం లేదు"

లలిత నుదురు కొట్టుకుంది చేతితో, "ఇలా అయితే మళ్ళీ మోసపోతావు!"

"ప్రతి మనిషి జీవితం మోసం, నీతీ రెంటి కలయికతోనే సాగుతుంది"

లలిత మాట్లాడేలోగా రైలు శబ్దం చేసుకుంటూ వచ్చి ప్లాట్‌ఫారంమీద నిలబడింది. ఎక్కడానికి జనం ఎగబడ్డారు. మరికొంత సేపటికి దిగేవారి, ఎక్కేవారి పోరాటం సద్దుమణిగింది. బండి కదలటానికి మరో పదిహేనునిముషాలుసమయం వుంది. ఎంతసమయంవున్నా జనం ఎగబడి ఎక్కడమేగానీ, నిదానంగా ఎక్కుదామనే ఆలోచనే ఉండటంలేదనుకుంటూ ఇద్దరూ నిదానంగా పెట్టెలు సర్దుకున్నారు. రైలంతా ఖాళీగానే ఉంది. ఒక బెర్త్‌మీద కూర్చుని అరటి పళ్ళు తినడం ఆరంభించారు.

లలిత గ్రామం రెండు స్టేషన్ల తర్వాతే! మరి కొంతదూరం వెళ్ళాలి రాజ్యం. లలిత దిగుతూ త్వరలోనే కలుస్తానని చెప్పింది. బండి రెండు నిముషాలకే ఆ స్టేషన్ విడిచింది. రాజ్యం బైటకుచూస్తూ కూర్చుంటే-

"ఏవూరమ్మా మీది?" పక్క బెర్త్ మీద కూర్చున్న ముసలమ్మ పలుకరించింది.

చెప్పింది రాజ్యం.

"పిల్లలెందరు?"

రాజ్యం ముఖం మలినమయింది. బయటకు చూస్తూ కూర్చుంది. ముసలి




వాళ్లు తోడయితే ఇదేబాధ. పెళ్ళయిందా? పిల్లలెందరు? ఏంచేస్తుంటారు? ఆస్తి ఎంత? ఈ వివరాలు చెప్పాలంటే రాజ్యానికి బాధ. చెప్పకుంటే విడిచిపెట్టరు.

''ఇద్దరు'' అంది టక్కున! పెళ్ళి కాలేదంటే ఎలాగూ నమ్మరు. కాకపోవ డానికి సవాలక్ష కారణాలు వెదుకుతారు. ఒక్క మాటతో నోరు కట్టివేయవచ్చు ననుకుంది.

ముసలమ్మ తల ఊపింది నింపాదిగా. "అదృష్టవంతురాలివి తల్లీ! కుంటిదాని వయినా నీభర్త నిన్ను బాగానే చూసు కుంటున్నాడల్లే ఉంది. మా ఊళ్లో ఒక కుంటి అమ్మాయి వుంది. యాభైవేలు కట్నమిచ్చి కట్టబెట్టారు. కూడులేనివాడికి యాభైవేలిస్తే వాడి తిమ్మిరి ఊరకుం టుందా? రోజూ తాగి ఆ కుంటిదాన్ని బాదివేయడమే!'' ఆమె చెప్పుకుపోతు న్నది.

తల భారమయింది రాజ్యానికి. తను అదృష్టవంతురాలో, దురదృష్టవంతురాలో తనకే తెలియడంలేదు. నిష్ఫంతగా ప్రేమించినవాని దగ్గర కాలం గడుపు దామంటే అది ఎండమావి అయింది. ఇకముందు ఎలా గడుస్తుందో తనకే తెలియదు. కాని, ముసలమ్మ కథ మాత్రం రాజ్యానికి బాధ కలిగించింది. కుంటివాళ్ళను ఎవరూ చేసుకోరు, అలా ఎవరయినా చేసుకోదలచినా వారి ఆస్తికో, డబ్బుకో ఆశపడి చేసుకుంటారు. అవిటి వాళ్ళమీద ప్రేమతో, దయతో చేసుకున్న వాళ్ళు కనిపించడంలేదు.

ఆలోచనల్లో ఉండగానే తన స్టేషన్ చేరింది రైలు. ప్రయాణికుల సందడి మామూలే. వారి మధ్య పీలుచేసుకొని బయటకు చూసింది రాజ్యం. కనిపిం చిన తండ్రిని కేకేసింది. ఆయనవచ్చి రాజ్యాన్ని కిందకు దించి, ఆమె పెట్టె కూడా దించాడు. రైలు వెళ్ళిపోవడంతో స్టేషన్ రణగొణధ్వని సద్దుకుంటున్నది. పెట్టె చేత పట్టుకుని సూర్యం, అతడి వెంట రాజ్యం బయటకు నడిచారు. స్టేషన్‌బయటజట్కాలోఎక్కికూర్చున్నారు. రెండు మైళ్ళ దూరమే వాళ్ళఊరు. అర గంటలో ఇల్లుచేరారు. పెట్టెకిందకి దించి, రాజ్యం చెయ్యి పట్టుకుని కిందకిదించాడు.

ఇల్లు నిశ్శబ్దంగా ఉంది. ఎవరూ కనిపిం చడంలేదు.

"ఎవరూలేరేం నాన్నా?" అంది తండ్రి వైపు తిరిగి.

"ఎవరి తోవవాళ్ళు చూసుకున్నా రులే!" అన్నాడు పెట్టెలోపల పెడుతూ.

"అక్కయ్య ఏది?"

"అక్కయ్య పక్కన కాపురం పెట్టింది. తనకు ఇస్తానన్న రెండున్నర ఎకరం అమ్ముకుంది. మన పొలానికి పెట్టిన నష్టం డబ్బులు చెల్లించాలట. లేకుంటే కోర్టకెక్కుతామని ఆమె, మొగుడు బెదిరిస్తున్నారు. చాలా తగవు అయింది. ఏం చేస్తాం? అంతరూ తిరి తగవు పెట్టుకునేవాళ్ళే" అన్నాడు సూర్యం.

స్టౌ వెలిగించి బియ్యం గిన్నెలోపడేసి స్టౌమీద పెట్టింది. తమ్ముడు వచ్చాడు. "ఎప్పుడొచ్చావే?" అన్నాడు నవ్వుతూ.

"ఇప్పుడే అరగంట అవుతుంది. అన్నం తినలేదా ఇంకా?" అందిరాజ్యం.

"నేనూ, నాన్నా అన్నంవండుకొని తినే సరికి మధ్యాహ్నం ఒంటిగంట అవు తుంది"

రాజ్యం మాట్లాడలేదు. వంట పూర్తి య్యే సరికి పన్నెండుగంటలు దాటింది.

రోజూలాగే వాళ్ళు అన్నం తినే సరికి ఒంటిగంట కానేకావచ్చింది.

పక్క ఇంటినుండి భారతి వచ్చింది. రాజ్యం పినతండ్రి కూతురు. ఆమె భర్త చనిపోవడంవల్ల పిల్లలతో తండ్రి ఇంటి లోనే ఉంటూ, పిల్లల్ని చదివించుకుంటు న్నది.

"బాగున్నావా రాజ్యం?" అంది నవ్వుతూ.

"ఆ.... నేను బాగానే ఉన్నాను. మీరం దరూ బాగానే ఉన్నారా?"

తల ఊపింది భారతి. సూర్యం కుటుంబం పోట్లాట గురించి వివరంగా చెప్పింది భారతి. "మరి నాకు ఒక్క విషయమూ ఎవరూ రాయలేదే?" అంది రాజ్యం.

"అనవసరంగా మనస్సు బాధపెట్టు కొని చదువు పాడుచేసుకుంటావని తెలుప లేదు. అయితే ఏం! ఎవరంతకు వాళ్ళు సర్దుకున్నారు. మరి నువ్వేం చేద్దామను కుంటున్నావ్? ఇంతటితో చదువు మాను కుని పెళ్ళి చేసుకుంటావా?"

సిగ్గుతో తల వంచుకుంది రాజ్యం. "ట్రైనింగ్ పూర్తిచేసి ఉద్యోగం కొరకు ప్రయత్నిస్తాను అక్కా! నా కాళ్ళమీద నేను నిలబడితేనే బాగుంటుందిగదా"

"అదే మంచిది! అసలే అవిటిదానివి చివరకు లెట్రిన్‌కు వెళ్ళలన్నా శక్తిలేని దానివి! చూస్తూ చూస్తూ అవిటివ్యక్తిని ఎవడూ చేసుకోడు. నాన్న ఇచ్చే కట్నా నికి ఆశపడి ఎవడయినా చేసుకున్నా, మోజు తీరినతర్వాత బజార్న పడవేస్తారు. దానికంటే ఉద్యోగం మీద ఆధారపడితే ఒక పని పిల్లను పెట్టుకుని హాయిగా జీవించవచ్చు" అంది భారతి.

తల ఊపింది రాజ్యం. అవిటి వ్యక్తి అయినా, గుడ్డి వ్యక్తి అయినా పురుషునికి స్త్రీ, స్త్రీకి పురుషుడూ తప్పకుండా కావా లన్న విషయం భారతికి తెలుసు. కానీ మోసం చేస్తారనేదే ఆమె భయం.

రాత్రి తండ్రిని అడిగింది- "నాన్నా! నేను రాజమండ్రికి ట్రైనింగుకు వెళ్తాను"

సూర్యం ఆమె వైపుచూశాడు- "అదే మంచిదమ్మా... నీకు ఏదో ఒక ఆధారం దొరకడమే మాకు ముఖ్యం! మా బాధలు మేము ఎలాగూ పడక తప్పదు. త్వరలో తమ్ముడి పెళ్ళిచేయాలి"

రాజమండ్రి ట్రైనింగ్ స్కూలుకు అప్లికేషన్ పంపుకుంది. ఫిజికల్లీ హాండీకాప్డ్ కావడంతో సీటు సులభంగానే దొరికింది.

సూర్యం కొడుకునూ, కూతురినీ రాజ మండ్రికి బయలుదేరదీశాడు. అక్కడ ఉన్న దూరపు బంధువుకు ఒక ఉత్తరం రాసి ఇచ్చాడు పినతండ్రి.

"ఇక్కడి విషయాల గురించి ఏం పట్టించుకోకు. ఆర్నెల్లలో ఎలాగూ తిరిగి వస్తావు. ఆర్నెళ్ళు మేం వండుకు తింటాంలే! శ్రద్ధగా చదువుకుని బాగు పడు" అన్నాడు తండ్రి. భారతి మూడు సీసాలలో పచ్చళ్ళు పెట్టి ఇచ్చి "ఉత్తరం రాస్తూ ఉండు" అంది.

రాజ్యం తల ఊపింది.

విజయవాడ నుండి ట్రైన్ రద్దీగా ఉంటుందనే భయంతో బస్సులో వెళ్ళ డానికే నిశ్చయించుకున్నారు. జూన్ మాసం కావడంతో జనం కిటకిటలాడు తున్నారు. పెళ్ళిళ్ళ సీజన్, వర్షాకాలపు ప్రారంభదినాలు, వ్యాపారాలకు సీజన్ కావడం వల్ల ప్రయాణాలు ఎక్కువ!

తెల్లారేటప్పటికి రాజమండ్రిలో దిగారు. దూరపు బంధువు క్రిష్ణయ్య ఇల్లు వెతు




క్కుంటూ రిక్షాలో బయలుదేరారు.

ఇల్లు చేరేసరికి ఆయన బజారుకు వెళ్ళాడని చెప్పారు. తాము ఫలానా అనీ, తాము ఫలానా పనిగా వచ్చామనీ ఆయన భార్యతో చెప్పారు. ఆమె నిర్లిప్తంగా-

"ఆయన వచ్చేవరకూ కూర్చోండి" అంది. వసారాలో కుర్చీలలో కూర్చున్నా రిద్దరూ. 'బాబాయి చెప్పటమేమో 'వాళ్ళు నిన్ను హాస్టల్లో ఉండనివ్వరు. వాళ్ళ ఇంట్లోనే పెట్టుకుంటారు అని. కాని, ఇక్కడ ఈవిడ లోపలకు వెళ్ళి తిరిగి బయటకు కూడా రాలేదు. పలుకరింపులే ఇంత బాగుంటే, ఇక ఈ ఇంట్లో తాను వుంటే ఎలా వుంటుందో' ఊహించుకుంటు న్నది రాజ్యం.

తొమ్మిదిగంటలకు కృష్ణయ్య వచ్చాడు. వసారాలోనే వీరిని చూసి కనుబొమలు ముడిచాడు. 'ఎవరుమీరు?' అడిగాడు.

ఉత్తరం చదివి నొసలు ఎగరేశాడు. తర్వాత రాజ్యం ఇచ్చిన చిరునవ్వునవ్వి, "మీ బాబాయి బావున్నాడా?" అన్నాడు.

"పదిగంటలకుగానీ కాలేజీ తెరవరు గదా! ముఖాలు కడుక్కున్నారా?" అన్నాడు లోపలకువెళ్తూ. వీళ్ళ జవాబు ఆయన విననేలేదు.

"ఎవరు వాళ్ళు?" అంది భార్య లోపలకు వెళ్ళగానే.

"దూరం చుట్టంగాళ్ళు! ఏంచేస్తాం? టౌన్లో కాపురంపెడితే ఇలాగే ఉంటుంది. రోజూ ఎవడోఒకడు ఏదో పనిమీద వస్తారు. వారి పని పూర్తిచేయించడానికి నా శెలవులు ఖర్చవుతాయి" అన్నాడు విసుగ్గా.

"తలబరువు చుట్టుకోకండి" సలహా ఇచ్చింది భార్య.

"సరేలే! ఇన్ని కాఫీనీళ్ళయినా పంపించు వాళ్ళకు"

విధిలేనట్లు రెండు గ్లాసుల్లో కాఫీకలిపి వారికి పంపింది పిల్లలతో. అంతవరకూ వాళ్ళు ముఖం కడుక్కోలేదు. కడుక్కోలేదని చెప్పడానికి సిగ్గుపడ్డారు. అలాగే కాఫీ తాగారు.

పదిగంటలకు కాలేజీకి వెళ్ళారు. ప్రిన్సిపాల్ ఆమె సర్టిఫికెట్స్ చూసుకున్న తర్వాత చేర్చుకోడానికి అంగీకరించి ఫీజు కట్టించుకున్నాడు.

"హాస్టల్లో ఉంటుంది అమ్మాయి! హాస్టల్ సీటుకూడా ఇప్పించండి సార్!" అన్నాడు కృష్ణయ్య.

"తప్పకుండా సీటుఇస్తారు! ఫిజికల్లీ హాండ్‌కాప్ట్‌కు రిజర్వేషన్ ఉందికదా! హాస్టల్‌వార్డెన్‌ను కలవండి" అన్నాడు ప్రిన్సిపాల్.

బతుకుజీవుడా- అనుకుంటూ ఊపిరి పీల్చి వదిలింది రాజ్యం. తన ఇంట్లోనే కృష్ణయ్య ఉండమంటాడేమోనని భయపడుతున్నది. మాటలేలేని అతని భార్య వద్ద తాను ఇబ్బందిపడతానన్న భయం ఆమెది. హాస్టల్లో సీటు దొరికితే తోటి పిల్లలమధ్య హాయిగా కాలంగడపొచ్చు. ఆరునెలలు కళ్ళుమూసుకుంటే తిరిగి ఇల్లు చేరవచ్చు.

కృష్ణయ్య హాస్టల్‌వద్దకు తీసుకెళ్ళాడు. వార్డెన్ ఇంటిదగ్గరున్నారని చెప్పడంతో అతడి ఇంటికి వెళ్ళారు. పెద్ద బంగళా! అధునాతన ఫర్నీచర్! మధ్య హాస్టల్ వార్డెన్స్ ఇంద్రభోగాల్లో తేలుతుంటారని విన్నదేగానీ, ఇదే మొదటిసారి చూడటం. నిజమే! వీరి సంపాదన ఎంతో- అను కుంది.

హాస్టల్లో సీటివ్వడానికిముందు ఊగిసలాడినా ఫిజికల్లీ హాండీకాప్ట్ కావడంవల్ల




తప్పనిసరిగా అంగీకరించాడు. మరొక రయితే కొంతయినా తన కమీషన్‌గా తీసుకునేవాడు. అతడితో కాగితాలమీద సంతకాలు తీసుకుని హాస్టల్‌కు వచ్చారు.

నడువలేనివ్యక్తి కావడంవల్ల కింది గది, బాత్‌రూం ఏర్పాటుచేయించారు. కాకపోతే అక్కడి సిబ్బందికి యాభై రూపాయలు ఖర్చుపెట్టవలసి వచ్చింది.

"నువ్వు ఈరోజే ఊరువెడతావా అబ్బాయ్?" అన్నాడు కృష్ణయ్య.

"రేపు వెడతానండి! అక్కయ్యకు బకెట్, చాపలాంటివి కొని తెచ్చిఇవ్వాలి కదా! అవి తెచ్చి రేపు వెడతాను" చెప్పాడు రాజ్యం తమ్ముడు.

"సరే! పనిచూసుకుని ఇంటిదగ్గరకు రా... నేను వెళ్తాను"

"మీరు వెళ్ళండి... వీలుంటే వస్తాను. లేకుంటే ఇటే వెళ్ళిపోతానండీ"

తలవూపికృష్ణయ్య వెళ్ళిపోయాడు.

తమ్ముడు అక్కడే పంపువద్ద ముఖం కడుక్కున్నాడు. హాస్టల్ పిల్లలు కాలేజీనుంచి ఇంకా రాలేదు. పెద్దచెట్లతో, విశాలమైన ప్రాంగణంతో రెండంతస్థుల భవంతి అది. హాస్టల్‌పక్కనే మెస్‌రూం. కాలేజీకి అక్కడకు మైలుకుపైగా దూరం గోదావరి నదిఒడ్డున ప్రశాంతంగా ఉంది హాస్టల్. ఆ ప్రకృతి నచ్చింది రాజ్యానికి. విజయవాడలో తోడుగా లలిత కావలసిన సహాయం చేసేది. ఇక్కడ ఎవరయినా దొరుకుతారోలేదో. లేకుంటే కొంత కష్టపడవలసి వస్తుంది.

ఇద్దరూ రిక్షాఎక్కి టౌనుకు వెళ్ళారు. కావలసిన సామాను తీసుకుని రిక్షాలో తిరిగి హాస్టల్‌దారి పట్టారు.

"రాత్రికి వెళ్లు! మళ్ళీ ఇక్కడ రూం తీసుకుని ఉండటండెనికి? హాస్టల్లో ఉండనివ్వరు" అంది రాజ్యం తమ్ముడితో.

"నా బాధ నేను పడతానే! నీ పని సరిపడిందేమో చూసుకో! నీపని పూర్తయితే నేను ఎప్పుడయినా వెళ్తాను"

"అందే ఇంకా రెండ్రోజులు ఇక్కడే ఉంటావాఏం?"

"ఉండి ఊరు చూసిపోతాను. మళ్ళీ ఇంత దూరం వస్తానన్న నమ్మకమేమిటి? పదిరూపాయలు మనవి కావనుకుంటే బోలెడన్ని లాడ్జీలున్నాయి" అన్నాడు తమ్ముడు నవ్వుతూ.

* * *

సాయంత్రంఆరుగంటలకు ఒక్కొక్కరే హాస్టల్ వైపు రాసాగారు. దాదాపు ఓ ముప్ఫైమందిదాకా పోగయ్యారు. అంత వరకూ జనసంచారంలేని ఆ ప్రాంతం కల కలంతో నిండిపోయింది. గాజుల గల గలలు, కంఠాల కిలకిలలూ, బకెట్ల శబ్దాలతో సందడి ఆరంభమయింది. హాస్టల్‌లో చేరవలసినవారు ఎందరున్నారో రాజ్యానికి తెలియదు. ఉన్నకొద్దిమందినీ చూసి ఈ కొద్దిమందే అయితే హాస్టల్లో సౌకర్యాలు బాగానే వుంటాయనుకుంది. మందిఎక్కువయ్యేకొద్దీ లెట్రిన్‌లూ, బాత్ రూమ్‌లూ, పంపులూచాలక ఒకరి జడ మరొకరు పట్టికొట్టుకునే స్థితికి వస్తారు. హాస్టల్‌కూడా విజయవాడలాగా రేపో, ఎల్లుండో పడిపోయేలాలేదు. కొత్తభవనం. ప్రతి మూడు రూములకూ ఒక పంపు, లెట్రిన్స్, బాత్‌రూంలువున్నాయి. ప్రత్యేకించి అక్కడి ప్రకృతి బాగా నచ్చింది.

"ఏవూరుమీది?" అంది అప్పుడే హాంలో అడుగుపెట్టిన అమ్మాయి.

"మాది వినుకొండ. నాపేరు రాజ్యం. మీదే వూరు?" దాదాపు పాతిక సంవత్సరాల వయస్సుంటుందామెకు. నల్లగా

తుమ్మ మొద్దులావున్నా, శరీర పొందిక బాగుంది. ఎత్తుకుతగలావు, పొడవు జడ.

"మాది ఇక్కడే! ధవళేశ్వరం! నా పేరు రాధిక. ఈ ప్రాంతం మీకు కొత్త అనుకుంటాను"

తల వూపింది రాజ్యం. "అయినా ఫర్లేదులెండి! మీ ప్రాంతంలా అడవి మనుషుల ప్రాంతం మాత్రం కాదిది! తొందర్లోనే అందరూ పరిచయమవుతారు" అంటూ బకెట్ తీసుకుని పంపుదగ్గరికి వెళ్ళింది. వినుకొండ గురించి ఈమెకు ఏమీ తెలిసినట్లులేదనుకుంది రాజ్యం.

రాజ్యం రూంలో మొత్తం ముగ్గురు వున్నారు. ఆరుమందికి కేటాయించిన ఆ గదిలో ఇంకా ముగ్గురుచేరలేదు. చేరతారో లేదో వార్డెన్‌కే తెలియదు. ముగ్గురూ ఒకరినొకరు పరిచయం చేసుకున్నారు.

"హాస్టల్లో నిబంధనలు, కట్టుదిట్టం బాగావుంటాయా?"

రాధిక పెదవి విరిచింది– "ఏమంత వుండవు. అర్ధరాత్రి కూడా బయటకు పోతూ వస్తూనే ఉంటారు. గేట్‌మాన్‌కు చేతిలో ఒక పావలా పెడితే ఎప్పుడయినా గేటు తెరుస్తాడు. మేట్రన్ ముసల్ది. ఎవరినీ పట్టించుకోదు. ఇక్కడికి రాత్రిపూట యువకులు కూడా తమ స్నేహితుల కొరకు వస్తుంటారు"

"ఈ హాస్టల్ మీకు బాగా పరిచయం లాగుందే?"

"ఇందులోనే ఐదు సంవత్సరాలు వున్నాను. ఇది ఆరో సంవత్సరం"

"క్లాసులు ఆరంభమయ్యాయా?"

"ఏం క్లాసులు? ట్రైనింగ్ క్లాసులు పెద్దగా పట్టించుకోదగ్గవికావు. వాళ్ళకు అటెండెన్స్‌వుంటే సర్టిఫికెట్ ముఖంమీద పారేస్తారు. ఎవరు చదువుతారు? పూరంతా తిరగడం తప్ప!"

రాధిక మాటలుబాగా ఆకట్టుకున్నాయి రాజ్యాన్ని. ఇద్దరూ ఆ రాత్రికే మంచి మిత్రులయ్యారు. మూడో అమ్మాయి విశాఖపట్నం ప్రాంతం వ్యక్తి. పెద్ద చనువు పెంచుకోలేకపోయింది. పైగా ఆ అమ్మాయి భాష వీరిద్దరికీ వ్యతిరేకంగా వుంది.

ఉదయం మామూలుగా ఏడుగంటలకు లేచింది రాజ్యం! ఆ పాటికి రాధిక స్నానం కూడా చేసివచ్చింది. కళ్ళు తెరచిన రాజ్యాన్ని చూసి పలకరింపుగా నవ్వి. "ఎనిమిది గంటలకు కాలేజీలో వుండాలి. ఇలా నిద్రపోతే ఎలా?'' అంది.

"ఏంచేద్దాం... ప్రయాణ బడలిక!" అంటూ లేచి వళ్ళు విరుచుకుంటూ కూర్చుంది. "బాత్రూంలో నీళ్ళు పెట్ట మంటావా?" అంటూ సమాధానం కొరకు ఎదురు చూడకుండా బకెట్ తీసుకుని బయటకువెళ్ళింది. వైజాగ్ అమ్మాయినరసు అప్పుడే గుడ్డలు కూడా మార్చుకుని సిద్ధంగా వుంది. రాజ్యం పావుగంటలో కాలకృత్యాలు తీర్చుకుని వచ్చింది. ముగ్గురూ మెస్‌వైపు కదిలారు. వీరు చేరే సరికి ఆరోజు చేసిన ఉప్మా చల్లారి పోయింది. అదే తిని కాఫీతాగి బయల్దేరారు. రోడ్డుమీద రిక్షా సిద్ధంగావుంది. "రిక్షామాట్లాడుకున్నావా రాజ్యం?''అంది రాధిక.

"ఇంకా మాట్లాడుకోలేదు"

"ఈరోజు ముగ్గురం ఒకే రిక్షాలో వెళ్దాంలే! సాయంత్రం అక్కడే మాట్లాడు కుందాం!" అంటూ రిక్షా ఎక్కి కూర్చుంది రాధిక. ఆమెపక్క రాజ్యం, కింద నరసు కూర్చున్నారు.

కాలేజీకివెళ్ళేసరికి ఫస్ట్‌బెల్ అయింది.





ఈనాడు

# భాషాస్వరూపం

మాతృభాషలో మాట్లాడేటప్పుడు పామరులు కూడా తప్పులు పలకరుగాని రాసేటప్పుడు పండితులు కూడా తప్పులు రాయవచ్చు. ఎందువల్ల ?

మాట్లాడేటప్పుడు భాషకు హావభావాలు, అంగవిన్యాసం లాంటివి తోడ్పడతాయి. రాసేటప్పుడు ఈ సాధనాలుండవు. కనక విస్పష్టంగా, నిర్దుష్టంగా రాయాలంటే భాషకు ఒక ప్రమాణం ఉండాలి. పత్రికా భాషకు అలాంటి ప్రమాణం ఏర్పరచిన పుస్తకం ''ఈనాడు భాషాస్వరూపం''.

పత్రికల్లోనూ ఇతర వ్యావహారిక రచనల్లోనూ సామాన్యంగా కనిపించే తప్పులు పరిశీలించి అవి దొర్లకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు వివరిస్తూ ప్రముఖ భాషా శాస్త్రవేత్త డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ రచించిన పుస్తకమిది.

ఇది పత్రికా రచయితలకేకాక, ప్రజలకు అర్థం అయ్యేలాగా రాయాలని, తమ భావాలు స్పష్టంగా ఎదుటివారికి అందజేయాలనీ ఆశించే వారందరికి ఉపయోగపడుతుంది.

వెల రు. ***25.00***

ఎం.ఓ. ద్వారాగాని, డి.డి.ద్వారాగాని ఈ మొత్తం పంపి ఈ పుస్తకాన్ని రిజిస్టరు పోస్టు ద్వారా పొందవచ్చు.

**ప్రతులకు:**

ఉషోదయా పబ్లికేషన్స్
ప్రయివేట్ లిమిటెడ్
ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా,
హైదరాబాద్ – 500 004.

అప్పుడే విద్యార్థులంతా వస్తున్నారు. కో ఎడ్యుకేషన్ కావడంవల్ల మగ - ఆడ సందడిగావుంది. ఇంతవరకూ అంతా ఆడ మేళంలో తిరిగివచ్చిన రాజ్యానికి ఈ వాతా వరణం కొత్తగా కనిపిస్తున్నది. రవంత ఉత్సాహంగానూవుంది. అందరూ పాతిక సంవత్సరాలు దాటినవాళ్ళేకనిపిస్తున్నారు. అంతకులోపు వున్నవారు ఏకొద్దిమందో వున్నారు. ఈ కొంచెం గట్టెక్కితే అందరూ ఉద్యోగ ప్రయత్నాలు మొదలు పెట్టాల్సిన దశ ఆరంభమవుతుంది. జీవన పోరాటంలో ఇప్పుడే చేరినవారూ కొంద వున్నారు, మరికొందరు చేరే దశలో వున్నారు.

"గుడ్‌మార్నింగ్ రాధికా!"

రాధిక వెనుతిరిగి చూసి చెయ్యి ఊపింది. "గుడ్‌మార్నింగ్ జయధీర్" అంది చెయ్యిపైకెత్తి.

జయధీర్ వీరి దగ్గరకి వచ్చాడు. పక్కనున్న రాజ్యాన్ని పరిచయం చేసింది రాధిక. ఒకరికొకరు నమస్క రించుకున్నారు చిరునవ్వుతో.

"ఎక్కడ చదివారు మీరు?"

"విజయవాడలో చదివానండీ!"

"నేను నెల్లూరులో చదివానులెండి మాది నెల్లూరే! అయితే ఏం, గోదావరి నీళ్ళు తాగాల్సిన ఖర్మ ఏర్పడింది: తాగు తున్నాను" గలగల నవ్వాడు.

"ఏమ్మా! గోదారి నీళ్ళంతమంచినీళ్లా మీ పినాకిని నీళ్ళు! చెయ్యి కడుక్కోవడా నికి కూడా ఎండాకాలంలో నీళ్ళు దొరికి చావవుగదా" అంది రాధిక నవ్వుతూ.

"సరేలెండి ఎవరి నది వారికి గొప్ప. ఆమాటకొస్తే రాజ్యంగారు గుండ్లకమ్మ నదిని పొగుడుతుంటుంది. మీ గోదావరి, మా పినాకినికంటే అదే చాలా నయం"

రాజ్యం తలవంచుకుని నవ్వుకుంది. "ఇక్కడికి వచ్చింది ట్రైనింగ్‌కా, నదుల గురించి పోట్లాటకా? ఏదయితే ఏం అన్నీ నీళ్ళే కదా''

"బాగా చెప్పారు.... రండి క్లాసుకు టైమవుతోంది"

జయధీర్ వెంట నడిచారు. క్లాసులో మరో యువతిని పరిచయం చేసిందిరాధిక. పేరు రహ్మత్‌బీ. హాస్టల్లో ఉండటంలేదు, ఆమెదా ఊరే!

"సాయంత్రం మా ఫొటో స్టూడి యోకి రండి'' అంది రహ్మత్‌బీ.

రాజ్యం తల ఊపింది. ఈ కొత్త పరి చయాలతో నిన్నటికంటే కొంత ఊపిరి తీసుకుంది. విజయవాడలో తానే అందరి కంటే పెద్ద. పైగా అక్కడ మగ స్నేహాలు దొరకవు. ఇక్కడ తనకంటే వయస్సులో పెద్దవాళ్లున్నారు. మగజాతి ఎక్కువగానే ఉంది. అందరితో పరిచ యాలు చేసుకుంటేనే ముందుకు సాగ వచ్చు. పరిచయాలు చేసుకోకనూతప్పదు.

పదకొండు గంటలకు బయటకు వచ్చారు. పది మెట్లు ఎక్కి దిగాలి. ఆయాసం వస్తున్నది. వెనుక కొంటె కుర్రాళ్లు అవహేళనగా మాట్లాడుతు న్నారు. 'కుంటి గుర్రం ఎగురుతోం దిరా' అంటూ. వారి మాటలు బాగా వినిపిస్తున్నా వెనుతిరిగి చూడలేదు. చూస్తే మరింత ఏడిపిస్తారన్న భయంతో! రాధిక పక్కనే ఉంది, వినే ఉంటుంది. కానీ ఏమీ అనలేదు. వెనకవాళ్ళ హేళనలు మరింత శృతిమించాయి. వారిని ఎదిరించే శక్తి తనకులేదు. మెట్లకింద నిలబడి రిక్షా కొరకు ఎదురుచూస్తున్నది రాధిక. రిక్షా వచ్చింది. రిక్షా డ్రైవర్‌ను పిలిచి "మరో రిక్షా నెలపద్ధతిన మాట్లాడు" అందిరాధిక.

అతడు మరో రిక్షా డ్రైవరును తీసుకు వచ్చాడు. రాధికే బేరం కుదిర్చింది. మరో కరు తోడు దొరికే వరకూ ఒక్కత్తెకే నెలకు యాభై రూపాయలు! మరోవ్యక్తి దొరికితే ఇద్దరికీ కలిపి ఎనభై రూపాయలు. డబ్బు సమస్యకాదు గనుక ఒప్పుకుంది రాజ్యం.

హాస్టల్‌కు వచ్చారు. భోజనం చేస్తూ అంది రాధిక. "ఇక్కడ అనేకరకాల వ్యక్తులుంటారు. నోటి తీట అణగడానికి ఏదో అనేస్తుంటారు. అవన్నీ నువ్వు పట్టించుకోకు. చేతనయితే సమాధానం చెప్పాలి, లేదా తలవంచుకుని రావడమే''

"ఇంత బహిరంగంగా అంటుంటే ఎలా నోరు మూసుకోవడం?"

"ఎదిరించలేనప్పుడు తప్పేదేముంది? కోఎడ్యుకేషన్ ఎప్పుడూ ఇలాగే ఏడుస్తుంటుంది. ఆడపిల్లలంటే మగపిల్లలకు లోకువ. తన్నినా వారికి సంతోషమే"

హాస్టల్లో పనిచేసే మనిషితోనే స్నానానికి నీళ్లు పెట్టే ఏర్పాటు చేయించింది రాధిక. నెలకు పాతిక రూపాయలు ఇచ్చే పద్ధతిన మాట్లాడారు. తిండికి వీలుంటే తెచ్చి తినిపోవడం, లేకుంటే రూంకే వస్తుంది మెస్సునుండి. ఆవిధంగా తన నిత్యసమస్యలుకొన్ని పరిష్కరించుకుంది. రాధికకూ, లలితకూ ఎంతో తేడా. లలిత ఎంతో ఆప్యాయంగా సేవ చేస్తుంది. రాధిక తత్వం అలాంటిదికాదు. తాను చేసిందానికి ప్రతిఫలం కావాలనే తత్వం.

సాయంత్రం క్లాసు లేకపోవడంతో రహ్మత్ ఫొటోస్టూడియోకు వెళ్ళడానికి ప్రయాణమయ్యారు. రోడ్డుమీదకు వచ్చి రిక్షాఎక్కారు. కోటగుమ్మం ఏరియాలో ఉంది ఆ స్టూడియో. కిందనుండిమెట్లెక్కి పైకి వెళ్ళేసరికి కాళ్లు నొప్పులు మొదలయ్యాయి రాజ్యానికి. వీరిని చూసి రహ్మత్ సాదరంగా ఆహ్వానించింది.

"చెప్పడం మరిచాను... మీ వినుకొండలో మా బాబాయి రైల్వేలో ఉద్యోగం చేస్తున్నాడు. మీకు తెలుసా?" అంది రహ్మత్ రాజ్యంవేపు చూసి.

"నాకు వినుకొండలో ఎవరూ పరిచయంలేరు. ఈసారి వెళ్ళినప్పుడు కలుస్తాను. ఏం ఉద్యోగం చేస్తున్నాడు?"

"రైల్వేలో అసిస్టెంట్ స్టేషను మాష్టరుగా పనిచేస్తున్నాడు. పేరు ఖాదర్" అక్కడికివచ్చిన వ్యక్తిని చూపిస్తూ, "మా అన్న. మంచి ఫొటోగ్రాఫర్" అంది. రాజ్యం పరిచయ పూర్వకంగా చిరునవ్వు నవ్వింది.

సాయంత్రంఆరుగంటలదాకా అక్కడే కాలం గడిపారు. ఆరుగంటలకు కిందికిదిగి రిక్షాలో బయలుదేరారు. దారిలో రెడీమేడ్ షాపువద్ద రిక్షానిలిపి "బ్రా తీసుకోవాలి" అంది. రాజ్యం,రాధికషాపులోనికి వెళ్ళారు. బ్రాలకోసం అరగంటసేపు వెతికారు. అక్కడున్నవన్నీ తిప్పి తిప్పి చూసినా రాధికకు నచ్చలేదు. షాపువాడికి వీరి వాలకం చూసి విసుగు పుట్టింది. ''ఇంతకూ మీరు తీసుకోవాలని వచ్చారా? లేక కాలం గడపడానికి వచ్చారా?" అన్నాడు.

''అదేంటండీ! మాకు నచ్చితే తీసుకుంటాం గానీ, ఇష్టంలేనివి తీసుకోవాలా ఏం?'' అంది రాధిక గట్టిగా.

''తీసుకోవాలంటే కావలసినవన్నీ ఉన్నాయ్! సాయంత్రం పూట చదువుకునే పిల్లలకు ఏం పనీ ఉండదు; ఇలా వికారు చేయడానికి వస్తుంటారు" అన్నాడు మడతలు పెట్టుకుంటూ.

"పనికిరానివన్నీ కొట్లో పెట్టుకుని

మమ్మల్నంటావేం?" అంది రాజ్యం నిరసనగా.

అతడు రాజ్యం కళ్ళలోకి అప హేళనగా చూశాడు. "పనికిరానివి మా వస్తువులుకావు. ముందు నువ్వు పనికి వచ్చేలాచూసుకో!" అన్నాడు. రాజ్యానికి తీవ్రంగా కోపం వచ్చింది. కాని ఏమీ మాట్లాడలేకపోయింది. తన అవిటితనాన్ని అతడు ఎత్తి చూపుతున్నాడు! కళ్ళ నుండిరాలినకన్నీళ్ళు టేబుల్‌మీదపడ్డాయి. రాధిక గట్టిగా అరచింది "నీకు సిగ్గు లేదూ! వచ్చిన కస్టమర్స్‌ను దుర్భాష లాడటానికి" అంది చెప్పు చేతికి తీసుకుని ఈ అరుపులకు జనం ఒక్కొక్కరే గుమిగూడటంతో షాపువాడు భయ పడ్డాడు.

"వీడు పనికిరానివస్తువుల్ని మమ్మల్ని కొనమంటున్నాడు. కొనకుంటే కుంటి దానివి నువ్వేం కొంటావు పొమ్మని వెక్కిరిస్తున్నాడు." అంది చుట్టూ ఉన్న జనంతో.

జనంలోనుండి ఒక వ్యక్తి చుట్టపీకుతూ ముందుకు వచ్చాడు. "ఏందయ్యోవ్ నువ్వు? ముష్టి ముప్పైవేల ఖరీదు చేయరు నీకొట్టూ నువ్వూకూడా! ఆడపిల్లల్ని తిడ తావా?" అన్నాడు గట్టిగా. కొట్టువాడు మాట్లాడలేకపోయాడు. అటుగా వెళ్తున్న జయధీర్ ఈగుంపునుచూసివచ్చాడు. సంగ తేమిటనిఅడిగాడు. రాధిక వివరంగా లేనివి కూడా కల్పించి చెప్పేసింది. అసలే విద్యార్థులంటే వ్యాపారస్థులకు భయం! ఇటువంటి అవకాశాలు దొరికితే కొట్టును తగలేస్తారని భయం కొట్టువాడు చేతులెత్తి దండం పెట్టాడు. "బాబూ! పొరపాటయింది, నోరుజారాను, ఇంకెన్నడూ ఎవరినీ ఏమీ అనను" అన్నాడు. కొట్టువాడి కాలర్‌ను పట్టుకొని జయధీర్ దవడమీదకొట్టాడు. అతని వెంట ఉన్న మరో నలుగురు కాలర్ ఎగరేసు కుంటూ ముందుకువచ్చి టేబుల్‌మీది వస్తువులు చేతికి తీసుకున్నారు. ఇదేదో పెద్ద పోట్లాటలా తయారవుతుందని ఒక్కొక్కరే జారుకున్నారు. రాధిక, రాజ్యం బయటకు వచ్చారు. రిక్షాఎక్కి హాస్టల్ చేరారు.

రాజ్యాన్నిచూస్తే ఎవరైనా హేళన చేస్తారు. అటువంటి అవిటి మనిషిని వెంట బెట్టుకునివెళ్తే తనకూ అవమానంతప్పదు; ఆ అవమానం తప్పించుకోడానికి పోట్లాడాలి. అసలు రాజ్యంతో స్నేహమే లేకుంటే మంచిది అనుకుంది రాధిక. ఆ సంఘటనతో దిమ్మెక్కిన రాజ్యం ఆరాత్రి ఎవరితోనూ సరిగా మాట్లాడలేకపోయింది-తన అవిటితనం తనను అభాసుపాలు చేస్తున్నది! అటు బజారులోనూ, ఇటు కాలేజీలోనూ అనుకుంది బాధగా.



4

ఉదయం పెందలకడనేలేచి స్నానం చేసింది రాజ్యం! అంతకుముందే రాధిక, సరసులేచి, టిఫిన్‌చేయడానికి వెళ్తున్నారు. రాజ్యాన్ని వాళ్ళు పలుకరించలేదు. వారి ముఖభావం చూసి రాజ్యం కూడా పలుక రించలేదు. స్నానం చేసి ఫలహారం చేసి

వచ్చేటప్పటికే వాళ్ళు కాలేజీకి వెళ్ళిపోయారు. చివరగా రాజ్యం రిక్షాలో వెళ్ళింది.

క్లాసు అప్పుడే ప్రారంభమవుతున్నది. మెట్లు ఎక్కి ఆయాసపడుతూ గోడను ఆనుకుని నిలబడింది! జయధీర్ వస్తూ గుడ్‌మార్నింగ్ చెప్పాడు. చిరునవ్వుతో తల ఊపింది రాజ్యం!

"ఆలస్యంగా వచ్చారేమిటి?" అన్నాడు ఎదురుగా నిలబడి.

"అవును,కొంచెం ఆలస్యం అయింది"

"పదండి క్లాసులోనికి" ఇద్దరూ క్లాసులో అడుగుపెట్టారు. అందరి కళ్ళూ వారివైపు తిరిగాయి. రహ్మత్ చిరునవ్వుతో చేయిఊపింది. రాజ్యం, రహ్మత్ పక్కకు వచ్చి కూర్చుంది.

"ఆరోగ్యం బాగాలేదా?" అంది రహ్మత్ పరీక్షగాచూస్తూ.

"బాగానే ఉంది. ఏం?"

"ఏం లేదు. డస్సిపోయినట్లున్నావు"

రాజ్యం నోట్సు తీసుకుని లెక్చరర్ చెబుతున్న పాఠాన్ని శ్రద్ధగా వింటూ కూర్చుంది. పక్క బెంచీలో ఉన్న రాధిక ఒకసారి ముఖం చిట్లించి చూసి తల పక్కకు తిప్పుకుంది.

మధ్యాహ్నం ఒంటరిగా కూర్చుని ఉన్న రాజ్యం దగ్గరకు వచ్చాడు జయధీర్. "నిన్నటి సంఘటనతో మీరు బెదిరిపోయినట్లున్నారు" అన్నాడు మాట కలుపుతూ.

రాజ్యం అతని ముఖంలోనికి పరిశీలనగా చూసింది. తల ఊపుతూ "అటువంటిదేమీలేదు" అంది.

"మీరేం భయపడకండి; మీకేం సహాయం కావలసినా నేనున్నాను"

"నిన్న మీరు సమయానికాబట్టిగానీ లేకుంటే మేం అభాసుపాలుకావలసివచ్చేది; నిన్నటి సహాయానికి కృతజ్ఞతలు చెప్పాలి" అంది రాజ్యం మెల్లిగా ఎదురుగానున్న గడ్డిపరకను త్రుంచివేస్తూ.

"అదేం గొప్ప సమస్య కాదులెండి! అయినా ఈ సమాజంలో బలహీనుల్ని పీడించడం, అవహేళన చేయడం ఒక ఫాషనయింది. ఈదేశంలో ఎందరిబిడ్డలకు, అక్కచెల్లెళ్ళకు అవిటితనం లేదు? వాళ్ళు మరొకర్ని అవహేళన చేయడమెందుకు? ఈ స్కూలులోనే నాగన్న అనేవాడు ఒకడు ఉన్నాడు. వాడి అక్క అవిటిది; ఇంతవరకూ పెళ్ళికాలేదు. నలభై సంవత్సరాల వయస్సుంది. వాడు మిమ్మల్ని చూసి నిన్న ఈలవేస్తుంటే చూసేవాళ్ళకు సిగ్గువేసింది. మొదటి పరిచయంతోనే మీరంటే నాకెంతో అభిమానం ఏర్పడింది. మీకు ఎటువంటిసహాయం కావలసినా నేను చేస్తాను"

అతని మాటలు వింటూ కూర్చుంది. బెల్ కావడంతో ఒక్కొక్కరే లోపలకు పోగారు. "మనస్సును బాధ పెట్టకండి, సాయంత్రం అలా పార్కుకు వెళ్దాం" అంటూ లేచాడు జయధీర్. రాజ్యంకూడా లేస్తూ తనను గురించి ఇతగాడు ఏమని భావిస్తున్నాడు? సహకారం పేరుతో వంచిద్దామనా? నిజంగా మంచిగా సాయపడ దలచుకున్నాడా? అనుకుంది.

ఇంటర్వెల్‌లో రహ్మత్ కలిసి "నిన్న గొడవ జరిగిందట కదా?" అంది.

"ఎవరు చెప్పారు?"

"రాధిక చెప్పింది. నీవల్ల అది అల్లరిపాలయినట్టు మొత్తుకుంటున్నది"

రాజ్యం తల ఊపి, జరిగింది చెప్పింది.

"రాధిక అహంభావి! తానేదో పెద్ద అందగత్తెనని దాని అహం! దాన్ని చూసే

వాళ్ళు ఏమనుకుంటారో తెలియదు. సరే రాజ్యమక్కా! మావద్దకు వస్తూ ఉండు, నీవంటే నాకు అభిమానం" అంది రహ్మత్ వెళ్తూ.

ఇలా కొందరయినా తనను అభిమాని స్తున్నందుకు సంతోషంగా ఉంది. జయధీర్ ఒడ్డూ పొడుగూ మనిషి, కలివిడిగా మాట్లాడతాడు, స్నేహశీలిగా కనిపిస్తాడు. అతడిలో ఏదో ఆకర్షణ ఉంది. అది తనను అతని వైపులాగుతున్నదనుకుంది. ఒక్కొ వ్యక్తిని చూస్తూనే ప్రేమ జనిస్తుందంటారు. అది ఇదేనా? ఏమో! సాయంత్రం పార్క్ కు వెళ్దామన్నాడు. అనుకుంటూండగానే జయధీర్ ఆమె దగ్గరకి వచ్చి పలకరింపుగా నవ్వాడు "రండి, దగ్గరే పార్క్, హోటల్లో కాఫీ తాగి వెళ్దాం"

అతడి వెంట మంత్రముగ్ధలా కదిలింది. చూసేవాళ్ళు వారిద్దరినీ గురించి రకరకాలుగా వ్యాఖ్యానిస్తున్నారు. ఇద్దరూ కాఫీ తాగి ఫర్లాంగు దూరంలోని పార్కులో చేరారు. గోదావరి ఒడ్డునే ఉందది! అక్కడి నుండి చూస్తే గోదావరి బాగా కనిపిస్తున్నది. ఇద్దరూ ఒకచోట కూర్చున్నారు. రాజ్యం గడ్డిపరకలను ఒత్తుతున్నది. జయధీర్ ఆమె ముఖంలోకి చూస్తున్నాడు.

"మీరు చాలా అందంగా ఉంటారు" అన్నాడు జయధీర్. రాజ్యం పలుకలేదు. "అందంలో అనేకరకాలు! అలంకరించుకునే అందం, దుస్తులవల్ల అందం, స్వతహగా ఏర్పడేఅందం, మాట్లాడితే అందం, హావభావాలవల్ల, కదలికవల్ల అందం, మీ అందం నేచురల్ బ్యూటీ! ఇటువంటి అందాన్ని నేను ఎక్కడా చూడలేదు"

రాజ్యం విషాదంగా నవ్వింది "కానీ, ఈ అందాన్ని పాడుచేసే అవిటితనం కూడా నాకు ఉందని మరచిపోవద్దు"

"మీరు పొరపాటు పడుతున్నారు. అవిటితనం, మనిషిని సంస్కారహీనుణ్ని చేయదు. అవిటితనం కావాలని తెచ్చుకున్నదికాదుకదా!"

"ఎవరి ఖర్మకు ఎవరు బాధ్యులు?"

"వికలాంగులుకాకుండా తప్పించే అవకాశాలుఎన్నోవున్నా వాటినిఅందరికీఅందుబాటులోనికి తేవడంలేదు ఈ సమాజం! ఉదాహరణకు పోలియో వ్యాధిరాకుండా మూడు సంవత్సరాలలోపు పిల్లలకు ఇంజక్షన్లు ఉన్నాయి. ఎంత మందికి అవి అందుబాటులో ఉన్నాయి? అందుబాటులో లేక పోవడానికి కారణం సమాజం కాదా! సమాజమంటే నాదృష్టిలో వ్యక్తులబృందం లేదా ప్రభుత్వం అనుకోవచ్చు! తప్పకుండా బాధ్యత వారిదే అవుతుంది"

ఆ వాదన రాజ్యానికి నచ్చింది. అనేక అవకాశాలున్నా, అవి అందరికీ అందుబాటులో లేకపోవడమే ఎక్కువశాతం వికలాంగులు కావడానికి కారణం! కాలు విరిగితే అతికించి మామూలుగా నడిచే అవకాశం కల్పించవచ్చు. కానీ, అందరూ దానికి తగిన ఫీజు భరించలేరు గనుక కుంటికాలవుతున్నది. ఇటువంటివి అందరికీ అందుబాటులో రావాలంటే సమాజం మారాలి. ఇదంత సులభంకాదు. మాటల గారడీ మాత్రమే!

"మీ కిష్టమయితే మిమ్మల్ని నేను పెళ్ళి చేసుకుంటాను"

గోదావరి వైపుచూస్తున్న రాజ్యం ఉలిక్కిపడి, అతని వైపు చూసి తల పక్కకు తిప్పుకుంది. అంతతొందరగా అతని నోటినుండి ఆ మాట వస్తుందని



ఆమె ఆశించలేదు. అటువంటి మాటలకు సిగ్గుపడే వయస్సు కాదామెది. సక్రమంగా పెళ్ళి అయివుంటే ముగ్గురు, నలుగురు బిడ్డల తల్లి కావలసినవ్యక్తి. అవిటి తనమనే లోపం వల్ల ఎవరూ ముందుకు రాక ఆమె పెళ్ళి నిలిచిపోయింది. ఈ వ్యక్తి రెండు రోజుల పరిచయంతోనే తనను పెళ్ళి చేసుకుంటానంటున్నాడు. నమ్మవచ్చా?ఏమో? కొందరికి జాలికలుగవచ్చు. ఆ జాలితో చేసుకోడానికి సిద్ధపడవచ్చు. ఆ తర్వాత ఎన్నాళ్ళు కాపురం నిలబడుతుంది? జీవితాంతం అవిటివ్యక్తిని భరించడం సాధ్యమా?

"మీరు ఎలాంటి అనుమానం పెట్టుకోనవసరం లేదు. నా గుండెల్లో దాచుకుంటాను.జీవితాంతంతోడుగా ఉంటాను" అన్నాడు తిరిగి.

రాజ్యం తల ఎత్తి అతడి వైపు నింపాదిగా చూచింది.

"మీమాటలు విశ్వసిస్తున్నాను. కానీ, అవిటివ్యక్తిని పెళ్ళిచేసుకుని అనుభవించే సుఖమేమిటి? రేపు మీరు టీచర్గా ఉద్యోగం సంపాదించుకుంటే లక్షన్నర కట్నం ఇచ్చి కాళ్ళ దగ్గర పిల్లను పడేసేవాళ్ళున్నారుకదా"

"కావచ్చు! ఆ డబ్బుకంటే ఒక అవిటి వ్యక్తి జీవితాన్ని బాగుచేయడం నాకు ముఖ్యం! మిమ్మల్ని చూసిన తరువాత ఆ నిర్ణయానికి వచ్చాను. మీరు అంగీకరిస్తే, మీకిష్టంవచ్చినప్పుడు పెండ్లి చేసుకోవచ్చు"

రాజ్యం తల వూపింది. జయధీర్ అందగాడే! అతనిలో ఆకర్షణవుంది. ఇద్దరూ ఉద్యోగాలు సంపాదించుకుంటే సుఖంగా బతకవచ్చు. అయినా అతడి తల్లిదండ్రులు అంగీకరించాలిగదా! ఆ మాటే అడిగింది.

"ఆ బాధ్యతనాది! వారిని తప్పకుండా ఒప్పిస్తాను" అన్నాడు ఆమె చేతిని చేతిలోకి తీసుకుంటూ. వెచ్చటి స్పర్శ ఆమె మెదడుకు తగిలింది. చెయ్యి వెనుకకు లాక్కుందామనుకుందిగాని, సభ్యత కాదేమోనని అలాగే వుంచింది. అతడు తొందరపడుతున్నాడు. అది ప్రేమా? తానూ తొందరపడుతున్నాననుకుంది! అది ప్రేమా? ఏమో! ఈ సమయంలో లలితవుంటే ఇది యవ్వన ఆకర్షణ అని తేల్చిచెప్పేదే! అది దగ్గరలేదు. అయినా అనుభవించే వయస్సు దాటిపోతున్నది. అందే అవకాశంవున్నప్పుడు తోసివేస్తే తర్వాత పశ్చాత్తాపపడవలసి వస్తుందేమో? జయధీర్ నమ్మతగ్గ వ్యక్తే అని ఆమె మనస్సు చెబుతున్నది.

చెయ్యిపక్కకు లాగకపోవడంతోనే ఆమె తనంటే ఇష్టపడుతున్నదని అర్థం చేసుకున్నాడు. అటువంటి అందగత్తె ఇంత సులభంగా తనకు దగ్గరకావడం అతనికి ఆనందంగావుంది. దగ్గరగా జరిగాడు; అతని ఊపిరి ఆమెకూ, ఆమె ఊపిరి అతనికీ తగులుతున్నది.

"జయధీర్! తర్వాత మాట్లాడుకుందాం నేను పూర్తిగా ఆలోచించాలికదా" అంది లేవబోతూ! కానీ లేవలేకపోయింది. అసలే అవిటి! కాలు తిమ్మిరెక్కడంతో అక్కడే చతికిలబడింది.

"నన్ను నమ్ము రాజ్యం! నేను నీకు ద్రోహంచేయను; నా జీవితం నీ కొరకే అర్పిస్తాను. మనిద్దరం సంసారమనే నావను సుఖంగా లాక్కుపోగలమని నాకు ప్రగాఢ విశ్వాసంగావుంది" అన్నాడు ఆమె చెయ్యి నొక్కుతూ. యవ్వనంలో వున్న ఆమె శరీరం అతడి స్పర్శకు పుల




కితమవుతున్నది. ఆమె మనస్సు చెప్పేది వినే స్థితిలో శరీరంలేదని ఆమెకూ, అతడికీ తెలుసు.

* * *

ఆ రాత్రి కమ్మని కలలతో నిద్రపట్ట లేదు. తాను అదృష్టవంతురాలా? దుర దృష్టవంతురాలా? ఆలోచించలేకపోతు న్నది. ఇంత తొందరగా ఒక వ్యక్తికి తాను ఎలా లొంగిపోగలిగింది. యవ్వనం రేపే కోరికలు అటువంటివా? రేపు అతడు పెళ్ళికి అంగీకరించకుంటే తనగతిఏమిటి? ఈ ఆలోచనలతో సతమతమవుతూనే ఉదయం కాలేజీకి వెళ్ళింది. జయధీర్ కన్పించి కళ్ళతోనే దూరంనుండి పలుక రించాడు. మధ్యాహ్నం కాలేజీకి శలవు కావడంతో జయధీర్ ను కలిసింది. ''ఆరోగ్యంబాగుందారాజ్యం!'' అన్నాడు నవ్వుతూ. రాజ్యం సిగ్గుతో తలవంచు కుంది. ''సాయంత్రం పార్కులో కలు స్తారా?'' అంది నెమ్మదిగా. అతడు తల ఊపాడు. "రేపు నా పుట్టినరోజు. ఆ ఏర్పాట్లలో వున్నాను. రేపు నా రూం దగ్గర కలుద్దాం!'' అన్నాడు. ఆమె తల వూపింది. రహ్మత్ అటు రావడంతో జయధీర్ వెళ్ళిపోయాడు.

"మా స్టూడియోదగ్గరకువెళ్దాం రాజ్య మక్కా!" అంది రహ్మత్. హాస్టల్ కు వెళ్ళినా బోరుకొడుతుంది. అందువల్ల రహ్మత్ ఇంటికివెళ్ళింది. స్టూడియో పైనేవారి సంసారం. ఇంటిలోపలకు తీసుకెళ్ళింది. ఈ అవిటి వ్యక్తిని చూసి వాళ్ళు విస్తుపోయిచూశారు 'ఎవరీమె?' అన్న ప్రశ్నార్థకంతో! రహ్మత్ వివరాలు చెప్పింది. కుర్చీలాగి కూర్చోబెట్టి లోపలకు వెళ్ళింది.

"పెళ్ళయిందా అమ్మా?'' అంది రహ్మత్ తల్లి పరిశీలనగాచూస్తూ.

"లేదండీ!" అంది తలవంచుకుని.

"ఎలా అవుతుందమ్మా? మంచి వాళ్ళకే కావడంలేదు; లక్షలు కట్నం కావాలి. ఇక అవిటి వ్యక్తులకు ఏమవు తుంది తల్లిదండ్రులకు గుండెబరువుగాని" అంది విచారంగా. ఆమె ఆప్యాయతకు పులకించింది రాజ్యం! ముస్లింలతో ఆమెకు పరిచయాలు తక్కువ! వారి ఇండ్లలోకి అసలు ఎన్నడూ వెళ్ళలేదు.

రహ్మత్ రెండు టీగ్లాసులు తెచ్చి తల్లికీ, రాజ్యానికి ఇచ్చింది. "నిన్ను గురించి నిన్ననే చెప్పింది రహ్మత్! ఇప్పుడు చూస్తుంటే నాకెంతో బాధ వేస్తున్నది. నాకూ ఒక కూతురుండేది; పోలియో వ్యాధితో కాలు చచ్చుపడి పోయింది. బాగా వున్నవారికే మాలో అంతంతమాత్రం పెళ్ళిళ్ళవుతాయి. ఇక ఆ కుంటిపిల్లను ఎవడు చేసుకుంటాడు. దిగులుతో కృశించి, ముప్పై సంవత్సరాల ప్పుడు ఉరివేసుకుని చచ్చింది. నిన్ను చూస్తుంటే ఆ కూతురు కన్పిస్తున్నది" అంది రెండుచేతులతో ముఖం కప్పుకుని ఏడుస్తూ. రహ్మత్ పక్కకు తిరిగి కళ్లు తుడుచుకుంది. వారిబాధ చూసి కళ్ళనుండి నీరుకారింది రాజ్యానికి! తన తల్లిలాగే ఆమెకూడా ఏడుస్తున్నది. తాను రజస్వల అయినప్పుడు 'ఈ కుంటిదాన్ని ఎవడు పెళ్ళి చేసుకుంటాడు? దీని జీవితంఏమిటి' అని తల్లి ఏడ్చింది. ఈ అవిటివాళ్ళు అందరికీ బరువే అవుతున్నారా?

"మా బాధలతో నిన్ను బాధపెట్టినట్లు న్నానమ్మా!'' అంది కళ్లు తుడుచు కుంటూ ఆమె. రాజ్యం తలవిదిలించింది. "అదేం లేదమ్మా!'' చనిపోయిన మా అమ్మను చూస్తున్నట్లుంది మిమ్మల్ని

చూస్తుంది! మా బతుకులు అందరికీ భారం! కొందరికి హేళన'' అంది.

"కన్న వాళ్ళకు బాధేమిటమ్మా, బాధ్యతగానీ ! మేమేదో అసహ్యించుకున్నామని బాధపడి వీరు ఆత్మహత్యలు చేసుకుంటే మా పేగు బంధం మమ్మల్ని బతకనిస్తుందా, రోజూ తలచుకుని చావడంగానీ''

రహ్మత్ తనతో ఎంతో ఆప్యాయంగా ఉండటానికి కారణం ఇదే ననుకుంది రాజ్యం! స్వయానా వారికి ఒక అవిటి వ్యక్తి రక్తబంధువు కావడం అసలు కారణం.

"అప్పుడప్పుడు వస్తుండమ్మా! నీలో నన్నా నా కూతుర్ని చూసుకుంటుంటాను"

"తప్పకుండా వస్తానమ్మా!'' అంది లేస్తూ. ఇద్దరూ స్టూడియో లో అడుగు పెట్టారు. ఇద్దరి గుండెలూ బరువుగా వున్నాయి. ఖాదర్ ఫిల్మ్ ఆరబెట్టుకుంటూ వీరిని చూసి పలుకరింపుగా నవ్వాడు.

రాత్రి అన్నం తింటేగానీ రహ్మత్ వదలి పెట్టలేదు. ఎనిమిది గంటలకు హాస్టల్ చేరింది. ఆమె కొరకే ఎదురు చూస్తున్న వంటమనిషికి తాను తినివచ్చానని చెప్పింది. ఆమెకు ఇచ్చే భోజనం తన ఇంటికి తీసుకెళ్ళింది వంటమనిషి.

ఉదయంలేచి తలార స్నానంచేసి చుక్కల తెల్లచీర కట్టింది. నలుపురంగు జాకెట్ వేసుకుని, తలనిండా మల్లెపూలు పెట్టుకుంది. పది గంటల సమయంలో జయధీర్ ఇచ్చిన అడ్రసుకు రిక్షాలో వెళ్ళింది. అప్పటికి చాలామంది కుర్రకారు వచ్చి ఉన్నారు. ఇద్దరు మాత్రమే ఆడ వ్యక్తులు ఉన్నారు. [illegible] వైపు తలలు తిప్పి చూశారు. కొందరు కళ్ళతోనే పలుకరించారు. జయధీర్ ముందుకువచ్చి "సమయానికే వచ్చావు రాజ్యం!'' అన్నాడు చిన్నగా నవ్వి.

రాజ్యం జవాబుగానవ్వి లేడీస్ దగ్గరకు వెళ్ళి కూర్చుంది. ఇద్దరిలో ఒకరు హాస్టల్ లో ఉన్న అమ్మాయి. మరొకరు బయటి అమ్మాయి. వారికి తనను పరిచయం చేసుకుంది. దూరంగా కుర్రాళ్ళు ఆడపిల్లలపైన చెణుకులు విసురుతున్నారు.

"జయధీర్ గాడికి గర్ల్ ఫ్రెండ్స్ ఎంత మందున్నారురా?'' అన్నాడు ఒకడు

"వాడికేంరా జల్సా పురుషుడు! మాటలతో బోల్తా కొట్టించి మంత్రగాడులా వశపరచుకుంటాడు" అన్నాడు మరొకడు.

''ఈ కుంటిపిల్ల ఎన్నోది?" మరొకడి ప్రశ్న.

"వాడికే తెలియాలి సంఖ్య! మనకు చెప్పి చస్తాడా?'' జవాబు! వాళ్లు గుసగుసగా మాట్లాడినట్లున్నా ఆడవాళ్ళకు స్పష్టంగా వినిపిస్తున్నాయి. రాజ్యం గుండె క్షణక్షణానికి వేగం అందుకుంటున్నది. పదిమంది కుర్రాళ్ళు చేరిన చోట అల్లరి సహజమే! ఆమె ఆలోచించేది అది కాదు. జయధీర్‌ను గురించి వాళ్ళు మాట్లాడుతున్న తీరు. నిజంగా జయధీర్ చాలా మందితో తిరిగే వాడేనా? ఆమె సందేహం! మరో గంటలో పదిమందిదాకా ఆడపిల్లలు, యాభైమందిదాకా మగపిల్లలూ తోడయ్యారు. జయధీర్‌కి పుట్టిన రోజు శుభాకాంక్షలు, బహుమతులు అందజేశారు. రాజ్యం అన్యమనస్కంగా ఆకొంచెంసేపు కాలం గడిపింది. మరి రెండుసార్లు కూడా వెనుక అవే గుసగుసలు వినిపిస్తున్నాయి. లేచి బయటకు వచ్చింది. బయట రిక్షాలు లేవు. మెయిన్

రోడ్డు మీదకు వెళ్తేగాని దొరకవు. అంత దూరం తాను నడువలేదు. ఎవరికైనా చెప్పి పంపిద్దామనుకుంటే ఏమనుకుంటారో నని అనుమానం! ఆమె ముందే ఇద్దరు స్త్రాళ్లు బయటకు కదిలారు. "రోడ్డు మీద రిక్షా ఉంటే పంపించండి" అంది గట్టిగానే. వాళ్లు తలఊపి వెళ్ళిపోయారు.

వచ్చిన రిక్షాలో కూర్చుని హాస్టల్‌కు చేరింది. తల తిరుగుతుంటే పడుకుంది,

మరి రెండు రోజులవరకూ జయధీర్ కన్పించలేదు. ఎవరిని అడగటానికీ మన సొప్పలేదు. కాని, ఆమె అనుమానం మోసం చేస్తాడేమోనని! తాను తొందర పడ్డానేమోనని అనుకుంటున్నది ఇప్పుడు!

రెండు రోజుల తర్వాత రహ్మత్ ఇంటికి వెళ్ళింది రాజ్యం! సాదరంగా ఆహ్వానించారు వాళ్లు! ఒక విధంగా వారి వద్ద ఊరట కలుగుతున్నది. ఆత్మీయుల దగ్గర కాలం గడిపినట్లుంటున్నది.

రహ్మత్ సినిమాకు వెళ్లడానికి తయారవుతున్నది. రాజ్యంను చూసి "రా అక్కా! సినిమాకు బయలుదేరు తున్నాను నువ్వూరా!" అంది.

"నాకు సినిమాలంటే పెద్ద ఇంట్రెస్ట్ లేదులే! వెళ్లిరా!" అంది రాజ్యం.

"ఇంట్రెస్ట్ అంటే ఎంతవరకు? ఏదో మూడు గంటలు కాలం గడుస్తుంది. బయట ఊపిరి పీల్చవచ్చని వెళ్ళడం! పద" అంది చెయ్యి పట్టుకుని.

థియేటర్ ముందు ఊపిరాడనంత జనం ఉన్నారు. అసలే కొత్త సినిమా! ముందే టిక్కెట్లు కొన్ని బుక్ అయి ఉంటాయి. మిగిలినవి కౌంటర్‌లో అమ్మేశారు;రహ్మత్ డబ్బు తీస్తుండగా వారించి రాజ్యం రెండు టిక్కెట్లు తీసుకుంది బ్లాకులో. ఇద్దరూ లోపలకు వెళ్లారు. తన అక్క గురించి, ఆమెఏవిధంగా మోసపోయిందో వివరంగా చెప్తున్నది రహ్మత్. ఊకొడుతూ తెర వేపు చూస్తున్నది రాజ్యం.

ఇంటర్వెల్‌లో రహ్మత్ బయటకు వెళ్ళి కూల్‌డ్రింక్స్ తెచ్చింది. అన్ని సినిమాల్లాగే ఒకేమూసతో తీసిన కథ! సినిమా పూర్తయ్యేసరికి విసుగు పుట్టింది. రహ్మత్ భుజంమీద చెయ్యివేసి బయటకు కదిలింది రాజ్యం. బయట రిక్షా బేర మాడుతూ రహ్మత్ ఉంటే, రాజ్యం గోడ నానుకుని నిలబడింది. ముందు నుంచి రాధిక, జయధీర్ చేతులు కలుపుకొని బయటకు పోవడం చూసింది రాజ్యం. ఆమె గుండె గుబగుబలాడింది. రాధికతో చేతులుకలిపాడు ఎందుకు?-అన్న ప్రశ్న ఆమెను శూలంలా పొడుస్తున్నది. రహ్మత్ ఆమె దగ్గరకివచ్చి, రాజ్యం చూస్తున్న వేపే చూసి "వాళ్ళను చూస్తున్నావా?" అంది నవ్వి. రాజ్యం తల ఊపింది.

"ఏముంది మామూలే! వాడు జగజ్ కిలాడి. రోజుకొకరిని మోసపుచ్చుతాడు; ఇది జగత్‌కంత్రీ! ఎందరితోనయినా తిరుగుతూనే ఉంటుంది"

రాజ్యం తల తిరుగుతున్నట్లయింది. "తల నొప్పిగా ఉంది" అంది నిలబడ లేక. రహ్మత్ కంగారుగా చెయ్యిపట్టుకుని రిక్షాలో కూర్చుండపెట్టింది. హాస్టల్‌కు తెచ్చి ఆమె గదిలో చేర్చింది. నిస్సత్తువతో చాపమీద పడిపోయింది రాజ్యం.

"ఎలా ఉంది అక్కా?" అంది రహ్మత్ తల వత్తుతూ.

"బాగానే ఉంది. తగ్గిపోయిందిలే" అంది. రహ్మత్ ముందు డీలాపడితే పసి కట్టేస్తుందేమోనని భయం. రహ్మత్ వెళ్ళిపోయింది. తల శూలాలతో పొడుస్తు న్నట్లయింది. తాను రెండవసారి మోస

పోయింది. ఆ మోసంకూ[illegible]రంగా మోసపోయింది. ఎందుకిలా ప్రతిసారీ మోసపోవలసివస్తున్నది? వయసు పైబడుతున్నది. స్త్రీకి పాతిక సంవత్సరాలుదాటితే సగం ముసలివయస్సు వచ్చినట్లే లెక్క. తనకుపాతికసంవత్సరాలు దాటిపోయాయి. ఎలాగూ పెళ్ళికాదనే నిర్ణయానికివచ్చేసింది. తన తల్లిదండ్రులు ఆ ప్రయత్నం చేసి లాభంలేదని మానుకున్నారు. తాను స్వంత ప్రయత్నం చేసింది. తనకూ భర్త, పిల్లలు కావాలి. అందుకొరకే ప్రయత్నించింది. కాని, ఫలితం మరోవిధంగా వెక్కిరించింది. జయధీర్‌ను తాను రెండురోజుల్లో ఎలా నమ్మగలిగింది? ఏమో? ఒక్క గంటలోనే నమ్మి సుమతి ఎందరికో మనసు ఇచ్చానని చెబుతుంటే తాను రెండు రోజులవరకూ ఆగడం గొప్ప విషయమే! అతడి వాక్చాతుర్యం, నటన నమ్మి తాను మైమరచింది. ఫలితం మరోసారి అవమానం! వీళ్ళందరూ తన అవిటితనం చూసి హేళన చేస్తున్నారు. వాడుకో జూస్తున్నారు.

ఆ రాత్రి కూడా అన్నం తినలేదు. కళ్ళనుండి కారుతున్న నీళ్లు, చాపనూ దిండలనూ తడిపేశాయి. ఇప్పుడు తాను ఏం చేయాలి? రాత్రంతా ఆమెను వేధించే ప్రశ్నలే! ఉదయం ఎలా అతని ముఖం చూడాలి? తన ముఖం చూపాలి?-ఈ ప్రశ్నలకు రాత్రంతా ఆలోచించినా జవాబులేదు. రాత్రంతాజాగరణఅయింది. పక్కన పడుకొన్న రాధిక గురక కొడుతూ హాయిగా నిద్రపోతుంటే తాను కన్ను మూయలేకపోయింది. ఎక్కడో కోళ్లు కూస్తున్నాయి. వంతెనమీద రైళ్లు దబదబ శబ్దంతో వస్తూపోతున్నాయి. బస్సుల హారన్లూ, రిక్షాల బెల్లులు అప్పుడప్పుడు వినిపిస్తూనే వున్నాయి.

తెలతెలవారుతూ ఉండగానే రహ్మత్ వచ్చింది. ఆ సమయంలో రహ్మత్‌నుచూసి ఆశ్చర్యపోయింది రాజ్యం.

"తలనొప్పి ఎలా ఉందక్కా?" అంది నవ్వుతూ. రాజ్యం ముఖం నీరసించి పోయింది. ఆమెను చూస్తూనే నిద్ర పోలేదని చెప్పవచ్చు. రాజ్యం జవాబు చెప్పలేక పోయింది.

"ఏం జరిగిందో నేను ఊహించాను. కాని, నిజం నీ నోటినుండే విందామనుకున్నాను. అందువల్లే తెల్లవారకముందే నీ దగ్గరకు వచ్చాను" అంది రహ్మత్.

కళ్ళనుండి కారుతున్న కన్నీళ్ళను ఆపలేదు రాజ్యం. రాధిక అపాటికి స్నానం చేయడానికి వెళ్ళింది.

"వాడు నీకూ మాయమాటలు చెప్పాడా?"

తల ఊపింది రాజ్యం. రహ్మత్ ఆలోచించింది నిజమయింది. బాధగా రాజ్యం ముఖంలోనికి చూసింది. "ఎలా మోసపోయావక్కా?" అనగలిగింది. రాజ్యం జవాబు చెప్పలేదు. తలవంచుకుని బొటనవేలితో చాపమీద రాపాడిస్తున్నది.

"జరిగిందేదో జరిగిపోయింది. గుండె ధైర్యం తెచ్చుకో! మా అక్క విషయం చెప్పాగా! ఆ గుండె ధైర్యం లేకనే ఆత్మహత్య చేసుకుంది. నీ విషయం రాత్రే పసిగట్టాను. ఏం అఘాయిత్యం చేస్తావో నన్న భయంతో తెల్లారే వచ్చాను"

రాజ్యం తల ఊపింది "నాది రాతి గుండె రహ్మత్! అవమానాలతో రాటుదేలిన శరీరం. అంత తొందరగా చావను. కానీ, ఈ అవమానంతో ఎలాతిరుగగలను వాడి ముఖం చూస్తూ" అంది ఏడుస్తూ.

"తప్పదు మరి!" అంది రహ్మత్.

"వాడి ముఖంచూడకూడదనిభీష్మించు కునిభవిష్యత్తులో బంగారుబాట వేయ డానికి ఉపకరించే ట్రైనింగ్ పోగొట్టుకోం గదా! మరో ఐదునెలలు ఓపికపడితే ఈ కాలేజీనుండి బయటపడవచ్చు! ఆ తర్వాత ఏదో ఉ ద్యో గ ం చూసుకుంటే సరి పోతుంది"

రాజ్యం మాట్లాడలేదు. తలవంచుకుని కూర్చుంది.

"లే...లేచి స్నానంచేయి! గుండె ధైర్యం తెచ్చుకో, విషం కలిసిన అన్నం దక్కకుండా కడుపులో పెట్టుకోం...ఇదీ అంతే! ఏదో జరిగిపోయింది. దాన్ని తలుచుకుంటూ బాధపడటం విజ్ఞుల లక్షణంకాదు. దాన్ని అంతటితో మరచి మళ్ళీఉత్సాహంతో ముందుకుసాగడమే!''

"చిన్నదానివైనా నీవు ఎంతో తెలి వైనదానివి'' అంది రాజ్యం.

"ఆ తెలివి చుట్టూ జరిగేవి చూసిన అనుభవాలద్వారా ఏర్పడింది. ఎవరికైనా స్వంత అనుభవమో, తెలుసుకున్న అను భవమో ఉండాలి. మనమేమిటి? డాక్టర్లు, హౌస్‌సర్జన్స్ లాంటివాళ్ళే ఈ విధంగా బలయిపోతున్నారు. అంతమాత్రాన ఈ చేతులు ముడుచుకోరు. కొత్త జీవితం వైపు సాగుతారు. ఈ ప్రపంచంలో సీతి పరులెందరని ప్రశ్నించుకుంటే సున్నాలు మాత్రమే మిగులుతాయి''

రహ్మత్ బలవంతంమీదలేచి స్నానం చేసి, గుడ్డలు మార్చుకుంది. ఇద్దరూ అక్కడే ఫలహారంచేసి రిక్షాలో కాలేజీకి వెళ్ళారు. జయధీర్ ఆమెను చూశాడు. కాని పక్కన రహ్మత్ వుంటంతో పలుక రించలేదు. అంతలోనే రాధికవచ్చి 'గుడ్ మార్నింగ్ జయధీర్!' అంది నవ్వుతూ. ప్రతిగా గుడ్‌మార్నింగ్ చెప్పి లోపలకు వెళ్ళాడు.

రాజ్యం అతడివైపు తలెత్తిచూడటం మానుకుంది. అతన్ని పలుకరించడం గానీ, అతడు పలుకరించినా జవాబివ్వడం గానీ మానుకుంది. ఒక్కోసారి అతన్ని ని ల దీ సి అవమానించాలనిపిస్తుంది. అయినా తమాయించుకుంటుంది. అందు వల్ల తానూ అభాసుపాలు కావలసివస్తుంది. పైగా ఏ మూలో అతనిమీద కొంచెం అభిమానమనేది ఏర్పడివుంది. ఇది అతడి ఒక్కడితప్పుకాదు, తనకూ పాలువుంది! ఆ భావన వచ్చినప్పుడు అతడిమీద జాలి, అభిమానం ఏర్పడతాయి. అక్కడున్న విద్యార్థులకందరికీ తన అందం వెర్రె క్కించేలా తయారయింది. అందువల్లే అందరి కళ్ళూ తనమీదనే వున్నాయని, వారి చూపులూ మాటలద్వారా తెలుసు. రహ్మత్ సహకారంతో ఏ ఒక్కరితోనూ మాట్లాడకుండానే కాలంగడిచింది. హాస్టల్ లోని తోటిపిల్లలు తన చుట్టూ చేరేవారు. వారిని నవ్విస్తూ, నవ్వుతూ బాధను మింగేసింది. ఆరునెలలూ ఆరు యుగాల్లా గడిచిపోయింది. ఎప్పుడు పూర్తి అవుతుందా? ఈ ప్రాంతంనుండి పారిపోదామా?- అన్న ధ్యాసతోనే కాలం గడిపింది. కాలం గాయాలు మాన్పుతుం దన్నది పచ్చినిజం! ఎంతటి కష్టమయినా కాలం ముందుకు జరిగేకొద్దీ ఆ కష్టం భరించే ఓర్పయినా వస్తుంది, లేదా మరచిపోవడమయినా జరుగుతుంది.

* * *

ట్రైనింగ్ పూర్తిచేసుకుని ఇల్లుచేరే సరికి అంతా అస్తవ్యస్తంగావుంది. ఇంట్లో ఆడదిక్కు లేకపోవడంవల్ల సరయిన పద్ధతిలో వస్తువులులేవు. ఇద్దరు మొగవాళ్ళు, ఒక పిల్లవాడని పాలేరుగా




వుంచుకుని పనులు జరుపుకుంటున్నారు. వస్తూనే ఇంటిబాధ్యత ఆమె నెత్తిసపడింది. తమ్ముడికి పెళ్ళి నిశ్చయమైంది. పెళ్లి చేసి సంసారబాధ్యత కొడుక్కు అప్ప చెప్పాలని ముసలాయన నిర్ణయించు కున్నాడు. రాజ్యం రేపు ఉద్యోగం దొరికి వెళ్లిపోతే ఇల్లు తిరిగి యధా ప్రకారంగా తయారవుతుందని ఆయన భయం.



## 5

భవిష్యత్‌లోకి తొంగిచూడటంలో గతానికి తెరవేయడానికి ప్రయత్నిస్తు న్నది రాజ్యం. జరిగిందాన్ని ఎవరూ మార్చలేరు. జరగబోయేది ఆలోచించు కోడానికి ఆమెకు కావలసినంత తీరిక. వంటచేసుకుని తిని పడుకోవడం, తిరిగి కలలుకనడం హాబీగా తయారయింది. అప్పుడప్పుడు బాబాయి కూతుళ్లువచ్చి పిచ్చాపాటి మాట్లాడటం తప్పితే పెద్దగా అక్కడకు ఎవరూరారు. ఊరిలోనేవున్న అక్కగానీ, ఆమె కూతుళ్లగానీ, కనీసం తొంగికూడా చూడరు.

ఇంటిపక్కనే బాయ్స్ హాస్టల్‌వుంది. అంతా చిన్నపిల్లలు! షెడ్యూలుకులాలకు చెందినవారు ఆ హాస్టల్లోవున్నారు. వారికి ఏ కష్టం వచ్చినా 'అక్కాయ్' అంటూ ఆమెదగ్గరకు వచ్చి చెప్పుకునేవాళ్ళు? వార్డెన్ సక్రమంగా తిండి పెట్టకుంటే ఏ అధికారులకు పిటిషన్లు వారచలిన పెట్టించి, వారిని రెచ్చగొట్టి, కావలసిన సౌకర్యాలు ఏర్పడేలా చూసేది. అవసరానికి మజ్జిగ, పచ్చడిలాంటివి వారికి ఇస్తూ 'అక్క మంచిది'అన్న పేరు సంపాదించుకుంది. ఏ వ్యాపకంలేని ఆమెకు ఇదో వ్యాపకంగా తయారయింది.

తలంటి స్నానంచేసి కురులు ఆరబెట్టుకుంటూ దొడ్డివాకిటి గడపమీద కూర్చుంది రాజ్యం! అప్పుడప్పుడే సూర్యుడు పైకిరావడానికి ప్రయత్నిస్తున్నాడు. హాస్టల్ పిల్లలు కేకలు, అరుపులతో తిట్టుకుంటున్నారు. వాచ్‌మన్ వారిని గద్దిస్తూ కేకలేస్తున్నాడు గానీ అతడి కేకలు ఎవరూ పట్టించుకోవడం లేదు.

''ఏంచేస్తున్నావే?'' అంటూ వచ్చింది భారతి! పలకరింపుగా నవ్వింది రాజ్యం.

''రా అక్కయ్యా! ఇప్పుడే స్నానం చేశాను... పనయిందా?''

''అప్పుడేనా? మా సంసారం కోడి సంసారం లాంటిది. తింటుంటే ఆకలవు తుంటుంది. చేస్తుంటే పని కనిపిస్తూనే వుంటుంది'' అంటూ చేతిలోని పత్రిక తీసి ఇస్తూ, 'ఇందులో ప్రకటన చదువు' అంది రాజ్యం. పేపరుతీసుకుని భారతి పెన్నుతో గుర్తుపెట్టినచోట ప్రకటన చూసింది. 'అవిటివధువు కావలెను'అన్న ప్రకటన కన్పించింది. తలఎత్తి భారతి ముఖంలోనికి చూసి తిరిగి చదవడం ఆరంభించింది. వరుడి వయస్సు 32 సంవత్సరాలు. రాజకీయ, సాహిత్య రంగాలలో ఆరితేరిన వ్యక్తి! కుంటిగానీ, గుడ్డిగానీ, మూగ లేక చెవుడుగానీ లేక మరే ఇతర అంగవైకల్యంగాని ఉన్న

వధువు కావాలని ప్రకటించబడింది. ఆ ప్రకటనచూసి చిరునవ్వు నవ్వింది రాజ్యం! "ఇదేం ప్రకటనే! జీవితంలో ఎప్పుడూ నేను వినలేదు... చూడనూలేదు. చాలా తమాషాగా వేశారుకదా!" అంది.

"తమాషా అని ఎలా అనుకోగలం? నిజంగానే వేసి ఉండవచ్చుగదా! అంత డబ్బుపోసి కావాలని ఎందుకు ప్రకటిస్తారు?"

"అప్పుడప్పుడు సినిమాలవాళ్ళు ఇలా ప్రకటనలు చేస్తుంటారు. రెండో రోజు ఈ ప్రకటన ఫలానా సినిమాలోనిదంటూ ప్రకటిస్తారు. ఆవిధంగా ఇది సినిమాది అయి ఉంటుంది"

"అలా ఎందుకనుకోవాలి?''

"కాకపోతేకుంటిదాన్నో, గుడ్డిదాన్నో, చెవిటి మూగదాన్నో పెళ్ళిచేసుకుని కాపురం చేద్దామనేనా? అన్ని హంగులూ బాగున్నవాళ్ళే కాపురాలు చేయడానికి సాధ్యంకాక చస్తుంటే, అవిటి వ్యక్తులతో ఏం బావుకుందామని పెళ్ళిచేసుకుంటారు?"

"ఏమో? అతడి మనస్తత్వం ఎలాంటిదో మనకేం తెలుసు? అయినా ఒక ఉత్తరం ముక్క రాసి చూడు... వచ్చే నష్టం ఏముంది?" అంది భారతి.

''ఇలాంటివి నాకు నమ్మకం లేదు" అంది పేపరు పక్కన పెడుతూ.

"ఏపుట్టలో ఏపాముందో ఎలా చెప్పగలమే? అయినా మనకు వచ్చే నష్టం ఏమిటి?''

"కాకపోవచ్చు. అదో ఆశ పెంచుకోవడం. నిజంగా అతడు పెళ్ళిచేసుకోదలచినా మనలాంటివాళ్ళు ఎంతమంది రాస్తారో? ఇదంతా జరిగేపనిగాదు" అంది రాజ్యం! మనస్సులో ఆశ ఏ కారణమయినా లాగుతున్నది. కానీ, తొందరపడి ఆమె ముందు బయటపడటానికి జంకుతున్నది. భారతి మరీ మరీ చెప్పింది ఉత్తరం రాయమని. చివరకు ఉత్తరం రాయడానికి ఒప్పుకుంది రాజ్యం.

భారతి వెళ్ళిపోయాక ఓ గంటసేపు ఆలోచించింది. తన జీవితంలో చూడక పోవడమేగాదు; ఇంతవరకూ కనీసం వినను కూడాలేదు- ఇలాంటి ప్రకటన. వధువులు, వరులు కావాలని వేసుకుంటారే గానీ. అతడి ఉద్దేశం ఏమిటో? కేవలం హాబీకొరకు డబ్బు ఖర్చుపెట్టి ప్రకటన వేయరుగదా?

ఆరోజే ఉత్తరం రాసింది. తన వివరాలు క్లుప్తంగా ఇస్తూ, అసలు ప్రకటన ఎందుకు వేయబడింది? రచయిత నంటున్నారు కనుక ఏదయినా నవల ప్లాటుకోసం వేశారా? నిజంగా అవిటి వ్యక్తిని పెళ్ళిచేసుకుని కాపురం చేయాలనుకుంటున్నారా? వివరాలు తెలుప వలసిందిగా రాసి, కవరు పోస్టుచేయించింది. ఆ ఉత్తరానికి కనీసం జవాబు వస్తుందని కూడా ఆమె ఆశించడం లేదు. ఆశలు పెంచుకోవడం ద్వారా మనస్సును బాధపెట్టడం తప్ప లాభంలేదని ఆమె ఉద్దేశం.

కానీ ఆమె ఊహించినదానికి వ్యతిరేకంగా జరిగింది. ఐదోరోజు జవాబు ఫొటోతోసహా వచ్చింది. అందులో అతడు ఇచ్చిన సమాధానం-

"నేను రాజకీయవాదిని! రాజకీయ, సాహిత్యరంగాలలో నాకు చెప్పుకోదగిన అనుభవం ఉంది. రాజకీయాలలో ఏర్పడిన కుత్సిత వాతావరణాన్ని అసహ్యించుకుంటూ ప్రస్తుతం స్తబ్దంగా ఉన్నాను. కేవలం పత్రికలు, పుస్తకాలు

చదువుకుంటూ కాలం గడుపుతున్నాను. ఆర్థికంగా పెద్దగాలేనిమాట నిజం!అయినా నా భార్యను నేను పోషించుకోగలనన్న నమ్మకం, ధైర్యం నాకుంది. నేను నీతి నిజాయితీ కలిగినవాణ్ని. నాకూ అదే మనస్తత్వం కలిగిన స్త్రీ భాగస్వామ్యం కావాలి. మనుషుల కష్టనష్టాలూ, బాధలూ, అవమానాలూ నాకు తెలుసు. అవిటి వ్యక్తుల జీవితాలు ఎంత కష్టనిష్ఠూరాల మధ్య నలుగుతుంటాయో, ఎలాంటి బాధలకులోనై ఆత్మన్యూనతతో వారు బతుకుతుంటారో నేను అర్థం చేసుకో గలను. జీవితంలో ఎన్నో మంచిపనులు చేసి సంతృప్తిపడదామనీ, పదిమంది బాధామయ జీవుల బాధలుపోగొట్టి సుఖం కలుగచేద్దామనీ రాజకీయాలలోదిగాను. రాజకీయాలలో అవి ఎండమావులని అనుభవం ద్వారా తెలుసుకోగలిగాను. జీవితంలో ఎన్నో ఒడిదుడుకులకూ, బాధలకూలోనైన నేను, కనీసం ఒక బాధామయజీవికి సుఖమైన జీవితం కల్పిద్దా మని ఆశించాను.తత్ఫలితమే ఈ ప్రకటన! నావల్ల ఒక్క అవిటివ్యక్తి అయినా సుఖపడాలనేదే నా ఆశయం! ఇందులో ఎలాంటి కుత్సితాలూ కుతంత్రాలూలేవు...

ఆ ఉత్తరాన్ని ఒకసారికాదు... పదిసార్లు చదివింది. తాను చదువుతున్నది తానే నమ్మలేకపోతున్నది. ఆ ఉత్తరం వచ్చిందా లేక ఆవిధంగా రాయవచ్చని ఊహాలోకాలలో తాను మునిగిందా?

బయట ఎవరో పిలిస్తే ఆలోచనలు విరమించింది. చాకలి బట్టలువేయమని పిలుస్తున్నది. పాలేరు రాముసు వేయమని చెప్పి వాడా పనిచేసి వచ్చాక-

"భారతక్కను పిలువు!" అంది.

భారతి వచ్చింది 'ఏమిటే' అంటూ. వచ్చిన ఉత్తరం ఆమెకు అందించింది. ఉత్తరం పూర్తిగా చదివాక ఆమెకూడా కొంచెంసేపు ఆలోచనలోపడింది. తర్వాత రాజ్యం కళ్ళలోనికి చూస్తూ- "ఇందులో తన వివరాలు రాశాడుగానీ అంగీకారం, అనంగీకారం తెలుపలేదే?" అంది.

"అంత సులభంగా ఎలా చెప్పగలరు? అన్నీ ఆలోచించి నిర్ణయించాలిగదా! ఉత్తరం రాశాడంటే కొంతవరకయినా అంగీకరిస్తున్నట్లే! ఆ తర్వాత అతడు వచ్చి విచారిస్తాడేమో?'' అంది బయటకు చూస్తూ రాజ్యం.

"రాజ్యం! ఈ అవకాశాన్ని పోగొట్టుకోకు! ప్రయత్నించిచూద్దాం! అతడి ఆశయాలు మంచివిలాగే కన్పిస్తున్నాయి ఉత్తరం చూస్తే! నాన్నను హెచ్చరించు. ముందువెళ్ళి కలుసుకుని మాట్లాడితే అన్ని విషయాలూ పరిష్కరింపబడతాయి"

"నాన్న అంగీకరిస్తాడంటావా?" అంది రాజ్యం.

''అంగీకరించక అవిటి పిల్లనునెత్తిన పెట్టుకుని ఎన్నాళ్ళు ఈదగలడు? చేసు కునే వాడు దొరకాలిగానీ, ఏదోవిధంగా పంపడానికి ఎందరు తల్లిదండ్రులు సిద్ధంగా లేరు?''

రాజ్యం మాట్లాడలేదు. ఉత్తరం మడత పెట్టి చూస్తూకూర్చుంది. భారతి మరోసారి హెచ్చరించి వెళ్ళిపోయింది. తండ్రితో ఈ విషయం మాట్లాడాలని నిర్ణయించు కుంది. ఇప్పటికే జీవితం దస్సిపోతున్నది. వయసు మరింత ముదిరితే పెళ్ళి అసం భవం. పెళ్ళి చేసుకోకుండా, పుట్టింట్లో ఎన్నాళ్ళు కాలం గడపాలి. వచ్చే కోడలి దృష్టిలో హీనంగా తయారయి కాలం గడపాలి.

రాత్రి భోజనాలయ్యాక వసారాలో

కూర్చున్న తండ్రి మంచం దగ్గరకు వచ్చి గడపమీద కూర్చుంది రాజ్యం. మరో మంచంపై తమ్ముడు కూర్చున్నాడు. విషయం ఎలా మొదలుపెట్టాలో అర్థం కాక ఆలోచిస్తున్నది. అప్పుడే భారతి అక్కడకు వచ్చింది. రాజ్యం చెప్ప లేదేమో? తను చెప్పాలని వచ్చిందామె.

"పెదనాన్నా! రాజ్యం నీకు ఏమయినా చెప్పిందా?" అంది మంచంపై కూర్చుంటూ.

సూర్యం తల తడుముకుంటూ, "ఏ విషయం? నాకేమీచెప్పలేదే" అన్నాడు.

జరిగిన వివరాలు చెప్పింది భారతి. "ఎన్నాళ్ళని అది ఇంట్లో ఉంటుంది? తగినవాడికి అంటగడితే తన ధర్మం తాను చూసుకుంటుంది. ఎలాగూ తమ్ముడికి పెళ్ళి చేయాలనుకుంటున్నారుగదా! రేపు వచ్చే కోడలితో తగవులూ, అలకలూ జరుగుతాయి" అంది.

సూర్యం మాట్లాడలేదు. సాధూరావు కలుగచేసుకుంటూ "అక్కా! అవిటి దాన్ని ఇష్టపూర్వకంగా పెళ్ళిచేసుకోవడం నేను ఎప్పుడూ వినలేదు. కట్నం డబ్బు లకు ఆశించి, పెళ్ళిచేసుకుని కొన్నాళ్ళు వాడుకుని విడిచిపెట్టేవాళ్ళే! ఎందుకులేని పోని బాధ! ఇంట్లోనే తిని ఉంటుంది. ఏదయినా ఉద్యోగం వస్తే తన బతుకు తాను బతుకుతుంది" అన్నాడు.

"అలాగని నీవూ వుండవచ్చుగదా! నీకు మాత్రం పెళ్ళెందుకు?" అంది కోపంగా రాజ్యం.

"ప్రతి మనిషికీ భాగం పంచుకునే మనిషికావాలి. తనపిల్లలూ, భర్తా ఉండా లని కోరుకుంటారు. నేను మీ దాసీదానిలా ఇంట్లో పనిచేయాలా?" అంది.

"నువ్వు ఏం కాపురం చేద్దామనుకుంటు న్నావు? కేవలం భార్యాభర్తలు బతకా లంటేనే వెయ్యిరూపాయలుకావాలి నెలకు. ఇక పుట్టే పిల్లలు, వారి ఖర్చులు! ఇవన్నీ భరించి కుంటిదానితో బాధలు పడటానికి ఎవడికేం ఖర్మ! ఈవిధంగా నాలుగు డబ్బులు సంపాదించుకోడానికి ఎవడో ఎత్తువేశాడు. మనం ఎన్ని మోసాలు చూడటం లేదు? అందులో ఇదో కొత్త రకం. ఇంతవరకూ ఎవడూ ప్రయత్నించలేదు. ఎవడో తెలివిగా ప్రయత్నాలు సాగించాడు" అన్నాడు సాధూరావు అవహేళనగా.

రాజ్యానికి విపరీతమైన కోపం, దానితో బాటే ఏడుపూ వచ్చాయి. "అందరూ ఒకే విధంగా ఉండరు. మంచి వాళ్ళూ ఉంటారు, చెడ్డవాళ్ళూ ఉంటారు. అతడు మంచివాడు కాడని నీవు ఎలా చెప్పగలవు?" అంది ఆవేశంగా.

సాధూరావు ఆమె వాదన అంగీకరించ లేదు-"ఈ తెలివితక్కువ కూతలుకూసి జీవితాన్ని నాశనం చేసుకుంటావు. రేపు ఏ పిల్లనో నెత్తిన పెట్టుకుని నా కొంప మీద పడతావు. ఆరోజు భరించాల్సింది నేను"

"జీవితంలోఓడిపోతే అక్కడేచస్తాను. నీ ఉద్ధరింపులు, దయ నాకవసరం లేదు"

రాజ్యంవైపు తీక్షణంగా చూశాడు సాధూరావు. ఆమె ఒకనిర్ణయానికి వచ్చిన తరువాతే ఇంత గట్టిగా మాట్లాడగలుగు తున్నదని భావించాడు. మంచంలోనుండి విసురుగా లేచాడు. "ఇలాంటి తెలివి తక్కువ పనులు చేస్తే బాగుండదు. నాకు తలవంపులు తెస్తే నేను ఆత్మహత్య చేసు కొని చావడమే" అన్నాడు బయటకు వెళ్ళిపోతూ.

"ఏం నాన్నా...పలుకవేం? వాడి




కున్న హక్కు, అధికారం నాకు లేవా? వాడికి పెళ్ళాం పిల్లలు కావాలిగానీ, నాకవసరంలేదా?" అంటూ వలవల ఏడ్చింది రాజ్యం.

"చచ్చేదేదో అది వస్తుంది, మధ్యన వాడి పెత్తనం ఏమిటి పెదనాన్నా? నీవు ఇలాగే తలవంచుకుంటే దీని బతుకును వాడు గంగలో కలిపేస్తాడు" అంది భారతి.

"కుంటిది ఏం చేస్తుందనే అహంకారం వాడిది! ఏదో విధంగా లొంగకొట్టి, పెళ్ళి కాకుండా చేస్తే, ఉద్యోగం వచ్చిందంటే నెల జీతం వస్తుంది. ఇవ్వవలసిన కట్నం ఆస్తి మిగిలిపోతుందని వాడిఊహ! వాడికి ఎంత హక్కుందో నాకూ ఇక్కడ అంతే వుంది" అంది రాజ్యం దృఢంగా.

"తొందర పడకమ్మాయ్! నీకు ఆవేశం ఎక్కువ, ఆలోచన తక్కువ. వాడి పెళ్ళి కానీ! తర్వాత అతన్ని కలిసి అన్ని విషయాలూ మాట్లాడి నిర్ణయం చేద్దాం" అన్నాడుసూర్యం నెమ్మదిగా.అంతవరకూ జరిగిన గందరగోళంవల్ల అతనికి బాధగా ఉంది.

"అదేం మాట! నీ కోసం అతడు ఆగుతాడా ఏమిటి? ఎవరూ గతిలేక నీవే శరణ్యమని ఎదురుచూస్తూ గుటకలు మింగుతాడా?" అంది విసుగ్గా భారతి.

"ఎలాగే మరి? వాడూ తొందరపడి, రాజ్యం తొందరపడితే ఇంట్లో కలతలే! ఇప్పటికే ఒక పిల్ల ఇంట్లో పోట్లాడి బయట కాపురం పెట్టింది. వాళ్ళుపీక్కొ ఇలా పోట్లాడుకుంటే వినే జనం నవ్వుతారు" అన్నాడు బాధగా.

"పోట్లాడుకుంటే నవ్వుతారో లేదో గానీ, అవిటిదానికి పెళ్ళికి అవకాశం దొరికినా చేయకుండా ఇంట్లో పెట్టుకున్నారంటే మాత్రం జనం మీ ముఖాన ఉమ్మి వేస్తారు" అంది భారతి కోపంగా లేచి వెళ్తూ. సూర్యం మాట్లాడలేదు. మంచంలో పడకవేశాడు.

రాత్రంతా ఆలోచనలతో, ఏడ్పుతో కాలం గడిపింది రాజ్యం. ఏదో ఒక కొమ్మ పట్టు దొరికితే చాలు పట్టుకుందామని ప్రయత్నంచేస్తే, ఆ కొమ్మను విరిచి వేయడానికి తమ్ముడు ప్రయత్నం చేస్తున్నాడు.ఇన్నాళ్లూ ఎక్కడికీ పోదనే ధీమా ఉండి ఉంటుంది. ఈరోజు ఇలా మాట్లాడితే వాడికి మంటపుట్టింది. వాడికొరకు నా జీవితం నాశనం చేసుకోవాలా? నాదీ ఉప్పుకారం తినే శరీరమే- అనుకుంది బాధగా. కణతలు అదురుతున్నాయి. నిద్రలేదు. తెల్లారి లేచేసరికి నీరసంగా వుంది. లేవకుండా మంచంలోనే పడుకుంది. తండ్రి వచ్చి లేపితే ఆరోగ్యం బాగా లేదని చెప్పింది. అతడికీ తెలుసు ఆ బాధ ఏమిటో? వయస్సులో వున్న ఆడపిల్ల కోరికలు ఏవిధంగా ఉంటాయో? మరి కొడుకును ఎదిరించలేడు. ఇటు సర్ది చెప్పనూలేడు. సతమతమవుతున్నాడు అతడు.

ఈ ఉచ్చులోనుండి బయటపడాలంటే తాను తెగించక తప్పదనుకుంది. నష్టమో కష్టమో ప్రయత్నం సాగించాలి. జీవితంలో ఓడిపోతే ఇదే ఆఖరిగా చేసుకోపడం. కాళ్ళూ చేతులున్నవాళ్లందరూ సుఖంగా బతుకుతున్నారా? అలా లేదు. ఎందరి సంసారాలో విచ్ఛిన్నమయ్యాయి. ఎరెంపరో బజార్లవెంట పడ్డారు. రేపు తన గతీ అదేకావచ్చు. రేపేదో జరుగుతుందన్న భయంతో పెళ్ళి చేసుకోకుండా ఎన్నాళ్ళు కాలం గడపాలి? చివరి నిర్ణయం చేసుకుంది. తాను విజయవాడ

ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజ్ వద్దకు వస్తున్నాననీ, అక్కడ పిలుంటే కలుసుకుని మాట్లాడమనీ రాసింది. అతడికి ఏమాత్రం ఇష్టం ఉన్నా తప్పకుండా వస్తాడు. ఎలాగూ ఎంప్లాయ్‌మెంటు ఎక్స్ఛేంజ్‌లో ట్రైనింగ్ సర్టిఫికెట్ ప్రొడ్యూస్ చేయాలి. అతడు రావడం జరిగితే ఏదో ఒకనిర్ణయం జరిగిపోతుంది అనుకుంది.

నాలుగు రోజుల తర్వాత హాస్టల్ పిల్లవాడిని ఒకడినితోడు తీసుకుని విజయవాడకు బయలుదేరింది. తమ్ముడికి అనుమానంగా ఉన్నా మాట్లాడలేదు. ఈ నాలుగురోజులుగా అతడు పలుకరించడం లేదు. తండ్రికి అనుమానంగావున్నా ఆ విషయం మాట్లాడి బాధ పెట్టదలచుకోలేదు. అవకాశం ఉంటే తనే ప్రయత్నం చేసుకోనీ అనుకున్నాడు.

ఎక్స్ఛేంజ్ వద్దకు చేసేసరికి దాదాపు పదకొండు గంటలయింది. అతడు వచ్చాడేమోనని చుట్టూ చూసింది. ఆరోజు ఇంటర్వ్యూ ఏదో ఉండటంతో వందమంది దాకా జనం వున్నారు. వారిలో ఎవరో ఆమెకు తెలియదు. తన నడక చూసి అతడు వచ్చి తనను కలుసుకోవలసిందేగానీ, తాను అతన్ని గుర్తు పట్టడం సాధ్యంకాదు.

లోపలకువెళ్ళి సర్టిఫికెట్ ప్రొడ్యూస్ చేయడానికి ప్రయత్నించింది. మేనేజర్ మరో గంట తర్వాత రమ్మని చెప్పడంతో బయటకువచ్చి తలుపుకు ఓ పక్క నిలబడింది జనాన్ని చూస్తూ.

"రాజ్యలక్ష్మి మీరేననుకుంటాను?"

ఆ మాటతో ఉలిక్కిపడి ఆలోచనల నుంచి బయటపడి ఎదుటివ్యక్తిని చూసింది దాదాపు ఆరడుగల బక్కపల్చ విగ్రహం ఆమెముందుంది. అంతవరకూఆమె ఊహించుకున్న రూపంకాదది. మనిషి అందగాడు కాదు, చామన ఛాయరంగు అయినా ఎండలో పడి తిరగడంవల్ల నలుపు రంగులో కనిపిస్తున్నాడు. అతి సన్నంగా కున్నా పల్చగానే ఉన్నాడు. ముఖంలో కొట్టొచ్చిన కళ ఏమీలేదు. తెల్లఖాదీ షర్టు తెల్లఖాదీ పైజామా వేసుకున్నాడు. నడుముకుఉన్న ఎర్రటి బెల్టు పలుచని ఖాదీ గుడ్డలకిందకనిపిస్తూవుంది. కాళ్ళకు లేలిక రకం చెప్పులున్నాయి. ఒకసారి అతన్ని కిందినుండి పైదాకా చూసింది. తలమీద అక్కడొకటి అక్కడొకటి నెరసిన వెంట్రుకలున్నాయి. అంతవరకూ ఆమె ఊహించుకున్న రూపం చెదిరిపోయింది. ఏ జయశీల్ లాగానో ఉంటాడని ఆశించింది. అందుకు భిన్నంగా ఉన్నాడు. మరోసారి అతడు పలుకరించాడు—

"రాజ్యలక్ష్మి మీరు కాదా?"

ఈ లోకంలోకి వచ్చింది రాజ్యం! కళ్ళు మిటకరించి చిన్నగా నవ్వి తల పంచుకుంది. "నేనేనండీ!" అంది. అతనెవరో తెలుసుకోవాల్సిన పని లేదు. తన కొరకు అక్కడకు వచ్చేది అతడే కాబట్టి.

"నా పేరు మధు! బహుశా నాపేరు మీకు జ్ఞాపకం ఉంటుందనుకుంటాను"

తల ఊపింది రాజ్యం- ఏం మాట్లాడాలో అర్థంకాక.

"రండి.ఆబల్లమీద కూర్చుని మాట్లాడుకుందాం. మళ్ళీ నేను వెళ్ళాలి" అన్నాడు బల్లదగ్గరగా వచ్చి నిలబడుతూ. రాజ్యం చిన్నగా వచ్చి బల్లపై కూర్చుంది.

"చెప్పండి....నన్ను ఎందుకు పిలిపించారు?" అన్నాడు గోడకు ఆనుకుని నిలబడ్డ మధు ఆమె ముఖంలోకి చూస్తూ.

"మీ ఉత్తరం చేరింది. అవిటి వ్యక్తిని పెళ్ళి చేసుకుంటారంటే మావాళ్ళు ఎవరూ




నమ్మకంలేదు. మధ్యన విడిచిపెడితే గతేమిటి అంటున్నారు. ఏ బ్రోతల్ కొంపలకో అమ్ముకుంటే చేసేదేమిటంటున్నారు"

మధు నిట్టూర్చాడు-"బ్రోతల్ కొంపలకు అమ్ముకోడానికి కుంటిదే ఎందుకు? మంచివాళ్ళనే పెళ్ళిచేసుకోవచ్చు. మధ్యన విడిచిపెట్టడానికి పెళ్ళి చేసుకోవడం ఎందుకు? నా వివరాలు అన్నీ ఉత్తరంలో రాశానుకదా!"

"చూశారు మా వాళ్ళందరూ. కానీ వారికి ఏదో అనుమానం. ఎన్నో వంకలు పెడుతున్నారు. అందరూ తలోరకంగా మాట్లాడుతున్నారు"

"మీ ఇష్టం! మీకు ధైర్యం లేకపోతే నేను చేసేదేముంది? నాపరంగా నేను చెప్పాలంటే ఎవరినీ మోసం చేయాలన్న కోరిక నాకు లేదు. జీవితంలో ఒక మంచి పని సాధించాలన్న ఆశమాత్రమే ఉంది. నన్ను గురించి అన్ని వివరాలూ తెలుసుకోండి. ఆ తర్వాతే ఒక నిర్ణయానికి రండి... వస్తాను" అంటూ బయటకు నడిచాడు. అతడు నడుస్తుంటే ఊగుతున్న పైజామానూ, చేతిలోని బ్యాగ్‌నూ చూస్తూ కూర్చుంది రాజ్యం.

అతనితో వివరంగా మాట్లాడలేకపోయాననుకుంది. ఒకవిధంగా అతడిని చూసి ముందు నిరాశ ఏర్పడింది. తన ఊహకు భిన్నమైన అతని రూపంచూసి బాధ కలిగింది. అతడు మాట్లాడుతుంటే సమాధానం ఇవ్వడానికి తనకు శక్తిలేకుండా పోయింది. ఇంటిదగ్గర వల్లించుకున్న నాలుగుమాటలూ పాఠం అప్పచెప్పినట్లు చెప్పి, తర్వాత మాట్లాడలేకపోయింది.

అతని రూపాన్ని గురించి ఆలోచించడమెందుకనుకుంది! రూపంలో ఏముంది?



అందంగావున్న సుబ్రహ్మణ్యం, జయధీర్‌లు చేసిందేమిటి? అందం వెనుక వున్న విషం తనకు అనుభవమయ్యింది. ఇతడు అందంగా లేకపోవచ్చు, అనాకారి మాత్రంకాదు. సంతృప్తిపడితే జీవితం గడపడానికి అవకాశం హాయిగావుందేమో నన్న ఆశ ఏర్పడుతున్నది. ఇంతవరకూ ఆ ప్రకటన బోగస్‌గా ఆలోచిస్తున్నది. ఇప్పుడు అది నిజమేననీ, ఇక నిర్ణయించు కోవలసింది తానేననీ తలపోస్తున్నది. ఆతడి మాటల్నిచూస్తే ఉత్తరంలో రాసి నంతమధురంగా లేవు. ఉత్తరాలు రాయగలి గాడుగానీ ఆచరణలో సంకోచిస్తున్నా డేమో? అతని ఉత్తరాన్నిబట్టి, ప్రకట నసుబట్టి అతడిరూపాన్ని ఆశయాన్నిబట్టి అతడు విశ్వసించదగ్గవ్యక్తిగా భావించింది ఆలోచనలతో నీరసం ఆవరించింది.

ఫలహారం తెమ్మని పిల్లవాడిని బజారుకు పంపింది. ఎక్ఛేంజ్‌లో పని పూర్తయ్యేసరికి సాయంత్రం మూడు గంటలయింది. ఇంటికి చేరేసరికి పొద్దు గ్రుంకింది.

తండ్రిఉత్తరాలు రెండుతెచ్చిఇచ్చాడు. ఒకటి మధునుండి వచ్చిందే! రెండోది లలితనుండి వచ్చింది! ఉత్తరాలను పక్కన పడేసి వంట కార్యక్రమంలో పడింది. అందరూ భోజనంచేసి పడుకున్నతర్వాత ఉత్తరాలుతెసి చదవడం సాగించింది. మధు ఉత్తరంలో ఏమీలేదు. ఎక్ఛేంజ్ వద్ద కలుసుకొమ్మని రాసిన ఉత్తరానికి జవాబుగాతానువస్తున్నట్లురాశాడు. రెండో ఉత్తరం లలిత భారతంలా రాసింది. తన ఇంట్లో బాధలు, కష్టనష్టాలు, తన ట్రైనింగ్ విశేషాలు, విపులంగా రాసింది. తనకు ఒకవైపు చెవుడు ఏర్పడుతున్నదనీ ఉద్యోగం దొరికే సూచనలేవీలేవనీ ఆమె రాసింది. రాజ్యం దగ్గరకు వచ్చి నాలుగురోజు లుండాలనుకుంటున్నాననీ, త్వరలోనే ప్రత్యక్షమవుతాననీ కొంటెగా రాసింది. రాజ్యం ఆ ఉత్తరం చదివి నవ్వు కుంది. ఆలోచిస్తూనే మరికొంతసేపటికి ప్రశాంతంగా నిద్రపోయింది. అంత వరకూ మరో మంచంలో పడుకున్న సాధూరావు ఆమె నిద్రపోయిందని నిర్ధా రించుకున్నాక లేచివచ్చి ఉత్తరాలుతీశాడు. రెండు ఉత్తరాలూ చదివిమడత పెట్టాడు.

'అయితే ఈరోజు వాణ్ని కలుసుకో డానికే ఈ కుంటిది వెళ్ళిందన్నమాట" అనుకుని పండ్లుకొరికాడు. ఇంతవరకూ— ఇంట్లోనేపడివుంటుందనీ, కానీ కట్నం లేకుండా, ఉద్యోగంచేస్తూ నెలకింత అని సంపాదిస్తుందనీ ఆశించాడు. కాని, ఇప్పుడు పరిస్థితి మారింది. ఎలాగయినా పెళ్ళిచేసుకోవాలన్న తపనలోనే పడింది. పెళ్ళిచేసుకుని బయటపడితే ఆస్తిలో వాటా పోతుంది. రేపు ఉద్యోగం దొరికితే నెలకో వెయ్యిరూపాయలు పోతాయి. ఇలాగే గొంతుపిసికి చంపేస్తే' అనుకున్నాడు కసిగా! తల వూపి తన మంచందగ్గరకు వచ్చాడు. ఇది బయటకుపోకుండా ఏదో ఒకటి చేయాలని అనుకున్నాడు. తన పెళ్ళికంటేముందు రాజ్యం బయటకు వెళ్తే ఈరోజు కట్నరూపంగా తనకు ఒప్పుకున్న పాతికవేలూ ఇవ్వరు. రాయి స్వామన్న డెబ్భై వేలరూపాయల ఇల్లూ దక్కదు. వాటిని దక్కించుకోవాలంటే రాజ్యం పెళ్ళికాకుండాచేయడం మంచి దనుకున్నాడు.

ఉదయం భారతివచ్చి కలిసింది "ఏమ యిందే నీపని?'' అంది నవ్వుతూ.

"ఏముందక్కా! సర్టిఫికెట్ ప్రొడ్యూస్ చేసి వచ్చాను" అంది ప్రతిగా నవ్వి.

"ఒసేయ్ వగలాడీ! నా దగ్గర దాపరికం ఎందుకే! అతడు నిన్ను కలపలేదా?"

భారతి కళ్ళలోకి చూసింది రాజ్యం! తలపంచుకుంది. దాచి పెట్టినందుకు బాధగావుంది. ఎవరికీ తెలియనివ్వకూడదనుకుంది; కానీ తన వెంటవున్న పిల్లగాడు భారతికి చెప్పివుంటాడు. వాడికి భారతి పట్లకూడా చనువు ఎక్కువే!

"క్షమించు అక్కా! పూర్తిగా ఒక నిర్ణయానికి వచ్చేవరకూ చెప్పకూడదనుకున్నాను" అంది "అతడు వచ్చికలిశాడు పెద్దగా మాట్లాడలేదు. ఇక్కడ తమ్ముడు అడిగిన అనుమానాలే నేనూ అడిగాను; అతడు జవాబు చెప్పాడు. ఎవరిని మోసం చేయడానికీ తాను పెళ్లిచేసుకోవడం లేదన్నాడు''

''మనిషి ఎలావుంటాడు?"

"అందగాడుకాదు, అలాగని కురూపీ కాడు. కానీ నాకు నచ్చని అందం"

"అందం గురించి ఆలోచించకు! మరో మూడు నాలుగు సంవత్సరాల్లో నీ అందం మాత్రం వుంటుందా? ప్రతి ఒక్కరి అందం ఎప్పుడో ఒకప్పుడు పతనమవుతుంది. చివరకి నిలిచివుండేది మనస్సు, అలవాట్లు! మనిషిని చూస్తే ఏమనిపించింది?"

"మంచివాడుగానే కన్పించాడు. మంచి మాటలతో ఊరించేస్తాయి కలవాడు కూడాకాదు. ఉత్తరంలో భాషచూసి, పూరించేవిధంగా మాట్లాడతాడనుకున్నాను సిగరెట్‌లాంటి అలవాట్లువున్నట్లు నా కనిపించలేదు"

"మొత్తానికి ధైర్యంచేసి కలుసుకున్నావ్! మరింత ధైర్యంగా ముందుకు వెళ్లు! నీ జీవితాన్ని నువ్వే సుఖంగా మలచుకో! మీనాన్న నిన్ను గురించి అంతగా ఆలోచించడంలేదు. నీ తమ్ముడు తన సుఖంకొరకే ప్రయత్నిస్తున్నాడు. మిగిలినవారికీ ఆ అవసరాలూ, కోరికలుంటాయని వాడికి తెలిసి నటిస్తున్నాడు. చెడిపోతే ఇంతకంటే కష్టంరాదు. బాగుపడితే నీ జీవితం నువ్వే దిద్దుకున్నావన్న పేరు నీకే వస్తుంది.

రాజ్యం తల ఊపింది. భారతి వెళ్ళిపోయిన తరువాత హాస్టల్‌లో ఉంటున్న గోపిని పిలవనంపింది.

"గోపి!మాగులూరు వెళ్ళి వస్తావా?" అంది వాడిని చూస్తూ

"వెళ్ళివస్తానక్కా?ఎందుకు"అన్నాడు గోపి. వివరాలు టూకీగా చెప్పి "మధు అనే అతన్ని గురించి నీవు అన్ని వివరాలు తెలుసుకొనిరావాలి'' అంది. ఛార్జీలకు డబ్బులు ఇచ్చి పంపించింది.

గోపి మాగులూరు చేరేసరికి మధ్యాహ్నం అయింది. మధు కొరకు వెతికితే అతడు ఊరిలో లేడని తెలిసింది. మధు స్నేహితుడు ఒకరిని కలిసి మధును గురించి అడిగాడు.

మధు ఇంటి చుట్టుపక్కలవారిని చాలా మందిని కలిసి, అతన్నిగురించిఅడిగాడు. అతనికి ఎలాంటి వ్యసనాలూ లేవనీ,ఎవరితోనూ పెద్దగా కలిసి ఉండడనీ, అతని పనేదో అతడు చూసుకుంటుంటాడనీ వాళ్లు చెప్పారు. కొందరు అతడు చాలా మంచివాడన్నారు. కొందరు గర్వపోతన్నారు, మరికొందరు భయంకరమైన రాజకీయవాది అన్నారు. చివరకు మంచి మనిషి అని అందరూ చెప్పారు. అతడి వల్ల ఎవరయినా చెడిపోయినట్లూ, నష్టపోయినట్లూ దాఖలాలు గోపీకి కన్పించలేదు.

రాత్రికి ఇల్లు చేరాడు. తను తెలుసుకున్నవి, విన్నవిషయాలు వివరంగా ఆమెకు చెప్పాడు. రాజ్యం ఆలోచనలో పడింది. అతన్ని గురించి, అతని మనసు గురించి ఒక నిర్ణయానికి వచ్చే స్థితికి చేరింది. శారీరకంగా అతన్ని ఊహించడం మాని, మానసికంగా అతడి స్థాయి ఏమిటనే ఆలోచనలో వుంది. తాను ప్రత్యక్షంగా అతన్ని చూసినప్పుడూ అతడు మంచివాడే అయి ఉండవచ్చనుకుంది; వివరాలు అలాగే తెలుస్తున్నాయి. ఈ అవకాశాన్ని జారవిడవడం తెలివితక్కువగా భావించింది. మరింత ముందుకు వెళ్ళి అయినా అతనితో జీవితం పంచుకోవాలనే ఆలోచనకు వచ్చింది. జీవితం అనుభవించడానికి అందం ముఖ్యమా? కాదనుకుంటున్నది. ఇప్పుడిప్పుడు అందం తప్పితే అతడిలో ఆమెకు చెడుగుణాలు కన్పించడంలేదు. పదిరోజులుగా అదే సమస్యతో ఆరాటపడుతున్న ఆమె మనస్సు ఈరోజు ఉత్సాహాన్ని సంతరించుకుంది. ఎవరు ధిక్కరించినా, తన లక్ష్యం తాను చేరుకోవాలి. అడ్డంకులను చూసి బెదిరితే ఇంకా అడుక్కుతొక్కేస్తాయని నిర్ణయించుకుంది.

* * *

సాయంత్రం నీరెండలో ఆరుబయట కూర్చున్నది రాజ్యం. చుట్టూ నలుగురు హాస్టల్ పిల్లలు కూర్చుని నవ్వుకుంటూ మాట్లాడుకుంటున్నారు. హాస్టల్‌నుండి వంట ఘుమఘుమలు చల్లగాలికి నాసికాపుటాల్ని అదరగొడుతున్నాయి.

"ఏరా రఘూ! మీ వంటశాలనుండి మంచివాసన వస్తున్నట్లుందే" అంది రాజ్యం నవ్వుతూ.

"ఔనక్కా! వార్డెన్‌గాడికి మంచి ఆలోచనలు వచ్చినరోజు కొంచెంమసాలా విదిలిస్తాడు. ఆదివారంకదా, మటన్ చేస్తున్నారు" అన్నాడు రఘు.

నలుగురు పిల్లలు మసాలా దినుసులు తీసుకుని రోలు వద్దకు వచ్చారు. రోటిలో పోసి రోకలిబండ తీసుకుని దబదబా దంచడంలో నిమగ్నమయ్యారు. ఒకడి చేతిలోనుంచి ఒకడు లాక్కుంటూ దంచడానికి ప్రయత్నం చేస్తున్నారు. వీళ్ల లాక్కోవడంలోనే కాలం గడిచిపోతున్నది. కాని, దినుసులు నలగడంలేదు. వాళ్ళను చూస్తూ "ఒకడు దంచండ్రా! అందరూ కలిస్తే అది నలగడం సంగతేమోగానీ, మీకు రొప్పు వచ్చేలా ఉంది అంది రాజ్యం. రఘు వెళ్ళి అందరినీ పక్కకు తోసి రోకలిబండ తీసుకొని దంచసాగాడు.

"అక్కా"అంటూ లలిత వచ్చింది. రాజ్యం లలితవైపు చూసి నవ్వుతూ "ఎప్పుడే రావడం?" అంది.

"ఇదే రావడం! ఈ పల్లెటూరి బస్సులు ఎక్కి వచ్చేసరికి తల్ప్రాణం అరికాలిలోకి వచ్చింది. ఉదయం వినుకొండకు పదిగంటలకు వచ్చేనా? మీ ఊరికి వచ్చే సిటీ బస్సు ఒక గంటలో ఉందని స్టాండ్‌దగ్గర చెప్పారు. అప్పటినుండి ఇప్పటిదాకా ఎప్పుడడిగినా గంటకు వస్తుందంటారు. గంటలు గడిచాయిగానీ బస్సులేదు. చివరకు ఈ టయానికి తగలడింది" అంది పైటతో చెమట తుడుచుకుంటూ.

"స్నానం చెయ్యి! తర్వాత మాట్లాడుదాం" అంటూ లేచి లోపలకువచ్చింది.

లలిత స్నానం చేసి వచ్చేసరికి కాఫీ రెడీ చేసింది రాజ్యం. ఇద్దరూ కాఫీ తాగి బయటకు వచ్చి కూర్చున్నారు.




"ఏమే! మరీ సన్నబడిపోతున్నావ్? అన్నం తినడంలేదా?" అంది రాజ్యం.

"తిన్నది ఒంటపట్టడంలేదులే! అది సరేగానీ నీ ప్రయత్నాలు ఎంతవరకు వచ్చాయి? ఆయన వివరాలేమిటో చెప్పు వింటాం"

రాజ్యం క్లుప్తంగా జరిగిన సంగతులు చెప్పింది. అంతా విన్న తర్వాత "అత నెలాంటివాడో ఒకసారి పెద్దవాళ్ళచేత విచారించాల్సింది. ఎందుకంటే సుబ్రహ్మణ్యం కథ మరచిపోలేంకదా! మరోసారి అలాంటి మానసిక బాధ పొందడం మంచిది కాదేమో!"

"ఇప్పటికి రెండుసార్లు అతనికి తెలియ కుండానే విచారించారు. మా భారతి అక్కయ్య ప్రత్యేకంగా మనిషిని పంపి విచారించింది. అతనిలో ఏ చెడుగుణాలూ వున్నట్లు నిర్ధారణకాలేదు! కాకపోతేఅదేదో రాజకీయాలలో ఇంతకుముందు తలమునక లయ్యాడట. ప్రస్తుతం మానుకున్నానని అతడు చెబుతున్నా, అక్కడ ఎవరూ నమ్మలేరు"

"మనిషిలో చెడుగుణాలు లేకున్నంత వరకూ మంచిదే! రాజకీయాలు పక్కన పెట్టు. ప్రతిమనిషిలో అవి ఎప్పుడూ ఉంటాయి" అంది లలిత.

"అన్నట్లు మరిచాను, సుమతి ఏం చేస్తున్నదే?" రాజ్యం ప్రశ్నకు పకపక నవ్విందిలలిత! "దానికేం! మగరాయుడు లాగా మగవాళ్ళలో స్నేహంచేస్తూ, జల్సాగా తిరుగుతున్నది. దాని తలతిక్క వాగుడు ఇప్పటికీ తగ్గలేదు. ఏదేదో చీల్చేస్తానంటున్నది" అంటూ అభినయం చేస్తూ చెప్పడం సాగించింది లలిత. "అన్నట్లు ఆయనగారు రాసిన ఉత్తరాలు ఏవీ? చదివిచూద్దాం" అంటూ లేచింది. రాజ్యంవద్ద తాళంచెవులు తీసుకుని పెట్టెతెరచి ఉత్తరాలకట్ట తీసుకువచ్చింది. అంతలోనే సాధూరావు రావడంతో కట్ట పరకింద దాచింది. "ఎప్పుడొచ్చావ్ లలితా?" అన్నాడు నవ్వుతూ.

"ఇంతకుముందే వచ్చానన్నయ్యా! మీ పనూరు రావడమంటే యమధర్మరాజు దగ్గరికి వెళ్ళినట్లే!" అంది నవ్వి.

"ఏంచేస్తాం? ఈ పల్లెటూళ్ళకు బస్సు సౌకర్యాలు సరిగా వుండవు" అంటూ అతడు అక్కడినుండి వెళ్ళిపోయాడు. ఉత్తరాల కట్టవిప్పివరుసగా ఒక్కొక్కటే చదవడం సాగించింది. దాదాపు గంట సేపు పట్టింది! ఉత్తరాల్ని కట్టగడుతూ "మొత్తానికి రచయితననిపించాడుగదే!" అంది చెమట తుడుచుకుంటూ. రాజ్యం నవ్వింది.

"ఇతడు రాసిన వుత్తరాలు కవిత్వం అయితే మాట్లాడేదేమీలేదు, కానీ, అతడి ఆచరణ ఇదేఅయితే సమాజంలో ఇలాంటి ఉన్నతులు ఉన్నందుకు సంతోషించా ల్సిందే."

రాజ్యంమాట్లాడలేదు. మహాభావాసనకి సంతోషపడుతూ ఎగురుతున్న హాస్టల్ పిల్లలవేపుచూస్తున్నది. మంచిమాంసంలో వార్డెన్‌వాటా ఎప్పుడో బయటకు వెళ్ళి పోయింది. ఉడికిన మాంసంలో ఇద్దరు వంటమనుషులు, వాచ్‌మెన్ కావలసినంత మెక్కడమేకాకుండా, మంచి మంచి కండ మాంసం ఏరుకుని గిన్నెలను తీసుకుని వెళ్ళారు ఇంటికి! యాభైమంది పిల్లలకు మిగిలేదేముంది! 'నాకు, నాకు' అంటూ మీదపడి లాక్కుంటారు. వారికి అదే మహాప్రసాదం!

చీకటి పడింది. పాలేరు లైట్లు వేశాడు. వర్షపు వాతావరణం ఆరంభమయింది.

గాలి విపరీతంగా వీస్తున్నది. "లోపలకు వెళ్దామా?" అంది రాజ్యం లేచి. లలిత తల ఊపింది. ఇద్దరూ లోపలకువచ్చి మంచంపై కూర్చున్నారు.

"నీ అభిప్రాయం ఏమిటే?" అంది రాజ్యం లలిత కళ్ళలోకి చూస్తూ.

"ఈ ఉత్తరాలబట్టి చాలా గొప్ప మనసు గలవాడని చెప్పాగా! విచారించా మంటున్నారు. మంచివాడేనంటున్నారు. ఇంతకంటే మంచి అవకాశం వస్తుందని నాకు నమ్మకంలేదు."

"మరి తమ్ముడు, నాన్న అంగీక రించాలిగా!"

"పిచ్చి అక్కా!" అంది చెంపలు రాస్తూ లలిత! "నీఅమాయకత్వంఇంకాపోలే దేమిటే! రేపు ఈ తమ్ముడూ, నాన్నా నీ జీవితానికి గ్యారంటీ ఇస్తారా? రేపు మరదలు పిల్ల వస్తే ప్రతివిషయంలో కుంటిది, కుంటిదని హీనంగా చూస్తూనే ఉంటుంది. నీ జీవితం నువ్వు చూసుకోవాలి; కానీ వీరందర్నీ గురించి ఆలోచించడం ఎందుకు? అతడు సరయిన వ్యక్తే అయితే వీళ్ళలో ఎవరు నీదగ్గరకు రాకున్నా బాధేంలేదు"

"తమ్ముడు చస్తానని బెదిరిస్తున్నాడే!"

"ఇటువంటివాళ్ళు రోజూ చస్తూనే వుంటారు. కుందేలు తిరుగబడేవరకూ కుక్క వెంటపడుతూనే వుంటుంది."

"తమ్ముడి పెళ్ళి మరో పదిరోజుల్లో కాబోతున్నది. అయింతర్వాత మరోసారి నాన్నను అడుగుతాను. కాదంటే నా స్వంత ప్రయత్నం చేసుకుంటాను" అంది రాజ్యం.

"తప్పదుమరి! ఆడపిల్లకు పెళ్ళిచేసి పంపించాల్సిన బాధ్యత ఉన్నవాళ్లు ఇంత నిర్లక్ష్యంగా వుంటే, నీదారి నువ్వు చూసుకోడంలో తప్పేంలేదు. వయసున్న పిల్ల వుందనేకదా నీ తమ్మునికి వాళ్ళు కట్న మిస్తున్నది. ఆ జ్ఞానం వీళ్ళకు లేకుంటే నువ్వెందుకు లొంగివుండాలి?"

లలిత ధైర్యపు మాటల్ని ఆలకిస్తూ పడుకుంది రాజ్యం! అడుగు ముందుకు వేయడానికి సిద్ధంగా ఉంది; కానీ వేయక ముందే మంచిచెడ్డలు ఆలోచించడానికి అందరి సలహాలు తీసుకుంటున్నది. తర్వాత బాధపడి చేసేదేమీలేదు.

మరుసటిరోజు లలిత వెళ్ళిపోవడానికి ప్రయాణమయింది.

"తమ్ముడి పెళ్ళి అయ్యేవరకూ వుండవే నాకు తోడుగా!"

"పిలవని పేరంటమంటే ఇదే! నిన్ను చూద్దామని నేను వచ్చాను. పెళ్ళికి మళ్ళీ వస్తాగా!" అంది సంచి చేతికి తీసుకుని బయలుదేరుతూ. కనిపించినంతవరకూ చూసింది రాజ్యం! 'ధైర్యవంతురాలు' అనుకుంది. "రేపు ఈ అమ్మాయి కూడా ఇలాగే స్వంత బాటను ఎన్నుకుంటుం దేమో!"

హాస్టల్ పిల్లలు వచ్చారు. "అక్కా! మాకు మంచి కూరగాయలు తేవడంలేదు. అడిగితే తంతానంటున్నాడు వార్డెన్. ఆఫీసర్లకు రిపోర్టు రాసి ఇవ్వక్కా! పంపి స్తాం!" అంటూ అడిగారు.

"రిపోర్టు పంపితే సరిపోదర్రా! రేపు ఆఫీసర్లు వచ్చినప్పుడు గట్టిగా నిలబడి మాట్లాడాలి. మీరంతా అందుకు సిద్ధంగా ఉన్నారా?"

పదిమంది పిల్లలు సిద్ధమేనంటూ అరిచారు. వారికి రిపోర్టు రాయించింది.

"ఎవరికీ తెలియకుండా పంపండి! ఆఫీసర్లు వచ్చేలోగా ఎవరికి తెలిసినా వాళ్ళు జాగ్రత్తపడతారు". పిల్లలు ఆ పేపర్ తీసుకుని పోస్టాఫీసువైపు వెళ్ళారు.

సాధూరావు శుభలేఖల కట్ట ఒకటి తెచ్చాడు. "శుభలేఖలు పంపిద్దాం! చుట్టాల అడ్రసులు రాయి... చెబుతాను" అన్నాడు. కట్టముందేసుకుంది. అతడు చెబుతుంటే ఆమె రాస్తూ కూర్చుంది. దాదాపు రెండువందల పేర్లు రాశారు. చివరగా మిగిలినదానిమీద మధు పేరు రాస్తూ ఉన్నది. సాధూరావు విసురుగా దాన్ని లాక్కొని ముక్కలుగా చించాడు. కోపంగా చూస్తూ "తెలివితక్కువ పనులు చేయకు. ముక్కూమొఖం తెలియని వాళ్ళను ఆహ్వానించడానికి సిగ్గులేదూ!" అన్నాడు క్రోధంగా.

చినిగిన ముక్కలవైపు చూస్తూ, తలెత్తి అతడి కళ్ళలోకి చూసింది. బాధగా నవ్వి, "పేపరునయితే చించేశావు; కానీ, మనసులో నాటుకున్న భావాన్ని నువ్వు చింపలేవు కదా!" అంది.

అతడు పళ్ళుకొరికి అక్కడ నుండి వెళ్ళిపోయాడు.

పెళ్ళి పనులు ఆరంభమయ్యాయి. ఊరిలోనే ఉన్న అక్కను తీసుకురావడానికి తండ్రి, తమ్ముడు పదిసార్లు తిరిగారు. నిరసనలు, కోపతాపాలు అయిన తర్వాత పెళ్ళి రెండురోజులుందనగా వచ్చింది పుట్టింటికి! రాజ్యం అనసూయను పలుకరించలేదు. అనసూయ ముఖం చూస్తే గతమంతా గుర్తుకువస్తున్నది. ఒకసారి ఒకరిని అసహ్యించుకుంటే, తొందరగా మనస్సు మార్చుకోలేదు. రాజ్యం. రెండు రోజులూ పక్కకు తప్పుకుని తిరిగింది రాజ్యం.

భారతి వచ్చి పనుల్లో సహాయపడుతున్నది. "మీ అక్క బాధపడుతున్నదే నీవు పలుకరించలేదని" అంది రాజ్యంతో. రాజ్యం నవ్వింది... "నిజమే! ఆమె తిట్టిన తిట్లు మరచిపోవడం నాకు సాధ్యం కావడంలేదు"

"జరిగింది జరిగిపోయిందే! దాన్ని గురించి ఇప్పుడు పట్టింపులెందుకు? పలుకరించు. ఎవరి కుత్సితాలు వారివద్దే ఉంటాయి...." అంది భారతి.

పెళ్ళికి కావలసినవాళ్ళంతా వచ్చారు. ఇద్దరు మేనత్తలూ, వారి పిల్లలూ వచ్చారు. వియ్యాలవారు కూడా బంధుమిత్రులతో వచ్చారు. వీరి ఇంటికి ఎదురుగా ఉన్న ఇల్లే విడిదికి ఇచ్చారు. పెళ్ళిప్రయత్నాలు భారీగానే చేశారు. పెళ్ళికూతురును ఇంటికి తెచ్చారు. ఆడవాళ్ళందరూ అలంకరిస్తున్నారు. అందరూ అక్కడే కూర్చున్నారు. అక్కడ ఉండటానికి రాజ్యం మనసొప్పలేదు. మనస్సంతా వికలంగా ఉంది. తానూ ఆ పెళ్ళికూతురిలా వెలిగిపోవలసింది. కానీ, తనకా యోగ్యతలు లేకుండాపోయాయి. ఆ తల్లిదండ్రులు తమ కూతురికి పెళ్ళిచేస్తున్నందుకు ఎంతో హైరానాపడుతూ ఆనందపడుతున్నారు. తన పెళ్ళి గురించి స్వయంగా సిగ్గువిడిచి తనే అడిగినా వద్దని కసురుకుంటున్నారు. వారి ముందు చూస్తూ కూర్చునే ఓపికలేక, హాస్టల్ వరండాలో మంచం వేయించుకుని పడుకుంది. అందరూ రాజ్యం కోసం వెతికారు. చివరకు హాస్టల్లోచూసి రానంటున్నా బలవంతంగా తెచ్చారు. పెళ్ళికూతురు గదిలో కూర్చుండబెట్టారు! రాజ్యాన్ని చూసి ఆమె అత్త, "దీనికి ఈ రాతలేకుండా పోయిందే!" అంది కంట తడిపెడుతూ. అన్నకంటేముందు చెల్లెళ్ళకు పెళ్ళిళ్ళు కావడం సహజం. కానీ తమ్మునికి పెళ్ళవుతుంటేఅక్కకుకావడంలేదని ఆమె బాధ. కళ్ళల్లో తిరిగిన నీటిని బలవంతంగా అణచుకుంది రాజ్యం. వాళ్ళందరూ

సుఖమో, దుఃఖమో సంసారాలు లాగుతున్నారు. తనకు రెండూ దూరంగానే ఉన్నాయి.



# 6

పెళ్ళి బాగా జరిగిపోయింది. పెళ్లికూతురు పొట్టిదే అయినా, వయసుకుతగ్గ ఆకర్షణ ఉందనుకుంది. పెళ్ళి అయిపోతూనే వెళ్ళి హాస్టల్లోనే పడుకుంది. ఇంటినిండా బంధువులు అటూ ఇటూ తిరుగుతున్నారు. ఎక్కడి వస్తువులక్కడ పడి వున్నాయి. వాటి మధ్య కాలు పెట్టడానికి కూడా సందులేదు. వారి ఆనందంలో పాలుపంచుకోలేకపోతున్నది. తన బాధ ఏకాంతంలోనే బయటకు కక్కాలి. మంచంలో పడుకుని తనివితీరా ఏడ్చింది. ఆ ఏడ్పు తర్వాత ఒకరకమైన నిర్మలత్వం ఏర్పడింది.

పోస్టుమాన్ ఉత్తరం తెచ్చి ఇచ్చాడు. అది మధునుండి వచ్చింది. ఆ ఉత్తరం చూసిన తర్వాత అంత బాధలోనూ ఆశ పుట్టింది. లేచి కూర్చుని కవరు చింపి చదివింది. మరోసారి కలిసి మాట్లాడదామనీ, ఎప్పుడు వీలవుతుందో చెప్పమని రాశాడు. కవరు మడిచి జాకెట్ లోపల పెట్టుకుంది. ఎలా, ఎప్పుడు కలిస్తే బాగుంటుందో ఆలోచిస్తూ కళ్ళు మూసుకుంది.

పెళ్ళివాళ్ళు వెళ్ళిపోయారు; వున్న బంధువులూ వెళ్ళిపోయారు. ఇంట్లో మిగిలింది అనసూయ ఒక్కతే. పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకూ అత్తవారింటికి వెళ్ళారు. తన తండ్రితో తన విషయం కదుపుదామనుకుంది రాజ్యం. ఆయనతో అటో ఇటో తేల్చుకున్న తరువాతనే, తన బాట తాను తీసుకోవడం మంచిది. అలాగే అక్కతో కూడా మాట్లాడదామనుకుంది. ఈ నాలుగు రోజులుగా అందరూ పలకరించుకుంటున్నారు.

కాఫీ తాగి ఉదయమే దొడ్డివాకిట కూర్చుంది. హాస్టల్ పిల్లలు మిరపకాయలు పొడిచేసుకోడానికి రోలువద్ద కుస్తీ పడుతున్నారు. అనసూయ ఇంట్లో వంటపనిలో నిమగ్నమయింది. ఇద్దరు మనుషులు ఆమె కూర్చున్న చోటుకు వచ్చారు. వారిలో ఒకడు ఊరిచాకలి; రెండవ వ్యక్తి ఎవరో ఆమెకు తెలియదు. ఊరిచాకలి ఆమెనుచూపి... "ఈమే రాజ్యలక్షమ్మ!'' అన్నాడు రెండో వ్యక్తితో. ఆవ్యక్తి పలకరింపుగా నవ్వాడు. "నాది మాగులూరు, మధుపంపిస్తే వచ్చాను" అన్నాడు ఉత్తరంఇస్తూ. ఉత్తరం విప్పడంలోమునిగింది రాజ్యం! "మా బంధువే ఇతడు! ఇక్కడికి పనిఉండి వస్తుంటే ఇచ్చిపంపాడు, వెంటనే ఉత్తరం రాయమన్నాడు" అన్నాడు అతడు! అంతలోనే అనసూయబయటకువచ్చింది ఎవరూ అంటూ!

రాజ్యం వుత్తరం చీరకిందకు తీసుకుంది.

చాకలి "మా వాడేనమ్మా! బర్రెలు అమ్ముతామని నాన్న ఒకసారి నాతో అన్నాడు. కావాలంటే చూపిద్దా

మనివచ్చాను" అన్నాడు. ఆమె లోపలకు వెళ్ళింది.

వెళ్తున్నాననిచెప్పి వాళ్ళు వెళ్లిపోయారు. వుత్తరం తీసి చదివింది. అందులోనూ అదే! 'ఒకసారి కలిసి పూర్తిగా చర్చించుకుందాం!' అనివుంది.

లేచి టేబిల్‌వద్దకువచ్చి కవరు, కాగితం తీసుకుంది. కొంచెంసేపు ఆలోచిస్తూ కూర్చుంది. ఎక్కడ కలుసుకోవాలి అతడు ఇచ్చింది వినుకొండలో కలుద్దామని! కానీ అక్కడ తెలిసినవాళ్ళు చాలామంది వున్నారు. అతడితో తననుచూస్తే అంతా అల్లరవుతుంది. విజయవాడలోనే కలిస్తే బాగుంటుంది కానీ తనకు అక్కడ అవసరమేమీలేదు. ఏ విధంగా ఇంట్లోవాళ్ళకు నచ్చచెప్పాలి? వాళ్ళు అనుమానపడితే బయటకు వెళ్ళగలదా?

ఆమెకో ఆలోచనవచ్చింది. లలిత విజయవాడకు వస్తూ తనను కలుసుకొమ్మని వుత్తరం రాసేట్టుచేసిలలితకొరకు వెళ్తున్నానంటే ఎవరూ అడ్డుపెట్టరు. ఇది మంచి అయిడియానే అనుకుంది. ముందు లలితకు వుత్తరం రాసింది. తాను విజయవాడకు వస్తున్నట్లు రాజ్యాం అక్కడ కలుసుకోవాలని వెంటనే వుత్తరం రాయమంది. తేదీ వివరాలిచ్చి అలా రాయమని వుత్తరంలో రాసింది. అదేతేదీకి మధుని విజయవాడబస్టాండులో కలుసుకొమ్మని మరో వుత్తరంరాసి రెండూ పోస్టుచేసింది.

అనుకున్నట్లుగానే లలితనుండి వుత్తరంవచ్చింది. తాను విజయవాడ వస్తున్నట్లు రాజ్యాన్నివచ్చి కాలేజీ దగ్గర కలుసుకొమ్మనీ, కాలేజీ సమస్యలున్నాయనీ రాసింది. అందులోనే మరో వుత్తరంరాస్తూ "నువ్వు విజయవాడ వెళ్ళ!



పానకంలో పుడకలాగా నేనురావడం బాగుండదు. నీ సమస్య నువ్వే తేల్చుకో వాలి, మరొకరికి అవకాశం ఇవ్వవద్దు" అని రాసింది. గుండెనిండా ఊపిరిపీల్చింది రాజ్యం! తానుకూడా పస్తానని రాస్తుం దేమో? లలితముందు తాను ఏమీమాట్లాడ లేకపోతానే అని సంశయిస్తున్నది. లలిత రాదు గనక స్వేచ్ఛగా అతడితో మాట్లాడవచ్చు.

ఆరోజే సాధూరావు భార్యతోకలిసి వచ్చాడు. అత్తగారు కావలసిన సాంభనా లన్నీ పంపించారు. పట్టెమంచం, పరు పులు, డైనింగ్ టేబిల్, కుర్చీలు, స్టీలు సామాను! వాటన్నిటినీ చూస్తూ కూర్చుంది రాజ్యం! వాటిమీద చెయ్యి వేయడానికి కూడా ఇష్టపడలేదు. తనకూ అవి ఇవ్వాలి! తన తండ్రి ధైర్యంకలవాడయితే తమ్మునికి జరిపినపెళ్ళి తనకూ జరపాలి. తండ్రికి ఏనాడూ ధైర్యంలేదు. భార్య వున్నంతవరకూ ఆమెకు లొంగి, ఆ తర్వాత పెద్దకూతురుకులొంగి, ఇప్పుడు కొడుక్కులొంగి బతుకుతున్నాడు.

ఆ రాత్రికి శోభనంగది అలంకరిం చారు భారతి, అనసూయా, మరికొందరు ముత్తైదువులు. అవన్నీ చూస్తూ కూర్చుందే కానీ కాలుకూడా కదపలేదు రాజ్యం. ఆమెమనస్సులో ఒక రకమైన ఈర్ష్య, ద్వేషం ఏర్పడ్డాయి. తనకులేని సుఖం వాళ్ళు అనుభవిస్తున్నారు. వారికంటే ఎందులో తాను తక్కువని తనకా సుఖం దొరకడంలేదు?

రాత్రి ముత్తైదువులు కొత్త వధువును గదిలోకి పంపుతున్నప్పుడు బయట వరండాలో మంచంలోకూర్చున్న రాజ్యం చూస్తూనేవుంది. వాళ్లు గదిలోకి వెళ్లి చేసేదేమిటో తెలుసు! ఆ తతంగం కోసమే పెళ్ళిపేరిట వేలు, లక్షలు తగ లేస్తున్నారు. ఆ సుఖం తనకు ఎందుకు దక్కదు. దక్కకుండా చేయడానికి వీరికి హక్కేముంది? ఊపిరి బరువుగా పీల్చింది. ఇలా ఎన్నిరోజులు భరించ గలదు? రోజూ వాళ్ళు గదిలో సల్లా పాలలో మునిగిపోతే బయట తాను ఒంటరిగా వేడితో కాలేశరీరాన్ని ఎన్నాళ్ళు కంట్రోలు చేయగలదు? చేయ లేకపోతే తనే నాశనమవుతుంది. అల్లరి పెట్టవలసి వస్తుంది. దానికంటే ఇష్ట పూర్వకంగా దగ్గరవుతున్న అతన్ని చేరుకోవాలి. అతనితో చావో బతుకో కాపురం చేయాలి. తనకూ పిల్లలుకలిగితే ఆ తర్వాత వారే తనకు రక్షగా ఉంటారు. రేపటినుండి ఈ కొంప పరాయికొంపే. కొత్తవధువు ఇంట్లో అధికారం సంపా దించుకుంటుంది. అసలే తాను నడువలేని వ్యక్తి. ఇక అధికారం పోగొట్టుకోవడం ఎంతసేపు? ఆ తర్వాత తనదిక కుక్క బతుకే. వేళకు ముద్దకొరకు ఎదురుచూసే కుక్కకూ, తనకూ తేడా ఏమీ ఉండదు. అలాంటి సమస్య రాకముందే తాను బయటపడితే లేచిపోయిందన్న అపవాదు వచ్చినా తనకూ సంసారం ఏర్పడుతుంది. ఇష్టపడేవాడి ఒడిలో నిద్రించవచ్చు.

రాత్రంతా దీర్ఘంగా ఆలోచిస్తూనే ఉంది. తనపెళ్ళిచేయడంగురించి తండ్రితో చివరిసారిగా అడుగుదామని ఉదయం అనుకుంది. కానీ ఇప్పుడు మనసు మార్చుకుంది. తండ్రికి ఆ ఉద్దేశమేవుంటే తనడిగేదేమిటి? ఆయనే ముందుకువచ్చి అన్ని విషయాలూ మాట్లాడవలసినవాడు అసలు పట్టించుకోని ఆ వ్యక్తితో తాను చర్చించడంవల్ల వచ్చేదేమీలేదు. ఇక తమ్ముడు తనదృష్టిలో స్వసుఖంకోరే




త్రాష్టుడు. తనబతుకును తానె నిర్ణయించుకోవాలి. దానివల్ల సుఖపడినా, దుఃఖపడినా బాధ్యత తనదే అవుతుంది. పిళ్ళ వెక్కిరింపులూ, కోపతాపాలూ, తను పట్టించుకోకూడదు. స్థిరంగా నిర్ణయించుకుంది రాజ్యం. ఆ నిర్ణయం తర్వాత మనస్సు తేలికపడింది. ఆకాశంలో కనిపిస్తున్న నక్షత్రాలవంక చూస్తూ, కన్నీళ్ళను తుడుచుకుంది. భవిష్యత్ గురించి ఆలోచించుకుంటూ నిద్రించడానికి ప్రయత్నిస్తున్నది.

* * *

హాస్టల్ పిల్లవాడిని తోడు తీసుకుని విజయవాడకు ప్రయాణమయింది. ఆమె ఏపేరుతో వెళ్తున్నా సాహూరావుకు, అతన్ని కలుసుకోడానికే వెళ్తున్నదని అనుమానం! విజయవాడకు రాజ్యం వెళ్తున్న విషయం భారతికి కూడా తెలిసింది. తనతో చెప్పనప్పుడు అడగడం మంచిది కాదనుకుంది. ఎవరి మనస్సులో ఏమున్నా ఎవరూ బయటకు పొక్కలేదు. వందరూపాయలు కావాలంటే తండ్రి ఇచ్చాడు. వినుకొండ చేరేసరికి తొమ్మిది గంటలయింది. అక్కడినుండి ఎక్స్‌ప్రెస్‌లో విజయవాడకు వచ్చింది. బస్టాండులో రెండో ప్లాట్‌ఫారంమీద కూర్చుంది. మరో గంట తర్వాత మధు అక్కడికి వచ్చాడు. చూసి నవ్వుతూనే పలుకరించాడు.

"ఎంత సేపయిందివచ్చి?'' అన్నాడు.

''దాదాపు గంటవుతున్నది. మీరు ఇంకా రాలేదేమో అనుకున్నాను''

"నేను ఉదయం తొమ్మిది గంటలకే వచ్చాను. మీరు రావడం ఎలాగూ ఆలస్యమవుతుందని బజారుకు వెళ్ళి వస్తున్నాను" ఆమెకు ప్రక్కగా కూర్చున్నాడు. గోడకు ఆనుకుని కూర్చుంది ఆమె. వెంట వచ్చిన రఘు కొంచెం దూరంలో కూర్చున్నాడు.

"పెళ్ళి బాగా జరిగిందనుకుంటాను'' అన్నాడు. మాట కలుపుతూ ఆమె ముఖంలోకి చూశాడు. ముఖం పీక్కుపోయినట్లుంది. పెళ్లి పనులవల్ల నిద్రలేక అయి ఉంటుందనుకున్నాడు.

''బాగానే జరిగింది. మిమ్మల్ని పిలుద్దామనుకున్నాను, కానీ నా పరిస్థితులు మీకు తెలిసే వున్నాయికదా''

"పిలవకుండే ఇప్పుడు వచ్చిన నష్టమేముంది?"

రాజ్యం దూరంగా అప్పుడే వచ్చి నిలిచిన బస్సునుండి దిగుతున్న జనాన్ని చూస్తూన్నది. ఏవిధంగా కదిలించాలో ఎలా కదిలిస్తే మాట్లాడటానికి వీలవుతుందో ఆలోచిస్తున్నది. ఇక్కడ సిగ్గూ బిడియం చూపడానికి సమయం లేదు. ఏదో ఒకటి నిర్ణయం చేసుకోవాలి. అతనితో తనకు తగిన సంబంధం సరిపడదనుకుంటే ఇంతటితో కథ ముగించి, జీవితాన్ని మరో విధంగానయినా మలుచుకోవాలి.

దూరంగా కూర్చున్న రఘుకు పిలిచి రెండు కూల్‌డ్రింక్స్ పట్టమన్నాడు మధు! ''మీవాళ్ళతో ఈ విషయం మాట్లాడారా?" అన్నాడు ఆమెను చూస్తూ.

''లేదండీ! ఆ అవకాశం కూడా ఇక ముందు రాదనే నేను అనుకుంటున్నాను. వాళ్ళు నా విషయంలో అనాసక్తంగా ఉన్నారు" అంది తలవంచుకుని చీర చెంగు చూసుకుంటూ.

"నేను ముందే అనుకున్నాను. మీవాళ్ళు ఎలాగూ అంగీకరించరని. పోనీ! మీ ఉద్దేశం ఏమిటో నిర్ధారించుకున్నారా?"

రాజ్యం తల ఊపిందిగాని,సమాధానం

ఇవ్వలేదు. రఘు కూల్ డ్రింక్స్ తెస్తే ఒకటి ఆమెకు ఇచ్చి, రెండోది రఘుకు ఇచ్చాడు. తాను ఇప్పుడే తాగానన్నాడు.

"మీ విషయం ఏమిటో స్పష్టంగా చెప్పండి. ఎందుకంటే ఇది పెద్దలు అంగీకరించే వ్యవహారం కాదు. మనిద్దరి మధ్యా ముఖాముఖి తేలాల్సి ఉంది. ఇతర అవకాశాల్ని విడిచి మీ విషయమే ఆలోచిస్తున్నాను" అన్నాడు మధు.

"నేను అంగీకరిస్తున్నాను" అంది తలవంచుకునే" నేను గట్టి నిర్ణయానికి వచ్చాను. మీతో భాగస్వామ్యం పంచుకుందామని నిర్ణయం చేసుకున్నాను"

ఆమె ముఖంలోనికి చూశాడు. తలవంచుకున్న ఆమె ముఖ భంగిమలు కన్పించడంలేదు. బరువుగా ఊపిరి పీల్చి వదిలి "ఈ అంగీకారానికే ఇంతవరకూ ఎదురు చూస్తున్నాను. ఇంకా అనుమానాలుంటే అడగండి. మీ అనుమానాలు తీరుస్తాను" అన్నాడు. రాజ్యం తలెత్తి అతనివైపు చూసింది. నిర్మలంగా ఉన్న అతడి ముఖంలో భావాల్ని వెదకడానికి ప్రయత్నం చేసింది.

"మనది యవ్వనోద్రేకాలపొంగు కాదనే నేను భావిస్తున్నాను. ఎందుకంటే ఇద్దరం ముప్పై పైబడి వయస్సులో ఉన్నాం. ఈవయస్సులో తప్పటడుగు వేయలేము. వేశామా అది పతనమే అవుతుంది. తిరిగి కాలు తీసుకోడానికి అవకాశమిచ్చే వయస్సు కాదు. అందువల్లే నేను సుదీర్ఘంగా ఆలోచించి, మీతో వైవాహిక జీవితానికి సిద్ధపడి ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాను. మీరెలాంటివారో కనీసం విచారించను కూడా లేదు. మీరు తెలిపిన వివరాలే నేను నమ్మాను. అంగీకరించాను. నాకు జీవితంలో సెక్స్ సుఖం అందించే స్త్రీ కాదు కావలసింది! మనిషిని మనిషిగా అర్థం చేసుకుని, అనుకూలంగా బతికే ఆడ మనిషి కొరకు గాలించాను. ఆ లక్షణాలు మీలో కన్పించిన తర్వాతే ఒక నిశ్చయానికి వచ్చాను'' అన్నాడు మధు.

"నేనూ అదే నిర్ణయించుకున్నాను. నాకూ తెలుసు ఏ వయస్సులో ఉన్నానో అవిటి తనాన్ని ఎత్తి చూపకుండా, నా జీవితానికి ఓ గమ్యం కల్పించి, నన్ను నన్నుగా అర్థం చేసుకుని, నడుచుకునే వ్యక్తి కొరకే నేను ఇంతకాలం ప్రయత్నం చేశాను. నా అదృష్టమే అనుకోండి మీరు తారసపడ్డారు. ఎందరో వ్యతిరేకించారు. కుంటి దానివి నిన్ను ఎన్ని రోజులు ఉంచుతాడు? ఎక్కడో అమ్మేస్తాడు చివరకు! వాడుకుని విడిచి పెడతాడు అంటూ! అవన్నీ నిర్లక్ష్యంగా తోసేశాను. అంత మోసమే జరిగితే ఈ దేశంలో ఆడది ఏంచేస్తుందో నేనూ అదే చేసుకుందామనుకున్నాను" అంది దూరంగా చూస్తూ.

"మీరు భయపడవలసిన అవసరం లేదు. నానీతి నాకుంది. ఎవరి నడిగినా ఆ విషయం చెబుతారు. అవిటి వ్యక్తిని చేసుకుంటే ప్రభుత్వం మూడువేల రూపాయలు ఇస్తుంది. ఆ ముష్టి డబ్బుల కొరకు కూడా నేనుచెయ్యిచాపను. వాళ్ళిచ్చే డబ్బులకు ఆశపడేవాళ్లు అవి దొరికిన తర్వాతడబ్బుతోపాటు స్త్రీని కూడా మింగేస్తారు. నా ఆశయాలకనుగుణంగా నడుచుకోడానికి నేను సిద్ధంగా ఉన్నాను"

క్రమంగా వారి మధ్య అనుమానాలు దూరం చేసుకున్నారు.

ఇద్దరూ నిశ్శబ్దంగా జనాన్ని చూస్తూ కూర్చున్నారు.

"రాత్రికి ఇంటికి వెళ్ళిపోతారా?" అన్నాడు మధు.

"ఎలా వెళ్తాం! ఇప్పుడే మూడు గంటలు కావస్తున్నది. అక్కడ మాకు బస్సు సౌకర్యాలు కష్టం"

"మరి రాత్రి ఇక్కడ ఉండాలంటే తెలిసినవాళ్ళున్నారా?"

"ఎవరూలేరు. వెళ్ళదలచుకుంటే మా కాలేజీ హాస్టల్‌కు వెళ్ళాలి. అక్కడి వర్కర్సు పరిచయమే. పాత స్టూడెంట్స్ ఎవరయినా ఉండవచ్చు"

"మళ్ళీ అక్కడికి వెళ్ళడమెందుకు? ఏదయినా లాడ్జిలో రూం తీసుకుంటాను. ఈరాత్రి అక్కడే ఉండి ఉదయం బస్సుకు వెళ్ళొచ్చు" అన్నాడు మధు.

రాజ్యం తల ఊపింది!

బస్టాండు ఎదురుగానేవున్న లాడ్జిలో రెండురూములు బుక్ చేశాడు. రిక్షాను బస్టాండులోకి తెచ్చి ఆమెను ఎక్కించుకుని తీసుకువెళ్ళాడు. ఒక రూంలో ఆ ఇద్దరినీ ఉండమన్నాడు. పిల్లవాడికి బెడ్ వేయించాడు.

"స్నానం చేస్తారా?" అన్నాడు మధు బయటకు వెళ్ళడానికి సిద్ధపడుతూ.

"తర్వాత చేస్తానులెండి మనమధ్య ఆ గౌరవ సూచకాలు ఎందుకు? ఎబ్బెట్టుగా ఉంటుంది" అంది ఇష్టంలేనట్లు. మధు నవ్వాడు.

"రాజ్యంగారూ! నాకు కొన్ని నియమాలున్నాయి, నిబంధనలూ ఉన్నాయి. మన పెళ్ళి జరిగేవరకూ మీరు నాకు పరాయివాళ్ళే. అంతవరకూ గౌరవించవలసిన బాధ్యతనాది"

"కాని, మనిద్దరిమధ్య అంతరం ఉందని నేను భావించడంలేదు..."

"అంతరం ఉందనికాదు" అన్నాడు మధు తర్వాత మాట్లాడలేక.

ఆమె దగ్గరకు రాదలచుకున్నప్పుడు తాను దూరం జరగడమెందుకు? ఆ విధంగా ఆమెకు అనుమానం కలిగించడం మంచిదికాదు. అసలే అవిటి వ్యక్తి. ప్రతి విషయంలోనూ తమను ఎవరో కించపరచినట్లు ఫీలవుతూ ఉంటారు. వారిని కించపరచడంలేదన్న భావం ఏర్పర్చాలి. వారి పద్ధతిని అంగీకరించాలి. మాట వరసకయినా వారి అవిటితనం ఎత్తి చూపకూడదు. ఇవన్నీ అతడికి తెలుసు. అందువల్ల ఎదురు చెప్పకుండా మానుకున్నాడు.

బాయ్‌తో కాఫీ తెప్పించాడు. కాఫీ తాగుతూ పత్రిక తిరగవేస్తూ కూర్చున్నాడు మధు.

"మన ఆర్థిక పరిస్థితి ఏమిటి?" అంది అతడి ముఖం చూస్తూ.

"ఇంతకుముందే చెప్పాననుకుంటాను. ప్రైవేట్‌గా ట్యూషన్స్ చెబుతున్నాను. ప్రస్తుతం నికరరాబడి అదే!"

"మంచిదే. నేనూ ఏదయినా కాన్వెంటులో ఉద్యోగం చేస్తాను – ఉద్యోగం దొరికేవరకూ ఆర్థికంగా చెరికొంతా సంపాదిస్తే ఆర్థిక ఇబ్బంది వుండదు. మీ ఒక్కరి మీదనే ఆధారపడటంవల్ల ఇబ్బంది కలుగవచ్చు"

తల ఊపాడు మధు "మంచిదే ప్రయత్నం చేద్దాం ఏదయినా కాన్వెంటులో నాకు తెలిసిన కాన్వెంటులు కొన్ని ఉన్నాయి" పేపరుమడిచి పక్కనే పెడుతూ "ఇంట్లోనుండి నువ్వు ఎలా బయటకురాగలవు? వ్యతిరేకించా? వాళ్ళని ఒప్పించా?" అన్నాడు పరిశీలనగా ఆమె ముఖంలోకి చూస్తూ.

"పూర్తి వ్యతిరేకతతోనే రావాలి.

ఇంటి నుండి కట్టు బట్టలతోనే బయటకు రావాల్సి ఉంటుంది. ఇంట్లో వ్యతిరేకించి రావడమంటే వారికి ఎంత మంటపుడు తుందో ఊహించాల్సిందే"

నిజమే అన్నాడు మధు. ఈ గొడవ ఇక ఎల్లకాలం ఉండేదే, తలుచుకుంటూ బాధపడడమెందుకని లేచాడు. "సినిమాకు వెళ్దాం పద! ఎలాగూ ఈరోజు చేసే పని ఏమీలేదు..."

రాజ్యానికి ఇష్టంలేకున్నా అతనిమాట కాదనలేక లేచింది. రిక్షాలలో సినిమాహాలు ముందుదిగారు. విజయవాడలో ఎప్పుడూ సినిమాలు రద్దీగానే ఉంటాయి; పాత సినిమాలయినా, చెత్త సినిమాలయినా కలెక్షన్‌డల్ ఉండదు. కొత్త సినిమాలకు అన్నీ బ్లాక్‌టిక్కెట్లే. బుకింగ్‌లో ఒక్కటీ దొరకదు. మధు మూడు టికెట్లు బ్లాక్‌లోనే తీసుకున్నాడు. ఆ మందిలో తోసుకుంటూ పోవడంకంటే, మరో మూడు రూపాయలు పోయినా మంచిదేననుకున్నాడు.

హాలులో ఒకరి పక్క ఒకరు కూర్చున్నారు. ఆమెకు తగలకుండా తన చేతులు వళ్లో పెట్టుకున్నాడు మధు. అతని చేష్టలుచూసి తల పక్కకు తిప్పుకుని నవ్వుకుంది రాజ్యం. అతడు ప్రవరాఖ్యుడేనని తెలుసుకుంది ఇంతకు ముందే. ఇప్పుడు ఆచరణలో కూడా చూస్తున్నది. ఇదే జయధీర్ అయితే ఈపాటికి ఉన్నవీ లేనివీ కోతలుకోస్తూ కాళ్ళూ చేతులూ తగిలిస్తూ నడుంచుట్టూ చేతులు చుట్టేవాడు. మధులో ఆ ఊసే కనిపించడం లేదు. ఊపిరి బరువుగా పీల్చింది. తన భర్త సజ్జనుడూ, పత్నీ వ్రతుడూ కావాలని ప్రతి భార్యా కోరు కుంటుంది. తన సొత్తు మరొకరికి దక్క కూడదని కోరుకుంటుంది. మధులో ఆ లక్షణాలున్నాయి. ఇలాంటివాడు తన భర్త కావాలన్న తన కోరిక ఒకవిధంగా నెర వేరింది. భవిష్యత్తులో కూడా ఇదేవిధంగా అతడు ప్రవర్తించాలని కోరుకుంది.

దాంట్లో మొదలయింది. సినిమాపూర్తిగా లీనమయ్యాడు మధు! అతని ముఖంలోకి అప్పుడప్పుడూ చూస్తూనే ఉంది; తనవైపు చూస్తాడేమోనని! అతడికి ఆఉద్దేశంలేనట్లే!

ఇంటర్వెల్‌లో లేచి బయటకు వెళ్ళి కాఫీ తాగారు.

"ఎలా ఉంది సినిమా?" అన్నాడు ఆమె ముఖంలోకి చూస్తూ.

"చాలా బాగుంది..." అంది నవ్వి

"నాకు నచ్చలేదు. ఈ దేశంలో ప్రేమించడం పెళ్ళిచేసుకోవడం, పిల్లల్ని కనడం, విడిపోవడం తప్ప మనిషికి ఇంకేమీ పనిలేనట్లు చూపుతున్నారు. మనిషికి సెక్స్ అవసరమే! కానీ అది ఒక భాగం మాత్రమే! మనిషై పుట్టిన తర్వాత చచ్చేలోగా ఏదో ఒకటి సాధించి పేరు నిలుపుకోవడానికి ప్రయత్నించాలి గానీ, ప్రేమలూ, పెళ్ళిళ్ళే ముఖ్యం కాదు. అవి లేకుండా చిరస్మరణీయులైనవారు ఎందరో వున్నారు...

అతని ఉపోద్ఘాతానికి చిరునవ్వు నవ్వింది... "మీరు రచయితగా అలా చెప్పగలుగుతున్నారు సామాన్య ప్రజలకు పెళ్ళి, పిల్లలు, తిండికొరకు కష్టం చేసుకుని బ్రతకడమే పరమార్థం! అదే వాళ్ళు సాధించేది; సాధించాలనేది."

"అందుకే ఈ దేశం తగలడిపోతు న్నది..." అన్నాడు విసుగ్గా.

అతడి మాటలు వింటున్న కొంచెం తీక్షగా అతడివైపు చూస్తున్నారు.

లైట్లు ఆరిపోయాయి. సినిమా తిరిగి ప్రారంభమయింది.




"మనం కూడా ఆ ప్రేమ, పెళ్ళిళ్ళ వైపే సాగుతున్నాం కదా!" అంది చీకటిలో అతని ముఖం చూస్తూ.

"అది ఒక భాగమన్నాను కదా! అదే ముఖ్యం కాదు. నావరకూ ఈ పెళ్ళి గురించి చెప్పాలంటే, జీవితంలో ఇంత వరకూ నేను ఏమీ సాధించలేకపోయాను; నేను ఆశించింది నెరవేర్చలేనందుకు బాధ పడుతూ, ఆకార్యం నా పిల్లలయినా నెరవేర్చాలన్న భావంతో పెళ్ళి చేసుకో దలచుకున్నాను. కేవలం సెక్స్ కొరకు నేను పెళ్ళి చేసుకోడం లేదుగదా;"

అతని వాగ్ధాటికి ఆమె మాట్లాడలేక పోయింది. అతడు పెళ్ళి విషయాలు మాట్లాడేటప్పుడు, ఆర్థిక సమస్యలు మాట్లాడేటప్పుడు తడబడుతున్నాడు. కాని, సిద్ధాంతాల విషయంలో ఎదుటి వ్యక్తిని నోరు మూయించడంలో ఆరితేరినవ్యక్తిలా కనిపిస్తున్నాడు. గొప్ప రాజకీయవాది అని ఆమె విన్నది; ఇప్పుడు కళ్ళతో చూస్తున్నది. తాను సిగ్గుపడవలసినది పోయి, అతడు సిగ్గుపడుతున్నాడు తమ స్వంత విషయాలు మాట్లాడుకునేటప్పుడు ఇప్పుడు రాజకీయాల గురించి తీవ్రంగా మాట్లాడుతున్నాడు. రాజకీయాలమీద విసుగుపుట్టి పెళ్ళిచేసుకోదలచుకున్నానని రాసిన ఇతడు రేపు రాజకీయాలు వదుల్తాడా? అలా వదలకుంటే అతడి తీవ్రపరిస్థితికి తనసంసారం ఏమవుతుందో నన్న ఊహ క్షణకాలం ఆమెలో కలిగింది. అతడిలో ఎదుటిస్త్రీని రెచ్చగొట్టి వశ పరచుకుందామన్న తపనలేదు. ఇదే మరొకడయితే ... ఆమె ఊహించలేక పోయింది.

రూం చేరేసరికి పదిగంటలయింది. చన్నీళ్ళతో స్నానం చేసింది. అన్నంతిని పడకమీదకు ఒరిగింది. గుడ్‌నైట్ చెప్పి, మధు పక్కరూంలోకి వెళ్ళాడు. పోతున్న అతనివైపు దీక్షగా చూసింది. లాడ్జింగ్‌లో రూం తీసుకుందామని అతడు అన్నప్పుడు, అతడేదైనా కోరికలో ఉన్నాడా? వుంటే తన సమాధానం ఎలా ఉండాలాని ఆలోచించింది. కాని, అతడికి స్త్రీపైద కోరిక ఉందో లేదోగానీ, ప్రవరాఖ్యుడులా తలపంచుకుని పక్కకు వెళ్ళాడు...ఇతడి చేతిలో తన భవిష్యత్తు బాగుపడుతుంది. అవిటిస్త్రీని పెళ్ళి చేసుకుని చివరకు బజారుపాలు చేస్తాడని ఎందరో బెదిరించారు. అలా చేస్తారేమో తనకు తెలియదు. కాని, తనకు దొరికిన వ్యక్తి ఈ అవిటి జీవితానికి శ్రీరామరక్షలా నిలబడగల వ్యక్తి. జీవితమంతా బాధలూ, అవమానాలతో బతికిన తనకు చివరకు ఒక ఉన్నతుడి సరసన చోటు దొరికి నందుకు సంతోషపడింది.

ఉదయం ఏడుగంటలకే బస్టాండుకు వచ్చారు. ఆమె వెళ్ళవలసిన బస్సు ఎక్కి కూర్చుంది. ఆమెకు ఎదురుగా కింద నిలబడ్డాడు మధు.

"నాకు కాన్వెంటులో పనిచేయడానికి అవకాశం వెతకండి. ఇప్పటికే నా జీవితం బాధలతో డస్సిపోయింది. ఇక ఎక్కువ కాలం ఓర్చేస్థితిలోలేను. ఎంతతొందరలో మీ దగ్గరికి రావడానికివీలుంటే అంత తొందరగా వస్తాను" అంది అర్థిస్తున్నట్లుగా రాజ్యం.

తలఊపాడు మధు. "వెళ్తూనే ఉత్తరం వ్రాయి. ఆలోగా నేను అక్కడ ప్రయత్నం చేస్తాను. నా విషయంలో నువ్వు నిశ్చింతగా వుండు. జీవితంలో మాట ఇవ్వను. ఇస్తే దానికొరకు ప్రాణ మయినా ఇస్తాను" అన్నాడు.



డ్రైవర్ బస్సు ఎక్కాడు. కారు హారన్ మోగిస్తున్నాడు కండక్టర్ కొరకు. మధు చెయ్యి ముందుకుచాచాడు. కిటికీవద్ద ఉన్న ఆమె చెయ్యిని తన చేతిలోకి తీసుకున్నాడు. ప్రేమతో చెయ్యి నొక్కి వదిలాడు. రాజ్యం మనస్సు ఆనందంతో ఉరకలు వేసింది. అది ఆమెకు ధైర్యం కలిగించింది. కళ్ళలో నీరు తిరుగుతుంటే అతనివైపు చూసింది. చెయ్యివూపి నవ్వాడు మధు "చాలా తొందరలోనే మనం కలుసుకుంటాం" అన్నాడు బస్సుకు దూరంగా జరుగుతూ. బస్సు కదిలింది. కనిపించినంతవరకూ చూచింది రాజ్యం. కళ్ళలో నిలిచిన నీటితో మసక మసకగా అగుపిస్తున్నా, మళ్ళీ దొరక దేమోనని చూసింది. చివరిసారి అతడు తన చెయ్యి చేతిలోనికి తీసుకుంటాడని ఆమె అనుకోలేదు. అతడికి కనీసం ఆ ఊహ ఉంటుందని కూడా ఆమె భావించ లేదు. చివరకు పాణిగ్రహణం చేశాడు. రాత్రి నుండే అతనికి తనమీద ఒక విధ మయిన వాంఛ ఉండే ఉండవచ్చుననుకుంది. కొందరు దాచిపెట్టుకుంటారు. అలాగే ఇతడూ తన వాంఛను క్రమశిక్షణ కింద తొక్కిపట్టేసి ఉంటాడు. ఇక దూర మవుతున్నదన్న ఉద్దేశంతో కరస్పర్శ ద్వారా తన అభిలాష తెలిపాడు.

ఊరుచేరే సరికి మధ్యాహ్నమయింది. ఎప్పుడు ప్రయాణం చేసినా టౌనువరకూ బాగానే ఉంటుంది. అక్కడి నుండి ఊరు చేరడానికి బాధ! సిటీ బస్సుదొరకదు. బాడుగ బండ్లవాళ్లు పల్లెటూరికి రావడానికి ఇష్టపడరు. ఎవరయినా ఇష్టపడినా కళ్ళు తిరిగే బాడుగ అడుగుతారు. నడిచిరావ డానికి ఆమెకు సాధ్యం కాదు.




ఇంటిలో ఎవరూ ఆమెను పలుకరించ లేదు. పలుకరించరని ముందే ఆమెకు తెలుసు. వారిపలుకరింపులతో నిమిత్తం లేనట్లు భోజనం వడ్డించుకుని తిని, పడక వేసింది.

సాయంత్రం పొద్దుగుంకుతుండగా మెలకువవచ్చింది. లేచి స్నానంచేసి వసారాలో కూర్చుంది.

"కాఫీతాగుతావా వదినా?" అంది మరదలు భాగ్యం.

"ఉంటే ఇవ్వు" అంది భాగ్యాన్ని చూస్తూ. కాఫీగ్లాసు తెచ్చి ఇచ్చింది.

సూర్యం అక్కడకు వచ్చాడు "నిన్న రాలేదేం?" అన్నాడు కూతురును చూస్తూ.

"రాలేక పోయాను. అక్కడే నాలు గయింది. వచ్చినా బస్సు దొరకదని అక్కడే హాస్టల్లో ఉన్నాం రాత్రికి" అంది. లేచి బాబాయి గారింటికి వెళ్ళింది. అప్పుడే వంట పనిలో ఉంది భారతి. రాజ్యాన్ని చూసి "రా ఎప్పుడొచ్చావ్" అంది తలఊపి. ఆమె దగ్గరకువెళ్ళి బండ మీద చతికిల బడింది రాజ్యం!

"మధ్యాహ్నం వచ్చాను. వస్తూనే నిద్రాదేవి ఆవహించింది! ఇప్పుడే లేచి ఇటువస్తున్నాను"

"విజయవాడకు ఎందుకు వెళ్ళావు?"

జరిగిన వివరాలు భారతికి చెప్పింది. భారతి 'ఊ' కొడుతూ తనపని చేసుకుంటున్నది. "నేను నిర్ణయం చేసుకున్నాను అక్కా! అతన్ని పెళ్ళి చేసుకోదలచుకున్నాను. అది కూడా చాలా తొందరలోనే జరిగిపోతుంది" అంది రాజ్యం.

భారతి లేచింది. సిలెండర్ కనెక్షన్ తప్పించి, అన్నంగిన్నె కింద పెట్టింది.

"రాజ్యం! నీది నిజంగా సాహసమే! నీ పరిస్థితిలో అది తప్పదు. మేం వున్నా

మీ కుటుంబ విషయాల్లో కలుగ చేసుకుంటే, మీ నాన్నకూ తమ్ముడికీ కోపం! అందువల్ల దూరంగా ఉంటున్నాం. నీవు తీసుకున్న త్రోవ ముళ్ళ బాట! అందులో నువ్వు నెగ్గి నిలబడగలిగితే అందరం సంతోషిస్తాం! లేదా, ఓడిపోయావా నీ బతుకు పాడవుతుంది. మేమందరం ఒక చుక్క కన్నీరు విడిచేవాళ్ళమే! అసలే అవిటి దానివి! పైగా ఆర్థికస్థాయి కలిగిన వాడు కాదు అతడు! ఆ విషయం నిర్మొహమాటంగా ముందే చెప్పాడు. మీ తండ్రి నుంచి చిల్లికానీ దొరకదు. ఇవ్వరు. ఏ విధంగా నిర్ణయించుకుని ఈ సాహసం చేస్తున్నావో మరి"

రాజ్యం దృఢంగా అంది "ఒకటే సాహసం! నాకూ భర్త, పిల్లలు కావాలి. భర్తతోపాటు ఏ కష్టం వచ్చినా సహించి బతుకుతాను. ఒకవేళ ఏపరిస్థితిలోనయినా నా సంసారం చిన్నాభిన్నం కావడం జరిగితే, మళ్ళీ వీళ్ళ కొంప ఎన్నడూ చేరను. స్వర్గలోకానికి టికెట్ తీసుకోవడమే నా స్థిర నిశ్చయం"

"అంత మాటనకే" అంది భారతి బాధగా "అటువంటి పరిస్థితి నీకు వస్తుందని నేననుకోను. ఎందుకంటే ఆర్థికంగా లేకున్నా, వ్యక్తిగా అతడు చాలా మంచి మనిషని విన్నాం! అటువంటివాడు కోరి అవిటిదాన్ని పెళ్ళి చేసుకుంటున్నాడు. బాగా చూసుకోగలడు"

రాజ్యం మాట్లాడలేదు. ఆమె ఒక నిశ్చయానికివచ్చి దృఢంగా వుంది.

అక్కడి నుండి లేచివచ్చింది. వసారాలో తమ్ముడు కనిపించి పలుకరించలేదు. హాస్టల్ పిల్లలు తెలియని లెక్కలు చెప్పమంటే చెప్పిపంపించింది.





# 7

రెండు రోజులు గడిచిపోయాయి. అతడి ఉత్తరం కొరకు ఎదురు చూస్తున్న రాజ్యానికి ఉత్తరం వచ్చింది. కాన్వెంటులో ఉద్యోగం చూశాననీ, వెంటనే రమ్మనీ ఒక కాగితం మీద రాశాడు. మరో పేపరు మీద లలిత విజయవాడ కాన్వెంటులో ఉద్యోగం ఇంటర్వ్యూకు రమ్మని రాసినట్లు రాశాడు. రెండూ ఒకే కవరులో పంపించాడు. రెండూ చదువుకుని దీర్ఘంగా శ్వాసవిడిచింది. చివరకు మోసంగా ఇంటినుండి బయట పడవలసి వస్తున్నది.

తండ్రికి ఉత్తరం చూపించింది. ఆ ఉత్తరం చదివిన సూర్యం "ఇప్పుడు నీకేంతక్కువయింది? కాన్వెంటు ఉద్యోగాల్లో తినడానికి సరిపడే డబ్బులు కూడా ఇవ్వరు. గవర్నమెంటు ఉద్యోగం దొరికితే వెళ్లవుగానీ" అన్నాడు.

"నేను ఇక్కడవుండలేను నాన్నా! నాకాళ్ళమీద నేను నిలబడటానికి ఏ చిన్న ఉద్యోగమయినా మంచిదే! అందుకే నేను వెళ్లదలచుకున్నాను"

"నీవు ఒట్టిమొండిదానివే! నీవెంట అక్కడ ఎవరు వుంటారు? వచ్చే జీతం నీఒక్కదానికే చాలకుంటే, తోడువుండే మనిషికి ఇంటినుండి తెచ్చుకోవాలి"

"అవసరంలేదు. నేను ఒక్కదాన్నే వుండగలను" దృఢంగా చెప్పింది రాజ్యం.

తండ్రి చివరకు చేసేదిలేక ఒప్పుకున్నాడు.

ఉత్తరంలో తెల్పిన తేదీకి మాగులూరు చేరుకుంది. వెంట హాస్టలు బాలుడు వున్నాడు. మధు ఇంటికి రిక్షాలోవచ్చారు. వారి కొరకే ఎదురుచూస్తున్న మధు చూసి పలుకరింపుగా నవ్వాడు.

"మీవాళ్లు అనుమానపడలేదా?"

"ఏమో! అయినా నష్టమేమిటి? సాధ్యమయినంతవరకూ మన పెళ్ళి బయట పడకుండా కొంతకాలం దాచాలనుకున్నాం! వీలులేకుంటే వెల్లడికానీ"

సాయంత్రం కాన్వెంటుకు వెళ్లారు. కాన్వెంట్ ప్రిన్సిపాల్ ఆమెతో పాఠం చెప్పించాడు పిల్లలకు! తర్వాత నెలకు వందరూపాయలకు మించి ఇవ్వలేనని చెప్పాడు. ఆలోచించిచెబుతామనివచ్చారు. వంటరాజ్యమే చేసింది. ఇల్లు పెద్దదే! కానీ కిందమట్టి!గోడలుమట్టి! పైకప్పు పడిపోయే స్థితిలోవుంది. అయినా ఆమె దృష్టిలో అదే గొప్పగావుంది.

ఉన్న ఒక్క మంచంమీద ఆమెను పడుకోమన్నాడు మధు! ముందు వ్యతిరేకించినా చివరకు అంగీకరించింది. రఘు, మధుకింద చాపలు వేసుకుని పడుకున్నారు.

"మన పెళ్లి రిజిష్టర్ద్వారా చేసుకుందామా?" అన్నాడు మధు.

తల వూపింది రాజ్యం. "ఇదే మన పెళ్ళి. మన పెళ్లికి పెద్దమనుషులూ, మేజువాణీలు అవసరంలేదు. మీరు నన్ను విడిచిపెట్టదలచుకుంటే ఈ రిజిష్టరులూ, పూలదండలూ ఆపలేవుగదా! రిజిష్టర్ చేసుకుని, అనవసరంగా డబ్బు ఖర్చు





పెట్టడం ఎందుకు? ఏదీలేకుండా మనం భార్యాభర్తలం కావాలి; కాలేమా?''

తనవైపే చూస్తున్న రాజ్యం కళ్ళలోకి చూశాడు మధు. ఆ కళ్ళలో మత్తు కన్పించడంలేదు. ఏదో ఆశిస్తున్నట్లు కనిపిస్తున్నది. ఆమె దగ్గరగా మంచంలో కూర్చున్నాడు. రాజ్యంపక్కకుజరగలేదు మరింత దగ్గరగా జరిగింది. మధు ఆమె నడుంచుట్టూ చెయ్యి చాపాడు. రెండో చెయ్యితో ఆమె కళ్ళలో నిలిచిన నీరును వేలితో తుడిచాడు. రాజ్యం అతడి ఒడిలో తలవాల్చింది ఏడుస్తూ ''నా జీవితం సర్వస్వం ఈరోజునుండిమీదే. మిమ్మల్ని నమ్ముకుని బయటకు వచ్చాను - నానమ్మకాన్ని వమ్ముచేయొద్దు" అంది. ఆమె కన్నీళ్ళు అతడి లుంగీని తడిపాయి. ఆమె వీపునిమిరాడు ప్రేమగా" వికలాంగులంటే నాకెంతో అభిమానం. అందుకే కావాలని కోరాను; నా జీవితంలో బతికుండగా నీకు ఎన్నడూదూరంకాను'' అన్నాడు మధు. వీపు నిమురుతున్న అతడి చెయ్యి ఆమెకు అభయముద్రగా అన్పించింది. సంతృప్తిగా అతడిలో లీనమయింది రాజ్యం.

లేచేటప్పటికి ఎండ బాగా వచ్చింది. మధు ఇంటిలోలేడు. తలుపులు తెరచి వున్నాయి. మంచంనుండి కిందికి దిగి రఘును లేపింది. రఘు దిగ్గునలేచి కూర్చున్నాడు. ఆమెమాటలకు వసారాలో వున్న మధులోపలకు వచ్చాడు. అతన్ని చూచి సిగ్గుతో తలదించుకుంది.

"దొడ్లో నీళ్లున్నాయి,స్నానంచేసిరా!" అన్నాడు మధు.

రాజ్యంలేచి దొడ్లోకి వెళ్ళింది. తలస్నానంచేసి వచ్చింది. ఆరవిప్పుకున్న ఆమె కురుల్ని చూస్తూ కుర్చీలో కూర్చున్నాడు మధు. అతడి కళ్ళలో కళ్లు కలపలేక పక్కకుతిరిగి చిక్కు తీసుకుంటూ మంచంమీద కూర్చుంది.

''రఘూ! ఈ పూటకు హోటల్‌కువెళ్లి కాఫీ, టిఫిన్ పట్రా'' ఫ్లాస్కు ఇచ్చి పంపాడు మధు.

"ఊరికివెళ్ళడం ఎందుకు? రఘుని పంపించు" అన్నాడు మధు.

"వెళ్ళాలి. వాళ్లకు బుద్ధి వచ్చేలా చెప్పిరావాలి" అంది రాజ్యం.

''అనవసరంగా వాళ్లతో తగవు పెట్టుకోకు''

"తగవెందుకు? మన పెళ్లి జరిగిపోయిందని చెప్పడంలేదు- ఉద్యోగం దొరికింది, నా వస్తువులు నాకివ్వమని అడుగుతాను. కనీసం ఆ వస్తువులయినా తెచ్చుకుంటాను... వాళ్ళకెందుకు విడిచిపెట్టాలి?''

"అవి లేకుంటే మనం బతుకలేమా?"

''బతగ్గలము; అయినా ఎందుకు విడిచిపుచ్చాలి?"

రఘు వచ్చాడు. ఫలహారం చేసిన తర్వాత ఊరికి ప్రయాణమయింది.

''ఎప్పుడువస్తావ్?" అన్నాడు గుచ్చి చూస్తూ.

రాజ్యం నవ్వింది. "రేపేవస్తాను. మీకు దూరంగా ఒక్కరోజు వుండాలన్నా నాకు ఇష్టంలేదు" మధు తల వూపాడు. బస్సెక్కించాడు.

"నాకు ఉద్యోగం దొరికిందినాన్నా" అంది రాజ్యం తండ్రి పక్క కూర్చుని.

"జీతం ఎంత ఇస్తామన్నారు"

ప్రస్తుతం "రెండొందలు ఇస్తామన్నారు".

"రెండొందలు మనకు ఇంట్లో కాఫీపొడికి చాలవు. ఆ ఉద్యోగం చేయమని



ఎవడేడ్చాడు? ఉద్యోగం వద్దూ. ఏంవద్దు నోరుమూసుకుని ఇంటిదగ్గర పడిఉండు." అన్నాడు సాధూరావు కోపంతో.

సాధూరావుకు ఇదంతా అనుమానం కలిగిస్తూనే ఉంది. విజయవాడకు ఇన్ని సార్లు వెళ్ళిందంటే ఉద్యోగ సమస్యకాదు. మరేదో ప్రత్యేక కారణాలున్నాయని భావించాడు. సూర్యానికి కూడా అనుమానాలున్నా, బయట పెట్టలేదు.

"నువ్వెవడివి మధ్యన! నా జీవితం నా ఇష్టం! రెండొందలకే చేస్తానో, ఊరికే ఉద్యోగం చేస్తానో, నువ్వు అడ్డుపెట్టాల్సిన అవసరం, సలహా ఇవ్వవలసిన పనీ లేదు"

"ఇలా తెలివి తక్కువ కూతలుకూస్తే ఇంట్లోనుండి చిల్లిగవ్వ తీసుకొనిపోలేవు"

"మీ తాత ఆస్తి కాదు ఇది! అందరికీ భాగం ఉంది. ఎందుకు రాదో నేనూ చూస్తాను"

సూర్యం ఇద్దరి మీదకేకలేశాడు. భగభగ మండుతున్న మంటను ఆపలేక సాధూరావు విసురుగాబయటకుపోయాడు. "నీకు మదమెక్కింది. దానితోనే నీవు నాశనమవుతావు" అన్నాడు వెళ్తూ తచ్చుగా!

రాజ్యం తండ్రిమీద కేక లేసింది. "ఒక అక్కను మాట్లాడే మాటలా వాడు మాట్లాడేది? వాడికెంత హక్కుందో నాకూ అంత ఉంది. మధ్యన నీకు నోచులేక నన్నూ బాధ పెడుతున్నావ్"

సూర్యం మాట్లాడలేదు. భారతీ వాళ్ళు చూస్తూన్నారే కానీ, కలుగ చేసుకోలేదు. రాజ్యం అరుపులు చూస్తే, ఇకవెళ్ళి పోవడానికే నిర్ణయించినట్లుంది. తాము కలుగ చేసుకుని ఏమని చెప్పాలి? ఒకరికి చెబితే ఒకరికి మంట.

తానిహ ఆ ఇంట్లో వుండదలుచుకోలేదని తండ్రికి చెప్పింది "నేను వెళ్తున్నాను. నా జీవితాన్ని గురించి ఒక్కక్షణమయినా ఆలోచించనివారు వుండే ఇంట్లో నేను వుండి లాభమేమిటి? మీ సుఖాలు, మీ ఆనందాలే మీకు సర్వస్వం! నాకూ ఆ ఆనందం, సుఖాలు మాత్రం వద్దా?" అంది రాజ్యం. అతడు పలుకలేదు. హాస్టల్ పిల్లలను పిలిచి తన మంచం దుప్పట్లు, వంటవండుకోడానికి సరిపడే గిన్నెలు కొన్ని సూట్‌కేసులలో సర్దించింది.

"నాకు జీతం వచ్చేవరకూ తిండికి కావాలి. డబ్బులివ్వు" అంది తండ్రితో. సూర్యం జేబులోనుండి మూడువందలు తీసి ఇచ్చాడు "అనవసర తగాదాఎందుకే ఇది నీ ఇల్లేనే! ఇక్కడ నీకు హక్కు లేదని ఎవరంటారు?" అన్నాడు బాధగా.

బస్సులో సామాన్లు వేసుకుని సాయంత్రానికి మాగులూరు చేరుకుంది.

రాజ్యం క్రమక్రమంగా తనపుట్టింటి విషయాలే మరచిపోయింది. వారినుంచి ఎలాంటి సహకారం, జాలి, అభిమానాలు ఆమె కోరదలుచుకోలేదు. పోయిందేచాలులెమ్మని తమ్ముడు సంతోషించాడు. పైగా మదమెక్కి ఎవడినో లేపుకెళ్ళిందని అతడే ప్రచారం చేశాడు. ఆవిధంగా భవిష్యత్తులో తిరిగి ఊరు చేరకుండా చేయాలని అతడి వుద్దేశం. రేపు తిరిగి ఆస్తి, ఇల్లు కావాలంటుందేమోనని అతడి భయం!

ఆర్థికంగా స్థాయిలేకున్నా మధుకు మంచి మనస్సుంది. అతని తోడులో ఆమె జీవితం నెమ్మదిగా ముందుకు సాగిపోతున్నది. కానీ, లొంగిపోయే వాడికంటే, పట్టుదలగలవాడికే జీవితం కష్టభూయిష్టంగా ఉంటుంది.




కాన్వెంటులో చేరాలనుకున్న ఆమె అందులో చేరలేకపోయింది. మధు నడుపుకుంటున్న కాన్వెంటు అర్థాంతర రాజకీయాలవల్ల నిలిచిపోయింది. ఆమె మరో కాన్వెంటులో నెలకు వందరూపాయలు సంపాదిస్తే సంసారం గడవటం కష్టమే అవుతుంది. అందువల్ల అక్కడ నిలవడానికి కష్టమయిపోయింది. అక్కడినుండి మరో ప్రాంతంలో ఎక్కడయినా కాన్వెంటు పెట్టుకోడానికి నిశ్చయించుకున్నారు.

మధుస్థానిక రాజకీయాలనుండి దూరంగా పోతేగానీ, తాను వ్యతిరేకతల్ని పోగొట్టుకోవడం సాధ్యం కాదన్న ఉద్దేశంతో అక్కడికి దగ్గరలోవున్న మరో పల్లెలో గ్రామస్థుల సహకారంతో కాన్వెంటు నడుపుకోడానికి నిశ్చయించుకున్నాడు. అక్కడికి వెళ్ళి స్థానికులను కలిసి మాట్లాడాడు. అంతకు ముందే అక్కడ ఒక కాన్వెంటువుంది. జల్సారాయుళ్ళలో ఆ కాన్వెంటు టీచరు ఒకడని గ్రామంలో ముద్రపడింది. జూదం, తాగుడు, వ్యభిచారంలో, గ్రామస్థులలో ప్రథమస్థానం సంపాదించుకున్నాడు. అతడిపీడవదిలించుకుని గ్రామస్థులు నెమ్మదిగా కూర్చున్నారు. ఆ పరిస్థితిలోనే మధు అక్కడికి వెళ్ళాడు. కాన్వెంటు టీచర్లంటే. తిరుగుబోతులు, లుచ్చారకాలని ఆ గ్రామస్థుల దృష్టిలో పేరు నిలబడిపోయింది. ఎక్కడా గతిలేకనో, ఏ ఉద్యోగం దొరకకనో, చివరకు నాలుగు మెతుకులు తినడానికి దొరకక పోవడంవల్లనో పిల్లలకుప్రైవేటు చెప్పుకుంటారనీ, అందువల్లనే వాళ్ళు జులాయిగా తయారవుతారనీ వారి భావన! దానికి తగ్గట్టే నాలుగునెల్లకో వూరు మారుస్తూ ఈ ప్రైవేటుమాష్టరు, ఎక్కడా నిలకడలేకుండా తిరగడం కూడా వారి అనుమానాలకు ఊతమిచ్చింది. అందువల్లే మధు అక్కడికి వచ్చినప్పుడు అతన్ని అవహేళన చేశారుకొందరు. స్థానికంగా అతని రాజకీయాల్ని ఆమోదించేవారుఉండడంవల్ల కొందరు వ్యతిరేకించినా కొందరు అతన్ని ఆహ్వానించడానికి సిద్ధపడ్డారు. తత్ఫలితంగానే ఆవూరికి రాజ్యంతో పాటు వచ్చాడు.

ఒక ఊరునుండి మరో ఊరికి మారడం రాజ్యానికి ఇబ్బంది అయింది. ఎక్కడికివెళ్ళినా ఆమెకు లెట్రిన్ సమస్య ప్రధానమయింది. పట్టుమని పది గజాలు కూడా నడవడం సాధ్యం కాని స్థితిలో, నికరంగా ఒక చోట ఉండకుంటే కష్టపడవలసి వస్తున్నది. ఆ విషయం మధుకూ తెలుసు. ఆర్థికంగా తాను పుంజుకునే వరకూ కొంత కష్టపడక తప్పదని, తనకు తాను చెప్పుకుని ఆమెకూ నచ్చచెప్పుకున్నాడు.

మాగులూరులో బండిలో సామాన్లు వేసుకుని రాత్రి పదిగంటలప్పుడు బయలుదేరారు. ఒంటెద్దుబండి ఊగుతూ నడుస్తున్నది. గతుకుల రోడ్డులో బండి ఎక్కడ పడిపోతుందోనన్నట్లుంది. వర్షాకాలం కావడంవల్ల తోవంతా బురదమయం. పైన ఆకాశంలో మబ్బులు కమ్ముకున్నాయి. ఎప్పుడు వర్షం పడుతుందో తెలియకుండా వుంది.

బండి ఓ మైలు దూరం వెళ్ళేసరికే వర్షం చినుకులు ఆరంభమయ్యాయి. మధు విసుగ్గా ఆకాశంవైపుచూశాడు. వర్షం బాగా వచ్చే సూచనలు కనిపిస్తున్నాయి. ఈ వర్షంలో తాము గ్రామం చేరగలరా? అన్న సందేహం వచ్చింది. వర్షం తుంపర్లతో పాటు ఉరుములు, మెరుపులు ఆరంభమయ్యాయి. గాలి కొద్దిగా వీస్తున్నది.



బండికి పైన టాపులేదు. మంచాలు వెల్లకి లావేసి వాటిపైన కూర్చున్నారు. ముందు వైపు, పెట్టెలు మూటలు ఎత్తుగా పెట్టారు రానురాను ఈదురుగాలులుతీవ్రమయ్యాయి. రాజ్యం చుట్టూ చూసింది. బండినితోలే మనిషే సరిగ్గా కన్పించడంలేదు. ఇక చుట్టూ ఏం కనిపిస్తుంది. చిమ్మచీకటి. అటువంటి సమయంలో ఆమె ఎన్నడూ ప్రయాణం చేయలేదు. కాగా, అసలు అటువంటి జీవితాన్ని ఆమె ఎన్నడూ ఎంచుకోలేదు. కోరుకోని ఆ జీవితం అనుభవించడానికి బాధ పడుతున్నది. కండ్లనుండి జల జల కన్నీళ్ళు రాలి, వర్షంతో తడిసిన గుడ్డలమీద పడుతున్నాయి. తను నమ్ముకుని బయటకు వచ్చింది ఎండమావుల్నా. జీవితాన్ని సుఖంగా గడుపుదామని బయటకు వచ్చిందే. కానీ ఇక్కడ కష్టాలే ఎదురవుతున్నాయి. రేపు ఎప్పుడయినా సుఖందొరుకుతుందో లేదోగానీ, ఇప్పుడు ఈ కష్టం భరించడం సాధ్యం కాకుండా ఉంది.

''రాజా'' చిన్నగా పిలిచాడు మధు. తలతిప్పి అతనివైపు చూసింది. చీకట్లో ముఖం సరిగ్గా కన్పించడం లేదు.

"ఈ జీవితం నువ్వు కోరుకొని ఉండవు'' అన్నాడు మధు. రాజ్యం జవాబు చెప్పలేదు. కోరుకోని మాట నిజం. ఆమాటలంటే అతడు ఎంత బాధ పడతాడో? అతని తప్పేముంది? మొదటి నుండీ తనను గురించి తెలియచెప్తూనే ఉన్నాడు. తనను మోసం చేయలేదు. ప్రగల్భాలూ పలుకలేదు. తానే తెగించింది. ఏదో ఉద్యోగం చేసుకున్నా ఇద్దరం సుఖపడవచ్చని ఆశించింది. కాని అది దగ్గరలో కన్పించడంలేదు.




"ఎప్పుడూ సుఖాలే ఉండవు. అలాగే ఎన్నడూ కష్టమే ఉండదు. మనం భవిష్యత్తులోతప్పకుండా పుంజుకుంటాము అంది రాజ్యం మెల్లిగా అతనికి ధైర్యం చెబుతూ. ఆమె చెయ్యి చేతికి తీసుకుని నిమిరాడు. అతి చల్లగా ఉందా చెయ్యి! శరీరం వణకుతోంది. అతని ఒడిలోకి చేరి రొమ్ముమీదతల ఆనించింది. గుండె శబ్దం వింటూ కళ్లు మూసుకుంది. శరీరం వెచ్చబడుతున్నది. బరువుగా ఊపిరి పీల్చి వదిలింది.

"నెలకు మనకు ఎంత రాబడివస్తుందంటారు?" అంది ముఖంలోకి చూస్తూ.

"మూడు వందలకు తగ్గకుండా చూస్తామన్నారు. ఇది తాత్కాలికమే"

మూడు వందలు అంటే రోజూ పది రూపాయలు. ఒక వ్యక్తి కష్టం చేసుకుని మూడు గంటల్లో సంపాదించే విలువ! దాని కొరకు ఇద్దరు చదువుకున్నవారు రోజుకు ఆరు గంటలు పిల్లలముందు అరచి, అరచి తల పట్టుకోవాలి! ఈ చదువులు చదువుకుని ఉద్యోగం దొరక్క ఈ బాధలు పడటంకంటే, కాయ కష్టం చేసుకుని బతుకవచ్చు. చదువుకు పెట్టిన పెట్టుబడి అయినా మిగులుతుంది.

"సౌకర్యాలయినా బాగుంటాయా!"

"లెట్రిన్‌సమస్య మామూలే బోర్‌వెల్ ల్ట్రిన్ ఏర్పాటు చేసుకోమన్నారు. ఓ వంద రూపాయలు ఖర్చుపెడితే సరిపోతుంది. ప్రధానంగా మనల్ని అభిమానించే వాళ్ళు కాబట్టి పెద్ద బాధలు పడవలసిన పనిలేదు"

'అంటే చిన్నబాధలు తప్పవన్నమాట అనుకుంది.

తెల్లారి ఏడు గంటలకు ఆ గ్రామం చేరింది బండి. అంతవరకూ అతడి ఒడిలో ప్రస్తుతం జరిగే బాధల్ని పక్కకునెట్టి

భవిష్యత్ కొరకు మంచి కలలతో పడు కుంది.

తడిసిముద్దయిన గుడ్డల్ని విదిలించు కుని ఒక పక్కగా కూర్చుంది. పొలాల వైపు జనం వెళ్తున్నారు. వాగులు సందడి చేస్తూ పారుతున్నాయి.

అంతకు ముందే మాట్లాడుకున్న ఇంటి వద్దకు బండివచ్చి ఆగింది. పల్లె టూర్లలో కొత్తవాళ్లు వస్తే ఆసక్తితో చూస్తారు. పైగా ఇంతవరకూ ఆ గ్రామం వాళ్ళు సర్కారు బడిలోగానీ, ప్రైవేటు బడిలోగానీ పంతులమ్మను చూడ లేదు ఆసక్తిగా చూస్తున్నారు. పిల్లలు దూరంగా కొందరు, దగ్గరగా కొందరు నిలబడి చూస్తున్నారు. ఆమెను కిందకు దింపి అరుగుమీద కూర్చోబెట్టాడు. ఆడవాళ్ళు చాలామంది అక్కడికివచ్చి ఆమెను గుచ్చిగుచ్చి చూస్తున్నారు. బండివాడు సామానులుదింపాడు. మధు ఒక్కొక్కటే లోపల పెట్టాడు. ఆమెకు చెయ్యిసాయం ఇచ్చి లేపి, ఇంట్లోకి తీసుకెళ్ళాడు.

పక్కింటి బసవమ్మ ఒక చెంబుడు పాలు, ఒక చెంబుడు పెరుగు తీసుకుని వచ్చింది. స్టౌవెలిగించే ఓపికకూడా ఆమెకులేదు. మధు స్టౌవెలిగించి గిన్నెతో పాలు వెచ్చ చేశాడు. ఆపూటకు పట్టిపాలు తాగారు.

తెలిసినవ్యక్తి కొరకు మధు ఊరిలోనికి వెళ్ళాడు. బసవమ్మ అక్కడికి వచ్చింది.. ఏమిటమ్మా మీరు?" అంది. "రాజ్యం చిరునవ్వుతో చెప్పింది. పల్లెటూళ్ళలో కులం ప్రధానం! దాన్నిబట్టే సహాయ సహకారాలు ఉంటాయని ఆమెకు తెలుసు. బసవమ్మ ముక్కుమీద వేలేసుకొని "అయ్యో నిన్ను చూస్తే బ్రాహ్మలమ్మాయి లాగున్నావు. అందుకే మా కాఫీ తాగు తావో లేదోనని పాలు తెచ్చాను. ఇంకేం? మనవాళ్ళమ్మాయివే నన్నమాట. ఈ పూటకు వంట సంగతి ఆలోచించొద్దు నేను చేస్తాను" అంది.

"వద్దమ్మా! ఎంతసేపు చేసుకుంటాం అసలే పుల్లలు ఈ వర్షానికి మండవు. మాకొరకు మీరు బాధపడటం ఎందుకు?"

"మేము చేసుకొని తినడంలేదా అందులోనే మీరూ తింటారు. మాష్టారు ఇంతకు ముందే మాకు బాగాతెలుసు..." అంది లేచివెళ్తూ.

నిజానికి వంటచేసే ఓపికలేదు. అక్కడ మధు వంటచేస్తే చుట్టూ అమ్మ లక్కలు నోరు నొక్కుకుంటారు. ఈ పూటకు ఆమె చేసే వంటతో సరిపెట్టడమే మంచిదని భావించింది. మరో గంటలో మధు, మరొక వ్యక్తి అక్కడకువచ్చారు. రాజ్యం లేచి కూర్చుంది.

"ఈయనపేరు అంజయ్య. ఈ గ్రామంలో నాకు ప్రధాన స్నేహితుడు" అంటూ పరిచయం చేశాడు.

"ఇక్కడ మీకేం భయంలేదండీ మీకు ఏసహకారం కావలసివచ్చినా మేం చేస్తాం. మీరు ఇక్కడే స్థిరపడండి" అన్నాడు అతడు మంచంలోకూర్చుంటూ.

ఆమె బదులుగా చిరునవ్వుతో సరి పుచ్చింది. పరాయి మొగవాళ్ళతో మాట్లాడడం ఆమెకు మామూలే అయినా, ఇలాంటి పల్లెటూళ్ళలో, ముక్కూమొగం తెలియనివాళ్ళతో ఎలా ప్రవర్తించాలో తెలియదు. అందువల్ల ఎవరు వచ్చి మాట్లాడుతున్నా జవాబుగా మౌనమే పాటిస్తున్నది. అతను పిచ్చాపాటి మాట్లాడి వెళ్ళిపోయాడు.

బసవమ్మ అక్కడికే అన్నం తెచ్చింది. ఇద్దరూ తిని ప్రయాణ బడలికతో పడుకున్నారు.



మరుసటిరోజు పాతికమంది పిల్లలు వచ్చారు. వారిలో ఇద్దరు ఏమీలేని పిల్లలు కాబట్టి, ఉచితంగా చెప్పాల్సివచ్చింది. మిగిలినవాళ్ళకు నెలకు పది హేను రూపాయల చొప్పున ఇవ్వడానికి నిర్ణయించుకున్నారు గ్రామస్థులు.

ఒక్క నెలలోనే ఆమె చదువు బాగా చెప్పగల వ్యక్తిగా పేరుతెచ్చుకోగలిగింది. మధును గురించి గ్రామంలో ఎవరూ పెద్దగా పట్టించుకోలేదు ... ఆమె విషయంలో చదువు బాగా చెపుతుందని పేరురావడంతో గౌరవ మర్యాదలెక్కువ అయ్యాయి. ఆడమనిషి, అవిటి మనిషి ఇల్లుదాటి ఎక్కడికిపోవడానికి వీలులేని మనిషి. అందువల్ల పిల్లల విషయంలో తగిన శ్రద్ధ తీసుకుంది. మధుకు ఈ కాన్వెంట్లపట్ల విసుగు ఏర్పడింది. ఎప్పుడూ పిల్లలముందు వాగి వాగి తల పగులగొట్టుకోవలసిందే! వచ్చేది తిండికి చాలదు. రాజకీయంగా పతనమై, ఆర్థికంగా చితికిన తరువాత తిండికొరకు విద్యాధికులు ఎన్నుకునే మార్గమే - అతడూ ఎన్నుకున్నాడు. ఈరోజు పిల్లల బాధ్యత ఆమె వహిస్తున్నది. అందువల్ల అతనికి పిల్లలముందు పెద్దగా అరవవలసినపని లేదు. తిరిగి రాజకీయాలవైపు మొగ్గాడు. ఆ గ్రామం రాజకీయాలకు తలమానిక మైంది. విప్లవ రాజకీయాలలో అక్కడ నలుగురు ఎన్‌కౌంటర్ కూడాచేయబడ్డారు. ఆ కేసులలో గ్రామంలో దాదాపు వంద మంది ఒకసారిగా జైలుకు తోయబడ్డారు. పోలీసులకు ఎప్పుడూ ఆ గ్రామం మీద ఒక కన్నుంది. అంజయ్య అనేక కేసులలో ఇరుక్కొని సంవత్సరాలతరబడి లాకప్‌లలో, సబ్‌జైళ్లలో మగ్గి, చివరకు విసుగుపుట్టి అతడూ ఈమధ్యనే పెళ్ళి చేసుకున్నాడు. అంతకుముందు సంవత్సరంపాటు అతడు కన్పించకపోతే అతడి తల్లి చనిపోయాడని నిర్ణయించుకుని, సంవత్సరీకం కూడా పూర్తి చేసింది.

రాజకీయాలకు ఆలవాలమైన ఆ గ్రామంలో, పోలీసు నిర్బంధం వల్ల తాత్కాలికంగా అణగిపోయినా, అంతర్గతంగా ఆ భావాలున్నవాళ్ళు ఆలోచిస్తూనే ఉంటారు. రాజకీయంగా కొంత స్థాయితో తిరిగిన మధు అక్కడికి రావడంతో తిరిగి ఒకరితో ఒకరు సమాలోచనలు మొదలు పెట్టారు. వాళ్ళతో కలిసి తిరుగుతూ ఉంటే మామూలు పరిచయంగానే భావించింది రాజ్యం. కానీ తర్వాత వారి మాటలు వింటూ అర్థం చేసుకున్న తర్వాత భయపడింది. అతడు ఇంటి పట్టున వుండకుండా తిరగడం ఎక్కువవుతున్నది. రాజకీయాలు విసుగు పుట్టాయనీ, నీతినిజాయితీ కరువయిందనీ, ఆ రాజకీయాల జోలికి పోనని ఎన్నో సార్లు మాట్లాడిన మధు, ఇప్పుడు మళ్ళీ ఆరంభించాడు. దానివల్ల అతడు పడే బాధ ఒక్కడితో పోదు, తన మెడకు చుట్టుకుంటుంది. ఇంటి దగ్గర వెక్కిరింపులూ, అవహేళనలూ భరించలేక తన సంసారం ఒకటి ఏర్పరచుకుని, అందులో సుఖంగా నిశ్చింతగా దొరికింది తినిబతుకుదామనుకుంటే తిరిగి మళ్ళీ రాజకీయాలు ఆరంభించాడు.

"నాకు ద్రోహంచేస్తున్నారు" అంది రాజ్యం. మధు ఆమెవైపు చిరునవ్వుతో చూశాడు "నేను ఎవరికీ ద్రోహంచేయ లేదు. ఇంతవరకూ అయినవాళ్ళనూ, ఇంటినీవిడిచి, నాకొరకువచ్చి ఇన్ని కష్టాలు పడుతున్న నీకు నేను ఎన్నడూ ద్రోహంచేయను" అన్నాడు ఆమె తల

నిమురుతూ.

"రాజకీయాలలోకి దిగనని మాట ఇచ్చారు. తిరిగి ఆరంభించారు. కూటి కొరకుచేసే రాజకీయాలే ఒక్కొక్కప్పుడు వికటిస్తాయి. ఇక ఇలాంటి విప్లవ రాజకీయాలు భయంకరంగా వుంటాయి. మీరీవిధంగా తయారయితే నాగతేమిటి?" అంది ఏడుస్తూ. మధు జాలిగా ఆమె వైపు చూశాడు.

"నేను చేసేది కూటిరాజకీయాలే. కేవలం కూడుకొరకు ఎంత కష్టమయినా చేయడానికి వెనుకాడకుండా . పనిచేసి కూడా ఆ కూడు దొరక్క సతమతమయ్యే ప్రజలకు తిండి అందిద్దామనేదే మా ఆరాటం. డబ్బు సంపాదించడానికో కీర్తిసంపాదించడానికో పోరాడే రాజకీయాలు కావుమావి."

"కావచ్చు! మిమ్మల్ని నమ్ముకున్న వ్యక్తికి అవి బాధకలిగిస్తాయి"

ఆమెచెయ్యి చేతికి తీసుకుని నిమిరాడు.

"రాజీ! జీవితం విచిత్రమైందని అనేక మంది అనేక కాకుకూతలు కూస్తుంటారు. అది విచిత్రమైందికాదు.సాఫీగా, చక్కగా అర్థమయ్యేదే! కొందరు ప్రబుద్ధులు, డబ్బుకొరకు సుఖంకొరకు, కీర్తికొరకు జీవితాన్ని విచిత్రంగాచేసి, జనం ముందు డప్పులుకొడుతూ మాట్లాడుతుంటారు. జీవితంలో విచిత్రం ఏముంది? మనిషి పుట్టాడు, బతకాలికనుక తిండి సంపాదించడానికి పోరాడాలి. ఆ తిండి సంపాదించడం మరొకరికి ద్రోహంచేయకుండా వుండాలి. అందరూ ఒకే పద్ధతిలో నీతిగా వుంటే జీవితం విచిత్రంకాదు, తారురోడ్డులాగా అతినున్నగా సుఖంగా ఉంటుంది"

"ఈ ఉపోద్ఘాలతోనే పెళ్ళాలను నోరు మూయించి రాజకీయనాయకులు బలా



మారు తిరుగుతుంటారు. మీరూ అలాగే మాట్లాడుతున్నారు. అందరి భార్యల్లాం టిదికాదు మీభార్య అన్న పచ్చినిజం మీరు ప్రతినిముషం గుర్తుంచుకోవాలి"

"ఇప్పుడు ఏమయిందని నీవు బాధ పడుతున్నావ్?"

"ఇప్పుడేమయిందని కాదు, కాబో తున్నదని బాధ"

"పదిమందికి మంచిచేయడంలో, వారి సుఖాన్ని కోరి ఏదైనా ఒకపని చేయడంలో తప్పేమున్నది?"

"నిజమే! కానీ ముందు సొంతఇంటిని నమ్ముకున్న వ్యక్తులసుఖం చూడాలి. ఇంట్లో ఉద్ధరించలేనివాడు లోకాన్ని ఉద్ధరించేదేమిటి?బహిరంగసభల్లో దేశంలో దేవుణ్ని పూజిస్తున్నారని తిట్టితిట్టి ఇంటికి వెళ్ళిన పెద్దమనిషి, పెళ్ళాం దేవతలను పూజిస్తుంటే నోరుమూసుకుంటున్నాడు. అంటే దేశంలో అందరికీ దేవుడులేదని బోధిస్తున్నాడు. కానీ పెళ్ళానికి బోధించ లేకపోతున్నాడు. మరి ఇంట్లో ఆ విధంగా ఉన్నప్పుడు అతని బోధలకి విలువేలేదు. మీరయినా అంతే! ఇంట్లో ముందు నా సుఖసంతోషాలు తీర్చండి, ఆ తర్వాత బయటివారి సంగతి ఆలోచించవచ్చు"

"ఇప్పుడు నీకేమయిందని బాధపడు తున్నావ్?"

"మీకు తెలియదూ! లంకంత కొంప నుండి బయటపడి, చుట్టూ తడికలు కట్టుకుని బతుకుతున్నాను. కావలసినంత మంది బంధువుల్ని పెట్టుకుని అందరినీ కాలదన్ని అడవిలో నివసించినట్లు ఒంటరిగా బతుకుతున్నాను"

సాలోచనగా బయటకు చూస్తూ వింటు న్నాడు మధు.




రాజ్యం అలా మాట్లాడ్డం తప్పేమో ననుకుంది. ఒకవిధంగా అతని ఆర్థికదుస్థి తిని వేలుపెట్టి చూపడం అవుతుంది. అతన్ని రెచ్చగొట్టి బాధపెడితే వచ్చేది సుఖంకాదు. ఉన్న కనీస సుఖంకూడా పోతుంది. ఇద్దరిమధ్య కలతలూ, పోట్లా టలకు దారితీస్తుంది. ఏ జీవితంకొరకు తాను వచ్చిందో అది దూరమవుతుంది.

మధు జవాబివ్వలేదు. అంతరాంత రాల్లో ఆమె ఎంతబాధ పడుతున్నదో అర్థం చేసుకున్నాడు. ఉన్నతమైన స్థాయి నుంచి, కిందికి తనకుతానుగా దిగివచ్చి కష్టసుఖాల్ని పంచుకుని బతుకడానికి వచ్చిన ఆమెను బాధపెట్టవలసి వచ్చి నందుకు నొచ్చుకున్నాడు. బరువుగా ఊపిరిపీల్చి మంచంలో పడకవేశాడు.

రాజ్యం మాట్లాడకుండా మరో మంచంలో తలవాల్చింది. ఆ రాత్రి ఇద్దరికీ తిండిలేదు. వండినఅన్నం గిన్నెలో చల్లారిపోయింది. కూరలు వాసనపోగొట్టు కుని పారవేయడానికి సిద్ధంగా వున్నాయి. దీర్ఘంగా ఆలోచిస్తూనేవుంది. తాను కోరు కున్న జీవితం ఎండమావి కాకూడదు. అతడితో పోట్లాటపెట్టుకుని, అతన్ని బాధపెట్టి తానూ బాధపడితే వచ్చే లాభ మేమిటి? అతడు రాజకీయాలకు దూరం కాలేదని మాటలవల్ల అర్థం అవుతూనే వుంది. తాను మొండిపట్టుతో అతన్ని మాన్పించాలని ప్రయత్నంచేసినా, అతడు మరింత మూకుడుగావెళ్ళే చేసేదేమిటి?

ఇష్టపూర్వకంగా తనతో జీవితం పంచు కున్నాడు. అవివాహితో సంసారం చేయడం కత్తిమీద సాముచేయడం. లక్షల డబ్బులుఇస్తే చేసుకునేవాడులేడు. డబ్బుకోరకు ఆశించి చేసుకుంటే, చివరకు కుక్కల్ని బాదినట్లుబాది,చంపుతున్నారు. లేదా, పెళ్ళాన్ని అమ్ముకుని అవిధంగా

మరికొంత సంపాదించుకుంటున్నారు. తాను పైసా కట్నంకూడా తీసుకురాలేదు. అవిటి వ్యక్తిని చేసుకోడానికి ఎవరయినా ముందుకువస్తే ఆమె తల్లిదండ్రులు కళ్ళ కద్దుకుని అల్లుణ్ని దేవుడిలాగా చూసు కుంటారు. తన బంధువులు కళ్ళకద్దు కోకుంటేమానె; దూరంగా తరిమికొట్టారు. ఇక అతని మనస్థితి, రాజకీయాలనుబట్టి చూస్తే తనను అమ్మే దుర్గతికి చచ్చినా రాడు. అటువంటి వ్యక్తిని పట్టుకొని, తాను ఏడ్చి, అతన్ని ఏడిపించి మనస్పర్థలు పెంచుకొనడంకంటే, అతని రాజకీయా లలో అతడిని సాగనివ్వడం మంచిది. భవిష్యత్తును గురించి ఆలోచించి ఇప్పు డున్న సుఖం పోగొట్టుకుని గుండెలు బాదుకోవడం ఎందుకు? కళ్లు తుడుచు కుంది చీర చెంగుతో! లేచి అతనిమంచం వైపుగా నడిచింది. అతడిపక్కన కూర్చుని రొమ్ముమీద చెయ్యివేసింది. బరువుగా అతడు పీలుస్తున్న వూపిరి, ఆమె చీరకు తగిలి రెపరెపలాడింది.

"నాకు ద్రోహం చేయకండి" అంది రొమ్ముమీద తలపెట్టి ఏడుస్తూ.

ఆమె వీపు నిమిరాడు లాలనగా "నేను బతికివుండగా నీకు ద్రోహం చేయను; ప్రతిక్షణం నీ సుఖం గురించి ఆలో చిస్తాను. చివరి వరకూ నీకు సుఖం అందించడానికే ప్రయత్నిస్తాను" అన్నాడు ఆమె కళ్ళనీళ్లు అతడి రొమ్ముమీద చొక్కాను తడిపింది. ఆమె కళ్ళనీళ్లు తుడిచిలేచి కూర్చోబెట్టాడు.

"అన్నం తిందామా?" అంది తల వంచుకుని అతని చేతిమీద వేలితో రాస్తూ.

"ఆకలవుతున్నదా?" నవ్వాడు మధు. "ఆడమనిషికి ఆకలికావడం ఎంత సుల భమో కోపంరావడం అంతే సులభం! ఆకలికీ, కోపానికి అంతసంబంధంవుంది"

"నాబాధ అదికాదు; అందరిచేత అవ హేళన చేయించుకుని, చీదరింపచేయించు కున్నా, అవిటివ్యక్తికూడా గౌరవంగా బతుకడానికి అవకాశముందని ఇక్కడ నిరూపించుకున్నాను. ఈ సుఖాన్నీ, ఆనందాన్ని పోగొట్టుకోలేకనే ఏడుస్తు న్నాను"

మంచం దిగి పీటమీద కూర్చుంది. కూర, అన్నం పళ్ళెంలోవేసి మొత్తం కలిపింది. మధు చెయ్యి కడుక్కునివచ్చి ఆమె ఎదురుగా పీటమీద కూర్చున్నాడు. కలిపిన అన్నం ముద్దలుచేసి, అతని నోటికి అందిస్తుంటే అతడుతింటున్నాడు. ప్రతిరోజూ జరిగే కార్యక్రమం అదే అయినా, ఈరోజు ఆమెకు ఏదో అను భూతిగా సంతృప్తిగా, ఆనందంగావుంది. చంటిపిల్లలాగా తనకు సేవచేసే ఇతన్నా తాను మాటలతో ఇంతవరకూ బాధ పెట్టింది? అతని ప్రేమలో తాను కరిగి పోతున్నది. ఆ ప్రేమ ఎల్లప్పుడూ వుంచుకోవలసిన బాధ్యత తనకువుంది. ఆ ప్రేమను తనకైతాను మాటల తూటా లతో ఛేదిస్తే తనకు దూరమవుతాడేమో?

మధు అన్నం తిని లేచి బయటకు వెళ్ళాడు. దాదాపు రాత్రి పదిగంట లయింది. పక్కనేవున్న ఇంటి ఓనరు బసవమ్మగారి కుటుంబం పడుకొనేసరికి పన్నెండు గంటలు దాటుతుంది. తాము లోపల నిద్రపోతుంటే బయటవాళ్ల పోట్లా టలతో, కేకలతో కాలం గడుపుతుంటారు ఏ పన్నెండుగంటలకో అన్నం తింటారు. రాజ్యంలేచి మంచంలోకూర్చుంది. తెరచిన తలుపుగుండా బసవమ్మ కనిపిస్తున్నది. చేతులూపుతూ ఏదేదో మాట్లాడుతున్నది ఎవరితోనో?

లోపల లైటు ఆర్పి వుండకపోవడంతో "టీచరమ్మగారు ఇంకా నిద్రపోలేదా?" అంది తలుపువైపు చూస్తూ.

"లేదు పిన్నీ! ఇప్పుడేఅన్నంతిన్నాం ఆయనగారు బయటకు వెళ్ళారు'' అంది రాజ్యం! బసవమ్మ అక్కడకు వచ్చింది.

"మాస్టారు ఊర్లో రాజకీయాలు నేర్పుతున్నాడేమిటమ్మా! అందరూ అనుకుంటున్నారు. అసలే ఈ ఊరు అనేకసార్లు నాశనమయి,ఇప్పుడిప్పుడే కోలుకొంటున్న ఊరు"

"వాకేం తెలుసుపిన్నీ! నేను బయటకు వెళ్ళేదాన్నికాదుగదా!"

"అడుగో అంజయ్య ఒకడు! పోలీసుల చేతిలో ఎన్నిసార్లు తన్నులుతిన్నా, ఇంకా ఊరిలో ఏదో చేయాలనిఆలోచిస్తుంటాడు. అతగాడు బతకలేకనా? అనవసరంగాలేనిపోనివన్నీ మెడకు తగిలించుకుని ఈడడమేగానీ'' రాజ్యం పలుకలేదు. బావిదగ్గర గిలకచప్పుడవుతుంటే వింటున్నది.

"కొంచెం చెప్పమ్మా! అంజయ్య అందరినీ ఇరికిస్తాడు. నీ మొగుడేమో మెత్తనివాడు. అంజయ్య మాటలువింటే నష్టపోతారు. అతగాడికేం కావలసినంత వుంది. మీకేముందిగనుక, రేపు ఏదయినా జరిగితే ఎంత కష్టం?"

వెళ్ళిపోతున్న ఆమెవైపు చూసి "నా మొగుడు మెత్తనివాడుకాకనే ఈ బాధ, అనుకుంది. అంజయ్యను గురించి అడిపోస్తున్న ఆమె, మధును గురించి తెలియకనే అనుకుంది. మధును గురించి ఏ మాత్రం తెలిసినా, ఊరిలో రాజకీయాలు లేపేది అతడేకానీ, అంజయ్యకాదని తెలుసుకునేదే.

పండ్రెండు గంటల తర్వాత మధు వచ్చాడు.అపాటికి ఆ ప్రాంతంలో అందరూ నిద్రపోతున్నారు. తలుపు తెరచుకొని లోపల అడుగు పెట్టాడు. రాజ్యం కళ్ళు తెరచి పడుకొనివుంది "ఇంకా నిద్రపోలేదా?" అన్నాడు నవ్వుతూ. తలుపు వేసి వచ్చాడు. అతని మాటకు జవాబివ్వకుండా ఒకపక్కకు సర్దుకుంది. మధు పక్కలో పడుకుంటూ ఆమె తొడమీద చెయ్యివేసి నిమిరాడు. అతనిచేతినిపక్కకు లాగి, అతడి రొమ్ముమీద తల ఆన్చి, శరీరాన్ని రాసుకుంటూ ముడుచుకుని అతన్ని చుట్టుకుంది. ''నాకు ఇలాగే ఇష్టం! నన్ను నిద్రపోనీ" అంది మెడచుట్టూ వేసిన చేతిని గట్టిగా బిగిస్తూ.



## 8

"ఎవరోచుట్టాలొస్తున్నారుటీచరుగారండీ!" అన్నాడు ఒక పిల్లవాడు బయటకు చూసి పళ్ళికిలిస్తూ. పాఠాలు చెబుతున్న రాజ్యం తలెత్తిచూసి ఆశ్చర్యంగా నోరు తెరిచింది. భారతి, చెల్లెలు మంజుల, ఆమె భర్త పిల్లలూ, భారతి తల్లి నవ్వుతూ వచ్చారు. వారిని చూసి సంతోషించింది. తాను బయటకు వచ్చిన ఈ సంవత్సరంలో చుట్టాలనేవాళ్లు ఎవరయినా వచ్చారంటే వీళ్ళే! ఏ స్త్రీ అయినా తన పుట్టింటివైపు చుట్టాలు తన దగ్గరకు రావాలని కోరుకుంటుంటుంది. అందులోరాజ్యం మినహాయింపుగాదు. కానీ, ఇంతవరకూ అటూ

ఇటూ ఏ చుట్టాలూరాలేదు. వచ్చినవాళ్ళను చూసి కూర్చోమంది. పిల్లలు మంచాలు వాల్చి, దుప్పట్లు పరిచారు.

"ఎలా ఉన్నావే" అడిగిందిచిన్నమ్మ జవాబుగా నవ్వింది రాజ్యం.

స్టవ్ దగ్గర కూర్చుని కాఫీ చేయడానికి ప్రయత్నించింది. బసవమ్మ పాలు పిండి తెచ్చింది. మంజుల తానే స్టవ్ దగ్గరకు జరుపుకుని కూర్చుని గిన్నె చేతికి తీసుకుంది. "చుట్టాలతో పని చేయించడం మంచిదికాదు" అంది రాజ్యం.

"మా ఇంటికి వచ్చినప్పుడు నువ్వు చేద్దువుగాని" అంది మంజు నవ్వి.

"ఎలా ఉంది సంసారం?" అంది చిన్నమ్మ.

"కష్టాలేంలేవు. ఆర్థిక సమస్యే తల నొప్పిగా వుంది"

"ఈ తడికల కొంపలో ఎలా కాపురం చేస్తున్నావే? ఎంతహీనంగా తయారయ్యావు?" అంది చిన్నమ్మ బాధపడుతూ. రాజ్యం పలుకలేదు. తాను ఆ స్థితిలో ఉన్నప్పుడు ఈ చుట్టాలు రాకపోవడమే మంచిది. వచ్చి వాళ్ళు బాధపడి తననూ బాధపెట్టడమే అవుతుంది. వెళ్ళి నలుగురు చుట్టాలలో ఈ విషయం చెబితే తనను హేళన చేస్తారు ఇంకా! తగినశాస్తి జరిగిందిలెమ్మని సంతోషించేవాళ్ళు వుంటారు. మంజుల కలుగ చేసుకుని, "ఐశ్వర్యాలు లేకపోతే ఏం ఇద్దరూ పోట్లాటలు లేకుండా బతుకుతేచాలు అంది. ఆ మాటకు రాజ్యం జవాబివ్వలేదు. ఈ సంవత్సరంలో తన సంసారాన్ని గురించి బాధపడటం మానుకుంది. పరిస్థితులకనుగుణంగా నడుచుకోడానికి ప్రయత్నిస్తున్నది.

"లావెక్కావేమిటి? విశేషం ఉందా?" అంది మంజుల కడుపువైపు చూస్తూ.

"అయిదోనెల" అంది రాజ్యం తల వంచుకుని సిగ్గుతో. మంజుల నవ్వింది.

"జీవితంలో స్థిరపడిపోతున్నావన్న మాట పిల్లలు పుట్టడమంటే స్థిరపడటమే"

"ఆర్థికంగా ప్రతి నిమిషం ఆలోచనే. ఈ నికృష్ట స్థితిలో మరొకరు తోడవుతే మరింత దిగజారడమే అవుతుంది" అంది రాజ్యం.

"ఆ విధంగా ఆలోచించవద్దు. ఎల్లకాలం ఇలాగే ఉంటారా ఏం?"

మధు వచ్చాడు. వారిని పరిచయం చేసింది రాజ్యం. చిరునవ్వుతో నమస్కారాలుచేశాడు. ప్రతినమస్కారాలయ్యాయి.

"మీరేంపని చేస్తున్నారు?" అడిగాడు అతన్ని.

"నేను జూనియర్ ఇంజనీర్‌గా పని చేస్తున్నాను. నాపేరు సుబ్బారావు"

తర్వాత మధు మాట్లాడలేదు. బంధువులతో మాట్లాడుతూ కూర్చోవడంఅతడికి ఎన్నడూ అలవాటులేదు. రాజకీయాలు మాట్లాడేవాళ్ళయితే గడగడ మాట్లాడగలడు.

రాత్రికి వుండమంటే వీలుకాదనీ, వెళ్ళిపోవాలనీ వాళ్లు వెళ్ళిపోయారు. వాళ్లు వెళ్ళిపోవడమే మంచిదనుకుంది రాజ్యం. వాళ్ళుంతావుంటే కనీసం అయిదు మంచాలయినా కావాలి. ఎక్కడ తెచ్చి పెట్టగలదు?

వెళ్ళిపోతుంటే బాధగా చూసింది. మధు సాగనంపివచ్చాడు. రాజ్యంకళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఒకనాడు అందరూ సమానులు! ఈరోజు వారిస్థాయికి తన స్థాయికీ ఎంతో తేడా. వారి దృష్టిలో తాను నిర్భాగ్యురాలు.


చతుర ... 99

రాత్రి భోజనం చేసి మధు బజారుకు వెళ్ళాడు. బయట బసవమ్మగారిగోల మామూలుగానే వుంది. రాజ్యం పడుకొని నిద్రపోవడానికి ప్రయత్నం చేస్తున్నది. ఆ సమయంలో పోలీసులు వచ్చారు. "మధు ఎక్కడ?" బయట ఎవరినో అడుగుతున్నారు. అధికారికంగా గద్దించి అడుగుతున్న ఆ మాటలతో లేచి కూర్చుంది రాజ్యం. తలుపు తెరిచి చూస్తే ఆ బయలులో చాలామంది పోలీసులు, ఆఫీసర్లు కనిపించారు. బసవమ్మ ఆమె కొడుకు ఆశ్చర్యంగా చూస్తున్నారు. బసవమ్మ భర్త గుడ్డివ్యక్తి. ఆయన చూడలేకున్నా జరిగేది చూచాయగా అర్థం చేసుకుంటు న్నాడు. అక్కడున్న ఒక మనిషి చెప్పడంతో యస్.ఐ. రాజ్యం వద్దకువచ్చాడు. "మధు నీకు ఏంకావాలి?" అతని ఏక వచన ప్రయోగానికి రాజ్యానికి కోపం వచ్చింది. వాళ్ళు మామూలు వ్యక్తులుకాదు మంటమండితే ఈడ్చుకెళ్ళేవాళ్లు. వాళ్ళకు మనిషి గౌరవగౌరవాలతో, విలువలతో మంచితనంతో సంబంధం వుండదని ఎన్నోసార్లు విన్నది. అతడితో తగవు పెట్టుకోవాలని ఆమె అనుకోడంలేదు.

"బజారుకెళ్ళాడు" అంది

"ఎంతసేపయింది?"

"గంటకు పైగానే"

అక్కడేవున్న అరుగుమీద ఆసీనుడై తా యించాడు ఇన్‌స్పెక్టర్! పోలీసులు చుట్టలు తాగడానికి చాటుకువెళ్లి, ఆఫీసరును తిట్టుకుంటూ, అగ్గిపుల్ల వెలిగించి ఒకరికొకరు చుట్టలు అంటించుకుంటూ, పిలుపుకు ఎదురు చూస్తున్నారు.

"మీ ఇంటికి ఎవరయినా కొత్త వ్యక్తులు వస్తున్నారా'' అన్నాడు ఇన్‌స్పెక్టర్

"ఈరోజు ఆరుగురు వచ్చారు?"

"ఏవూరు వాళ్ళది? నీకు వివరాలు తెలుసా?''

''ఎందుకు తెలియదు. ఒకరు మా చిన్నమ్మ! రెండవ వ్యక్తి ఆమె కూతురు, అల్లుడు. ముగ్గురు పిల్లలు!"

ఇన్‌స్పెక్టర్ ముఖం ఆముదం తాగిన వాడిలాగా అయింది. ముఖం కంటగింపుగా పెట్టుకుని తీక్షణంగా చూశాడు.

"నేను తమాషాకు అడగడం లేదు. నీ మొగుడు నక్సలైటు. అతన్ని కలుసుకోడానికి ఎవరయినా వచ్చారా?'' గాండ్రించాడు.

"ఎవరూ ఇక్కడికిరారు! ఆయన రాజకీయాలూ నాకు తెలియవు. మేం ఇక్కడ కాన్వెంటు పెట్టుకొని బతుకుతున్నాం. కొత్త వ్యక్తులు వచ్చారా?అంటే వచ్చినవాళ్ళను గురించి అడుగుతున్నారనుకున్నాను"

బసవమ్మ అక్కడకు వచ్చింది. ''ఆ అమ్మాయి అవిటిదండీ. ఆమె బయటకు వెళ్ళే వ్యక్తిగాదు; బయటి విషయాలు ఆమెనడిగితే ఆమెకేంతెలుస్తాయి?" అంది. బసవమ్మ ఒక కేసులో అంతకుముందే కొన్నాళ్ళు కోర్టులచుట్టూ, పోలీసుస్టేషన్ల చుట్టూ తిరిగినవ్యక్తి! ఇలాంటి ఇన్‌స్పెక్టరుతో మాట్లాడటంలో తొట్రుపాటు ఏమీ లేదామెకు. అక్కడున్న పోలీసులలో ఆమెను చూసినవాళ్ళు చాలామంది వున్నారు.

ఇన్‌స్పెక్టర్ మాట్లాడలేదు. టోపీ తలకుతగిలించి లేచాడు. బెల్టు లూజు చేసుకుంటూ "ఎక్కడికి వెళ్తాడులే" అనుకుంటూ వెళ్ళాడు. పోలీసులు అతనివెంట లాఠీలు ఊపుకుంటూసాగారు.

''నేను చెప్పలేదమ్మా నీ మొగుడు

ఏదో ఒకదానిలో ఇరుక్కుంటాడనీ! ఈ ఊరి రాజకీయాలే అంత. మళ్ళీ ఎవడి కొంప మునుగుతుందో?" అంది రెండు చేతులూ పైకెత్తి నెత్తికొట్టుకుంటూ.

"ఒరేయ్! మాస్టారు ఎక్కడున్నాడో వెళ్ళి చెప్పిరారా! పోలీసులువచ్చారని..." అన్నాడు బసవమ్మ భర్త. ఆమె కొడుకు ఊరిలోనికి వెళ్ళాడు. మరికొంతసేపటికి తిరిగివచ్చి "ఎక్కడా కన్పించలేదు. నలుగురిని పట్టుకెళ్ళారు పోలీసులు అంజయ్య వాళ్ళంతా పరారయ్యారట" అన్నాడు.

రాజ్యం మంచంలోపడి వెక్కి వెక్కి ఏడ్చింది. బావిలో పడినవాడికి తాడు ఆధారంగా దొరికి దానితో పైకిరావాలన్న ఆలోచనలో ఉంటే, తాడుతెగిపోతే ఏమవుతాడు? తిరిగి బావిలోకే పయనం తప్పదు. రాజ్యం తన పరిస్థితి ఆలోచిస్తున్నది. అతడు పరారయ్యాడు. అంటే ఇప్పట్లోరాడు. రాకుంటే తాను ఒంటరిగా ఇక్కడ వుండగలదా? వుండలేకుంటే ఎక్కడికి వెళ్ళాలి? తిరిగి తండ్రివద్దకు వెళ్తే ఊరకుక్కను చూసినట్లుగా చూడరూ? పోకుండా ఇక్కడ ఒంటరిగా ఎలా గడపాలి?

రాత్రంతా కలతనిద్రతో ఉలిక్కిపడి లేస్తూ, పడుకుంటూ కాలంగడిపింది. వస్తాడేమోనని ఎదురు చూసింది, రాలేదు. రాకపోవడమే మంచిదనుకుంది. మళ్ళీ పోలీసులు కాపలా ఉంటారు. దొరికితే పట్టుకుంటారు. ఆ తర్వాత పోలీసుల కోటింగు ఎలా ఉంటుందో ఆమె ఇంతకు ముందేవింది. తప్పించుకోవడమే మంచి దనుకుంది.

మూడురోజుల తర్వాత మధు ఇంటికి వచ్చాడు. రాజ్యం పిల్లలముందు కూర్చుని పాఠాలు చెబుతున్నది. ఆమె ముఖం దీపాలు వెలిగినట్లయింది. అంతలోనే విచారం. మళ్ళీ పోలీసులొస్తే పారిపోవాలి లేదా దొరకాలి.

మధు స్నానం చేశాడు. పిల్లలను ఇంటికి పంపింది. లేచి వెళ్ళి స్టౌముందు కూర్చుంది. ఆ గదిలో అంతకుమించి చోటులేదు. ఒక మంచం, స్టౌ, పక్కన రెండు సూట్‌కేసులు పెట్టుకోడానికే స్థలం! కూర్చుంటే మంచంలో, లేదా స్టౌముందు కూర్చోవాలి.

"మీకొరకు పోలీసులు వచ్చి వెళ్ళారు" అంది భయంభయంగాచూస్తూ.

"ఆరోజే తెలిసింది. నేను ఇంటిలో నుండి బయటకు వెళ్తూనే పోలీసులు ఎదురయ్యారు. నేనెవరో తెలియదు గనుక అడ్డగించలేదు. దాటిపోయాను..."

"మళ్ళీరారా?"

"ఇప్పట్లోరారు! మేమేదో కుట్రపన్ను తున్నామని కేసునమోదుచేసి అరెస్టుకు వచ్చారు. యాంటిసిపేటరీ బెయిల్ దొరికింది. అయినా పోలీసులు ఇంకో కేసులోనయినా ఇరికించగలరు"

"నాపరిస్థితి ఏమిటి? మీరిలా తయారవుతే నేను ఒంటరిగా ఎలావుండగలను?" అంది కళ్ళనీరుకారుస్తూ.

"ధైర్యంగా ఉండాలి రాజీ. మనం ఒక మంచిపని చేసేటప్పుడు, దానివల్లవచ్చే కష్టనష్టాల్ని భరించడానికి సిద్ధపడాలి. బజార్లలో గాలికబుర్లు ఎవరయినా మాట్లాడుతారు. ఆచరణకురారు. ఆచరణకురాని జాలి, సానుభూతివల్ల లాభం లేదు"

"ఆ జాలి, సానుభూతి నాకెవరు చూపిస్తారు? నాస్థితి ఏమిటని అడుగుతున్నాను"

"నీకునీవే ధైర్యం తెచ్చుకోవాలి"

తనడిగేదానికి అతడు సూటిగా సమాధానం చెప్పడం లేదు. ఆమెకు భయంగా వుంది ఈ జీవితం చూస్తుంటే.

అతడు అమాయకుడుగాడు. అవివేకి కాదు. మూర్ఖు డూకాదు. అన్నీ తెలిసి చేస్తున్నవ్యక్తి. ఎంతచెప్పినా వినడమేగాని తన దారిన తాను వెళ్తూనేవుంటాడు. అడ్డగించి అడ్డగించి విసుగుపుట్టి అడ్డగించే వారే పక్కకు వైదొలగాలి. అతడు చెప్పే రాజకీయాలు తనకు అర్థంకావు. అర్థం చేసుకోవాలన్న ఆలోచన ఆమెకులేదు. ఈ లోకంలో పుట్టినందుకు అవిటితనం వచ్చింది. ఈఅవిటితనంతో తాను ఎవరినీ ఉద్ధరించలేదు. మరొకరితో తాను ఉద్ధరించబడాలి. ఆ బాధ్యత కలవ్యక్తికి రాజకీయాలేగనుక లేకపోతే చాలా మంచివాడు. మంచి ఆశయాలున్నాయి. కాని అవి సాధించడం సాధ్యంకాదు. కానప్పుడుతగ్గి ప్రవర్తించాలని ఆమె ఆలోచన. అతడు చెప్పేదాన్నిబట్టి తన పదకొండో సంవత్సరంలో రాజకీయాల్లో దిగాడు. దిగి ఇప్పటికి ఇరవై సంవత్సరాలు దాటింది. సాధించిందేమీ లేకపోగా వున్నది ఖర్చయింది. ఇంకా దాన్నే పట్టుకుని ఊగులాడటం వల్ల ప్రయోజనం? ఒంటరిగా వున్నప్పుడు ఏ జైలులో పడివున్నా నష్టంలేదు - బయటున్నా లోపలున్నా ఒకటేగనుక. అలాకాక నిరాశతో రాజకీయాలకు దూరంగా జరిగి, పెళ్ళి చేసుకుని, అటీ మరొకరిమీద ఆధారపడవలసిన స్త్రీని మెడకు కట్టుకుని ఈరోజు రాజకీయాలలో ఉత్సాహంగా దిగితే, ఆ స్త్రీ గతేమిటి? అతడు ఎందుకు ఆలోచించడంలేదు?



ఆరోజు ఇద్దరికీభోజనంలేదు. అతడితో మాట్లాడలేకపోయింది. ఏడుస్తూ అన్నం వండకుండానేపడుకుంది. అతడు కూడా బలవంతంచేయలేదు. ఏడ్చి ఏడ్చి చివరకు తానే జీవితంతో రాజీపడుతుందని నిర్ణయించుకున్నాడు.

మరో రెండు రోజుల్లో అరెస్టయ్యాడు. ఈసారి ఊరిలో చాలామంది అరెస్టయ్యారు. మరుసటిరోజు వారి భార్యలు, తల్లులు, పిల్లలు స్టేషన్‌కు వెళ్తున్నారు. తానూ వెళ్ళడానికి నిశ్చయించుకుంది. సంవత్సరంపాటు ఎంతో అన్యోన్యంగా కాపురం చేసిన వ్యక్తి పోలీసుస్టేషన్‌లో వుంటే తాను ఇంటిలో కూర్చోలేక పోయింది. రోడ్డుమీదకు రిక్షాలో వెళ్ళి, అక్కడినుండి బస్సులో వెళ్ళింది.

స్టేషన్ ఆవరణ చాలా విశాలంగా వుంది. పెద్దపెద్ద చెట్లు నీడనిస్తున్నాయి. ఆ నీడకింద వీళ్ళేకాక చాలామంది చేరి మాట్లాడుకుంటున్నారు. అందరి ముఖాల్లో ఆదుర్దా, భయం. కొందరు ఏడుస్తున్నారు. ఒక్కరిముఖంమీదకూడా సంతోషంలేదు. నరక కూపంలోనికి నవ్వుతూ ఎవరొస్తారనుకుంది రాజ్యం.

పోలీసు ఆఫీసర్లు ఎవరూ లేరు. పోలీసులు వచ్చినవారితో డబ్బులు వసూలుచేసి, మాట్లాడటానికి అవకాశం ఇస్తున్నారు. రాజ్యంకూడా పది రూపాయలు ముడుపు చెల్లించింది. మాట్లాడటానికి లాకప్‌వద్దకు వెళ్ళింది. లాకప్ పుష్పక విమానంలాగుంది. చూడ్డానికి చిన్నదే అయినా పాతికమందిని భరిస్తున్నది. సినిమా టిక్కెట్ల కొరకు తోసుకుంటూ నిలబడిన జన సమూహంలా వున్నారు లోపల. అసహ్యంగా వాసన వస్తున్నది. ఆ వాసన భరించలేక ముక్కు మూసుకుంది. ఒక్కసారి లోపలకు వస్తేనే

ఇలాగుంటే, రోజూ ఇక్కడేవుండేవాడు ఎలా భరిస్తున్నారోననుకుంది.

మధు కటకటాల దగ్గరకు వచ్చాడు. ఆమెను చూసి నవ్వాడు. ఆమె నవ్వలేదు. పెద్దగా ఏడ్చింది. చెదరి గాలికి లేచిన అతడి జుట్టును చూస్తూ మాట్లాడలేక పోయింది.

"ఎందుకొచ్చావ్ రాజ్యం! నడువలేని దానివి కష్టపడుతున్నావు?" అన్నాడు మధు.

"నడవలేనిదాన్ని నడిపించాలని మీరు అనుకున్నారుగదా" - ఆమెను సముదాయించడానికి అక్కడచేసేదేమీలేదు.

రాత్రికి అందరితోపాటు ఇంటికి వచ్చింది. అన్నం వండుకోలేదు. వండుకోవాలన్న ధ్యాసకూడాలేదు. బసవమ్మ బలవంతంచేసి తినిపించింది. ఆమె తృప్తి కొరకు నాలుగు మెతుకులు తిన్నాననిపించింది.

"ఇది సహజమేలేవమ్మా! ఈరోజు కాకుంటే రేపు బెయిల్‌మీద వస్తాడు. ఎన్నాళ్ళు లోపల పెట్టుకుంటారు పోలీసులుమాత్రం?" అంది బసవమ్మ. ఆమె ఈ ఆటుపోటుల్లో ఆరితేరింది. అందువల్ల భయపడటంలేదు. ఎదుటివ్యక్తికి ధైర్యం చెప్పగలుగుతున్నది.

రాత్రి ఒంటరిజీవితం. ఈమధ్యఒంటరి జీవితానికి అలవాటుపడిపోతున్నది. కడుపులో మరో ప్రాణి తయారవుతున్నది. ఆ ప్రాణి భవిష్యత్తు గురించి ఆలోచించాలి. భర్త ఇరుక్కున్న కేసుల గురించి ఆలోచించాలి. ఆ కేసులకు కావలసిన డబ్బు గురించి ఆలోచించాలి. వీటన్నింటికీ ముందు తన జీవితం ఇలా తయారుకావడం గురించి కూడా ఆలోచించాల్సివుంది. పెనం మీద నుండి పొయ్యిలో పడ్డట్టుంది తన పరిస్థితి. మనిషి మంచివాడే, ఎంతోసహృదయతతో చూస్తున్నాడు. కానీ, అతని రాజకీయం ఆమెకు నచ్చలేదు. దానివల్ల ఇద్దరం దూరమవుతున్నామని ఆలోచిస్తున్నది. దూరం కావడం ఆరంభం కావాలేగానీ అది మరింత దూరంగా జరుగుతూనే ఉంటుంది. స్త్రీకి భర్తకంటే మరో రక్షణ లేదు. చేసుకున్నవాడు మంచివాడయితే ఆ స్త్రీ సుఖపడుతుంది. చెడ్డవాడయితే అన్నీ పోగొట్టుకుంటుంది. తన భర్త మంచివాడో, చెడ్డవాడో నిర్ణయించుకోలేకపోతున్నది. అవిటివ్యక్తి అని తెలిసీ, తాను లేకపోతే బతుకు సాగించడం కష్టమని తెలిసీ అతను రాజకీయాలవైపు ప్రయాణిస్తున్నాడు.

రాత్రంతా నిద్రలేకుండా ఆలోచిస్తూనే ఉంది.




మరో మూడురోజులకు బెయిల్‌మీద వచ్చాడు మధు. సరిగ్గా అదేరోజు ఆమెకు హైస్కూలులో ఉద్యోగం వచ్చింది. రాజ్యం ఎంతో సంతోషించింది. ఇక తిండినిగురించీ, ఆర్థికపరిస్థితి గురించీ బాధపడవలసిన పనిలేదు. ఈ గ్రామం విడిస్తే భర్త రాజకీయాలనుండి దూరంగా తొలగే అవకాశం ఏర్పడుతుంది. ఎలాగూ

టౌనువేరియా గనుక ఏ వ్యాపారం ప్రారంభించినా లాభసాటి సంగతటుంచి, అదో వ్యాపకంగా తయారవుతుంది. దాని వల్ల ఈ రాజకీయాలు నిలిచిపోతాయి. ప్రస్తుతమున్న కేసుల గొడవ తెగిపోతే సరిపోతుందనుకుంది.

ఆ వారమే టౌనుకు చేరారు. టౌనులో ఇల్లు అద్దెకుతీసుకుని కాపురం పెట్టారు. స్కూలుకు వెళ్ళి వస్తున్నది. సంసారం గాడినపడింది. మధు పంపని లేకున్నా బజార్లవెంట తిరిగేపని ఆరంభించాడు.

ఓరోజు రాజ్యం స్కూలునుండి ఇంటికి వచ్చేసరికి ఇంట్లో చాలామంది కూర్చునివున్నారు. వారిలో ఏ ఒక్కరినీ అంతకుముందు చూడలేదు. బహుశా భర్త ఊరికే ఉండలేక పేకాట మొదలు పెట్టాడేమోననుకుంది మొదట. అటు తర్వాత వారి సీరియస్ ముఖాలు చూచి దుఃఖపడింది. వారి మాటలు చేతలు తిరిగి ఇక్కడకూడా కనిపిస్తున్నాయి. ఆమె రావడంతో సమావేశం ఆరోజుకు నిలిపి ఎవరితోవ వారు తీసుకున్నారు.

"ఏమిటిది?" అంది తీక్షణంగా.

మధు మాట్లాడలేదు. తల వంచుకుని రాసుకుంటూ కూర్చున్నాడు.

"మిమ్మల్నే...ఎందుకుపలకడంలేదు?"

"రాజీ... నీవు విద్యాధికురాలివి! ఇదేమిటో తెలియని అమాయకురాలివి కాదు. మళ్ళీనానోటచెప్పించడంఎందుకు?" అన్నాడు నవ్వుతూ.

"మీరు ఈ రాజకీయాలు వదలరా? మళ్ళీ నా మెడకు ఉరి తగిలిస్తారా?"

"ఈ వ్యవస్థ అనేకమందికి, కోట్లాది మందికి ఉరి తగిలించింది. అందులో మనమెంత? వారి ఉరి తొలగించడానికి అవసరమైతే మనం తగిలించుకోవలసి వస్తుంది"

ఆమె విసుగ్గా తలాడించి లోపలకు వెళ్ళింది. ఆమె వెళ్ళిన వైపుచూస్తూ, రాసుకుంటూ కూర్చున్నాడు.

మరుసటిరోజు కేసు వాయిదాకు వెళ్ళాడు. రాజ్యం శలవుపెట్టి ఇంటిదగ్గర కూర్చుంది. మెటర్నిటీ లీవ్‌కు అప్లైచేసుకుంది. ప్రారంభ ఉద్యోగం కావడంవల్ల అవకాశం ఉంటుందో ఉండదోనన్నాడు హెడ్మాష్టరు. ప్రయత్నం చేయడానికి నిశ్చయించుకుని పిటిషన్ పంపుకుంది.

ఆమె ఒక దృఢనిర్ణయానికి వచ్చింది అతడు సక్రమంగా ఈ రాజకీయాలు విడిచి ఇంటిపట్టున వుండేవిధంగాచేయాలి. అలా అతడు ఉండని పక్షంలో అతన్ని దూరం చేసుకోడానికయినా సిద్ధపడాలి తాను! లేకుంటే అటూ ఇటూ మధ్యన నలగవలసివస్తే రేపు పుట్టబోయే మూడో ప్రాణి భవిష్యత్తేమిటి? తనకు భర్త కావాలనుకుంది, వచ్చాడు. అతడిసరసన సంవత్సరంపైగా జీవించింది. కష్టమూ, సుఖమూ అనుభవించింది. త్వరలో బిడ్డ పుట్టబోతున్నది. తనకు కావాలనుకున్నందుకు వాళ్ళు సమకూడుతున్నారు. భవిష్యత్తులో ముసలివయస్సులో తనకు పిల్లలు అండ కావాలి. వారికొరకు ఆర్థికంగా పుంజుకోవాలి. వచ్చే జీతంలో సగం తిండికిపోయినా, సగం మిగులుతుంది. ఆ సగం ఇతడు రాజకీయాలలో తిరుగుతూ ఖర్చుపెడుతున్నాడు. దీన్ని మాన్పించాలి. అవసరమైతే ఎంతకయినా తెగించాలనుకుంది. రేపువచ్చిన తర్వాత కఠినంగానే తనకు ఈ రాజకీయాలు ఇష్టంలేదని చెప్పాలనుకుంది. కాని, వాయిదానుండి తిరిగివచ్చిన మధు ముందు తన నిర్ణయం చెప్పలేకపోయింది. అతడు

లేనప్పుడు తనేదో ఊహించింది. తీరా ఎదురయితే మాట్లాడలేకపోయింది.

"వాయిదా ఏమయింది?" అడిగిండి రాజ్యం.

"అదలా వాయిదాలు పడుతుందే తప్ప ఏమీకాదు" నవ్వుతూ అన్నాడు మధు.

"అనవసరంగా మీరు దెబ్బతింటూ మీమీద ఆధారపడినవారిని దెబ్బతీస్తున్నారు"

"ఎవరినీ దెబ్బతీయడంలేదు రాజీ! అందరికీ మేలుకలగాలనే నా ఉదేశం"

"కానీ, ఆచరణలో ఫలితం వ్యతిరేకంగా ఉంటున్నది"

అలసటగా మధు మంచంలో వాలాడు. పడుకున్న అతనివైపు తేరిపారచూసి రిక్షాఎక్కి స్కూలుకు వెళ్ళింది. ఆ రోజంతా మనస్సు సరిగాలేదు. తాను ఎంత చెప్పినా అతడు తన విధానాలు మార్చుకోడు. తాను అతని విధానాల్ని అనుసరించనూలేదు. అతనికి లొంగి నడుచుకోవడమా? వ్యతిరేకించి దూరం కావడమా? సమస్య అర్థంకాలేదు ఇష్టపూర్వకంగా అవిటివ్యక్తిని చేసుకుని తన మంచితనాన్ని ఆచరణలో చూపించిన అతడిమీద, అతడితో వైవాహిక జీవితం గడిపి ఈ సంవత్సరంపైగా సంతృప్తిగా గడిపిన రోజులు జ్ఞప్తికివచ్చి గౌరవము, ప్రేమాభిమానాలు ఆమెకున్నాయి. అతడు తనవాడు. తనకు చెందాలనే తపన ఆమెలో అణువణువునా ఉంది.కాని, అతడిని ఆకట్టుకోలేకపోతున్నది. తన వాదన రైటనే అతని తోవను తాను మార్పుచేయలేదు.అలాగని అతన్ని వ్యతిరేకించి నడుచుకునే ఉద్దేశం ఆమెకు లేదు. తలనొప్పితో సాయంత్రం రెండు గంటలకే ఇంటికి వచ్చింది. ఇంటిదగ్గర యథాప్రకారం సమావేశం ఉంది. వారిని చూడనట్లే తల తిప్పుకుని లోపలకు వెళ్ళింది.

"బాగున్నారా?" అన్నాడుఅంజయ్య లోపలకు వస్తూ.

నవ్వుతూనే జవాబిచ్చింది– "ఎప్పుడొచ్చారు?"

"ఉదయం వచ్చామండీ!మధుతోకలిసి వెళ్దామని వచ్చాను"

"మంచిది" అంది. స్టౌమీద కాఫీకాచి అతడికో గ్లాసు ఇచ్చి, తనోగ్లాసు తీసుకుంది "అమ్మ, పిల్లలు అందరూ బాగున్నారా? బసవమ్మగారు బాగున్నారా?"

"హాయిగా తింటూ తిరుగుతూనే ఉన్నారు"

"మీకీ బాధ వచ్చిందన్న మాట" అంది పరిహాసంగా. "ఎందుకండీ ఇవన్నీ! పెళ్ళాం పిల్లల్ని ఉద్ధరించలేని రాజకీయాలు. మీకు దేశాన్ని బాగుచేసేముందు ఇంట్లో పెళ్ళాం పిల్లల్ని ఒక పూట తిండికీ సుఖానికీ లోటు లేకుండా చూసుకోవాలని తెలియదా?"

"మీరు పొరబడుతున్నారు. ఈ వ్యవస్థ ఉందే. ఇది ఎవరికీ కూడా, సుఖమూ అందించలేదు. ముందు దాన్ని మార్చాలనే ఈ యువకుల తాపత్రయం"

"ఎక్కడ మార్చేది? తమ కుటుంబాల్ని బాగుచేసుకుంటే ఆమేరకు సుఖ సంతోషాలకు దగ్గరయినట్లే. ఆ తర్వాత మిగిలినవారినీ సులభంగా మార్చవచ్చు"

అంజయ్య నవ్వాడు. "మీరు విద్యాధికులు. మేమా ఓనమాలు నేర్చుకున్నవాళ్ళం. మీరు మాకంటే ఎక్కువే చదివారు. ఎక్కువ ఉద్రేక పడవలసినవాళ్ళూ మీరే. కానీ ఈ విద్యాధికుల్లో ఆ నిరసన

భావం రానంతవరకూ ఎవరూ ఎవరినీ మార్చలేరు. మేం చేస్తున్నది రేపు సాయంత్రానికి ఈ వ్యవస్థ మార్చివేస్తామనికాదు. ఆ స్థాయి కూడా మాకు ఇప్పుడులేదు. కానీ, జనాన్ని కనీసం ఆలోచింపచేయడానికే మా ప్రస్తుత ప్రయత్నం"

"మీరు ఆలోచింపజేసే లోపల, మిమ్మల్ని పోలీసు లాకప్‌లలో, మేజస్ట్రేటు కోర్టుల్లో ఆలోచింపచేస్తున్నారు. ఏమని?- ఇందులో ఎందుకు ఇరుక్కున్నాము రా భగవంతుడా? అని కొందరు వాపోయేలా పోలీసులు చేస్తున్నారు"

ఆమె వాదనతో వాదన కలపడం అతడికి ఇష్టంలేదు. ఆమె ఆలోచనలు అతడికి అంతకుముందే తెలుసు. ఆమె అవిటి వ్యక్తి. తన జీవితాన్ని గురించి మాత్రమే ఆలోచించుకునే స్థితిలో ఉంది. దొరికిన తోడు పోగొట్టుకుంటే తాను అనాథగా బతుకవలసివస్తుందనే భావం ఆమెది. ఆ భావంతో ఉన్న వ్యక్తిని మాటలతో మార్చడం సాధ్యంకాదు. ఏదయినా సంఘటన జరిగితే తప్ప.

అక్కడ నుండి హాలులోనికివచ్చాడు. అక్కడ చాలామంది మాట్లాడుతున్నారు. కొందరు వెళ్లిపోయారు. మరికొందరు పోవడానికి సిద్ధపడుతున్నారు. మధు దగ్గరకు వచ్చిన అంజయ్య "నేను ఊరికి వెళ్తున్నాను" అన్నాడు.

"మంచిదే. వాయిదా లోపల అవసరమైతే కబురు చేస్తాను" అన్నాడు మధు.

అంజయ్య తల ఊపి బయటకు వెళ్ళాడు. అందరూ వెళ్లిపోవడంతో మధు లోపలకు వచ్చాడు. తలకు గుడ్డచుట్టుకుని రాజ్యాం పడకవేసి ఉంది.

"అప్పుడే వచ్చావేమిటి?" అన్నాడు ఆమెను కదుపుతూ.

"అసలు ఉద్యోగానికి రాజీనామాచేద్దామనుకుంటున్నాను. నేను సంపాదించడం, మీరు జల్సాగా తిరగడం నాకు నచ్చడం లేదు. నాకు సంపాదన లేకపోతే మీరు పోషణ భారం తీసుకుంటేనయినా ఈ రాజకీయ తిరుగుళ్ళు తగ్గిపోతాయేమో?"

మధు పలుకలేదు. పక్కనేవున్న కుర్చీలో కూర్చుని టేబుల్ మీద కాళ్ళు వేసి వెనక్కువాలాడు. ఇంటికప్పుకేసి ఆలోచిస్తున్నాడు. ఆమె సంపాదనతో తింటూ తాను తిరగడం కూడా మంచిది కాదు. ఆమె తీవ్రంగా అంటున్నదని తాను కోపగించుకుంటే లాభం లేదు. స్వయం సంపాదన కొరకు ప్రయత్నించాలి. స్వంత సంపాదన లేకుండా ఎవరి డబ్బునో దబిరించి తిన్నంతవరకూ వారి నిరసనలూ, హేళనలూ ఎదుర్కోక తప్పదు.

తనకు తెలిసిన కొంతమందితో తాను కాన్వెంటు పెడుతున్నాననీ, తమ పిల్లలను పంపించమనీ అడిగాడు. చాలామంది చిరునవ్వుతో అంగీకరించారు. కొందరయితే భుజం తట్టి "మీరు, ఏపని చేయడానికయినా సమర్థులే" అన్నారు. వారి ప్రోత్సాహాన్ని చూస్తే ఎంతోమంది పిల్లలు వస్తారని ఆశించాడు. వచ్చే డబ్బుతో తన తిండికి, కొంత ఇంటిలో ఇచ్చి, మిగిలింది రాజకీయాలకు ఖర్చు పెట్టుకోవచ్చని ఆశించాడు.

తీరా మరుసటిరోజు నలుగురు పిల్లలు వచ్చారు. తన ఆశ నీరయినందుకు ఖంగు తిన్నాడు. మొదటిరోజు కాబట్టి రాలేదనీ, క్రమంగా ఒక్కొక్కరే వస్తారనీ తనను తానే నచ్చచెప్పుకొన్నాడు. మొదటిరోజూ, రెండూ, మూడూ వెళ్ళిపోయాయి. నెల రోజులు గడిచినా పిల్లలు పదిమందికంటే

పెరగలేదు. ఆనోటా ఆనోటా వినడాన్ని బట్టి, అతనిదగ్గరకు పంపితే మాపిల్లలకూ ఆ రాజకీయాలు వంట పడతాయి. మాకెందుకు నాయనా ఆబాధ! మా పిల్లలు పెద్దయి, సుఖంగా బతకాలని మేం కోరుకుంటున్నాం. అంటున్నట్లు తెలిసింది. నిజమే! ఎదుటివాడి తల పగలగొట్టి పైసా ఎలా సంపాదించాలనే సమాజం, ఎదుటివాడికి మేలు చేయడానికి తన పైసా ఎలా ఖర్చు పెట్టాలన్న స్థాయికి ఎదగాలంటే ఎన్ని ఆటుపోట్లు జరగాలో? జరిగినా మారుతుందన్న నమ్మకం మేధావులకే లేదు, ప్రలోభాలకు మోసపోయే సామాన్య జనం ఎంత వరకూ నమ్ముతారు? తనకో గుర్తింపు ఉంది. అటువంటప్పుడు తన చుట్టూ తిరగడానికి పెద్దలనబడే సంపాదనాపరులు తమ పిల్లల్ని పంపలేరు. తామూతిరగలేరు.కాకపోతే రేపేమొస్తుందోనన్న భయంతో ముందు జాగ్రత్తగా మంచిగా ఉండిపొగడుతూ, వెనుక తిట్టుకుంటూ వుంటారు.

అతని ప్రయత్నం విఫలం కావడం రాజ్యం చూస్తూనేవుంది. ఈ మధ్య అతడితో పెద్దగా మాట్లాడ లేకపోతున్నది. అతడూ ఆమె స్థాయిని బట్టే ప్రవర్తిస్తున్నాడు. వారిద్దరి మధ్యా అంతరంగంలో దూరం ఆరంభమయింది. అది ఎంత దూరం వెళ్తుందోనన్న భయం ఆమెకు వుంది.

స్కూలునుంచి వచ్చేటప్పటికి కానిస్టేబుల్ ఇంటిదగ్గరున్నాడు. ఆమెనుచూసి సమస్కారం చేశాడు. "ఇన్‌స్పెక్టర్‌గారు మిమ్మల్ని పిలుచుకు రమ్మన్నారండీ" అన్నాడు.



"ఇప్పుడే స్కూలునుండి వస్తున్నాను. రేపు ఉదయం వస్తానని చెప్పండి" అంది రిక్షా దిగబోతూ.

"లేదండీ! వెంటవుండి తక్షణంతీసుకు రమ్మన్నారు"

దిగబోతున్న రాజ్యం రిక్షాలో సర్దుకుని కూర్చుని రిక్షాను స్టేషన్‌కు తీసుకెళ్ళమంది. ఇన్‌స్పెక్టర్ ఆమెను చూసి–

"కూర్చోండి" అన్నాడు.

ఆమె కుర్చీలో కూర్చుంది.

"మధు అనేవ్యక్తి మీకు తెలుసుకదా" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

ఆమె తల ఊపింది "ఆయన మా వారే"

"అతన్ని గురించి పూర్తిగా పరిశోధించమని మాకు పైనుండి ఆర్డర్స్‌వచ్చాయి. అతడు అతివాద వర్గాలకు చెందినవాడనీ, ఎవరినో చంపడానికి ఇక్కడ ప్రయత్నాలు చేస్తున్నాడనీ, గతంలో కూడా అతనికి ఈ తీవ్రవాద భావాలున్నాయనీ, అతడి మీద తక్షణ చర్య తీసుకొమ్మని కూడా మాకు ఆర్డర్స్ వున్నాయి. అతన్ని గురించి ఇక్కడ ఎంక్వయిరీ చేశాం! పైనుండి మాకు వచ్చిన ఇన్‌ఫర్మేషన్ ప్రకారం అతడు పూర్తిగా కూరుకుపోయిన వ్యక్తి అనీ, అతనికి చట్టవ్యతిరేక వర్గాలతో లాలూచీ, సంబంధాలున్నాయనీ తెలిసింది. మీరు గౌరవంగా ఇక్కడ బతుకుతున్నారు. మీకు కళంకం తెచ్చే పనులు అతడు చేస్తున్నప్పుడు అతన్ని సక్రమమార్గంలో పెట్టవలసిన బాధ్యత మీది"

ఇన్‌స్పెక్టర్ దీర్ఘోపన్యాసం విన్న తరువాత ఆమెకు సందేహం వచ్చింది. అతని వైపు చూస్తూ–"అసలు అతివాది అంటే ఏమిటండీ" అంది తెలుసుకుందామని. ఇన్‌స్పెక్టర్ ఆమెవైపు చూశాడు.

తర్వాత పైకప్పువంక చూశాడు. ఆ తర్వాత టోపీ కింద పెట్టి తల గోక్కున్నాడు. ఎదురుగా ఉన్న సెంట్రీ వైపు ఒక నిముషం పాటు చూస్తూ అన్నాడు చివరికి."దొంగతనాలు, ఖూనీలు చేయడం వారివృత్తి"

"మావారు ఇంతవరకూ అవి చేసినట్లు నాకు తెలియదు. ఎవరూ ఆవిధంగా ఆయన్ను గురించి మాట్లాడనూ లేదు"

"ఇక ముందు ఆరంభించేందుకు పథకాలు వేశారని మాకు తెలుసు"

"నన్నేం చేయమంటారో చెప్పండి" అంది వ్యవహారానికి వస్తూ.

''అతన్ని ఆ తోవనుండి తప్పించవలసిన బాధ్యతమీది. అలా తప్పించలేకపోతే అతడితోపాటు మీరూ బాధ్యత వహించాల్సి వుంటుంది. మీ ఇళ్ళమీద పడి శోధించడం పెద్ద సమస్య కాదు. ఇళ్ళలో ఏమీ ఉంచుకోరని మాకు తెలుసు. ఆ విధంగా రెచ్చగొట్టడం కాకుండా, పిలిపించి మాట్లాడటం మంచిదని పిలిపించాను" అతనివాదన నిజమనడానికి చాలామంది పక్క గదిలో కూర్చున్నారనీ, స్టేషన్ వరండాలో చాలా మంది ఉన్నారనీ ఆమెకు తెలుసు. ఈ ఇన్స్పెక్టరెవరో తొందరపాటు మనిషిగా కనిపించడంలేదు. అందరినీ పిలిచి సామరస్యంగా బోధిస్తున్నాడనుకుంది.

"ఆయన నామాటవింటాడన్న నమ్మకం నాకు లేదు. అయినా చివరి వరకూ ప్రయత్నంచేస్తాను" ఇన్స్పెక్టర్ తల ఊపాడు. ఆమె వెళ్ళిపోయింది.

ఇంటికి వచ్చే సరికి మధు ఏదో రాసుకుంటూ కూర్చున్నాడు.

"ఇంటికి వచ్చి తిరిగి వెళ్ళావట ఎక్కడికి?" అన్నాడు ఆమెను చూసి.

"పోలీసు స్టేషన్కు వెళ్ళాను" అంది

"ఎందుకు? అతడేమైనా హితబోధ చేస్తున్నాడా?" అన్నాడు నవ్వి.

''సరిగ్గా ఊహించారు"

"ఊహించిందేమీ లేదు. ఇలాగే చాలా మందిని పిలిచి చెబుతున్నాడట. అతగాడు స్థానికుడు. ఊర్లో అందరితో బంధురీత్యా సంబంధాలు ఉన్నవాడు. తొందరపడి చర్య తీసుకుంటే తనకు ఊరుమొత్తం వ్యతిరేక మవుతుందన్న భయంతో పిలిపించి హితబోధనలు చేస్తున్నాడు. అతని హితబోధనలకు ఎవరు లొంగుతారు? లొంగకుంటే ట్రాన్స్ఫర్ చేసుకోడానికి రిహార్సల్ ఇది" నవ్వాడు మధు.

ఆమె అతన్ని కొరకొరా చూసింది. ''మీకు అంతా తమాషా ఉంది. పోలీసులు తలుచుకుంటే ఏమైనా చేస్తారు. అనవసరంగా మీరు వాళ్ళను రెచ్చగొడుతున్నారు"

''నిజమే! పోలీసులు తలుచుకుంటే ఏమైనా చేస్తారు. కానీ వాళ్ళు తలుచుకోవడంలేదు"

ఆటుపోటులుతిన్న అతనితో తాను ఏం మాట్లాడగలదు? ఏవిధంగా మార్చగలదు?

వారంరోజుల్లోనే పోలీసుల తొలి దాడి జరిగింది. ఆపాటికి మధు భోజనం చేస్తున్నాడు. తలనొప్పిగా ఉందని ఆమె పడుకుంది. పనిపిల్లవాడు బయట కూర్చున్నాడు. ఇన్స్పెక్టర్తోపాటు పదిమంది పోలీసులు లోపలకువచ్చారు. పడుకున్న ఆమె లేచి కూర్చుంది. ఈ ఇన్స్పెక్టర్ ఎవడో కొత్తవ్యక్తి.

"మధు ఉన్నాడా?" అన్నాడు ఇన్స్పెక్టర్ లాఠీ ఊపుతూ చుట్టూచూసి. మధు తింటున్న అన్నం ఆపి చెయ్యి

కడుక్కోకుండానే హాల్లోకి వచ్చాడు. "నేనే మధు" అన్నాడు.

"మీ ఇంటికి నిన్న కొందరు వచ్చి వెళ్లారని తెలిసింది. వారికోరకు వచ్చాం"

మధు తల ఊపాడు, "రోజూ యాభై మందికిపైగా మా ఇంటికివచ్చి పోతుంటారు. వాళ్ళ పేర్లు, వివరాలు మీరు చెబితే ఎవరయినా వచ్చారేమో చెప్పగలను"

ఇన్‌స్పెక్టర్ కంటగింపుగా ముఖం పెట్టాడు. "మిష్టర్‌మధూ! తమాషాలాడకు. ఇది పోలీసు వ్యవహారం నీవెవడివో, నీ వెనుక తిరిగేవాళ్ళెవరో మాకు తెలియదనుకోకు. అండర్‌గ్రౌండ్‌లో తిరిగే ఇద్దరు నిన్న మీ ఇంటికి వచ్చినట్లు దాఖలాలున్నాయి"

"ఇంకేం ఇన్‌స్పెక్టర్‌గారూ! ఇల్లంతా వెతుక్కోండి... దొరికితే తీసుకెళ్ళండి"

"అంత సులభంగా దొరికే పద్ధతిలో వుంటే నిన్ను అడగడం ఎందుకు? అప్పుడే వెతికేవాళ్ళం. వాళ్ళను దాటించి ఉంటావని మాకు తెలుసు. వాళ్ళెవరో తెలుసుకోడానికి వచ్చాం"

మధు నవ్వాడు, "ఇన్‌స్పెక్టర్‌గారూ! ముందే చెప్పాను ఎందరో వచ్చి వెళ్లారని. వారెవరో, ఏం చేశారో నాకు తెలియదు. అందువల్ల నాకు వాళ్ళెవరో ఏమీ తెలియదనే చెప్పాలి"

''ఆల్‌రైట్... నిన్ను అరెస్టుచేస్తున్నాం"

"వారెంట్ తెచ్చారా?"

మధు ప్రశ్నకు వికటంగా నవ్వాడు అతడు- ''వారెంట్లు స్టేషన్‌లోనే చూపిస్తారు. ఊ...పద" అంటూ గీంకరించాడు. కానిస్టేబుల్స్ అతన్ని లాక్కుంటూ జీప్‌దగ్గరికి తెచ్చి ఎక్కించారు. రాజ్యం వాళ్ళ వాదన, తీసుకుపోవడం గుడ్లప్పగించి చూస్తున్నది. అతన్ని తీసుకుపోయిన తర్వాత కొంతసేపు ఏమీ ఆలోచించలేకపోయింది. తర్వాత లేచి రిక్షాలో దగ్గరలోని లాయరు సరసయ్య ఇంటికి వెళ్ళింది.

సరసయ్య పడకసీనులో ఉన్నాడు. అతడి గురక గేటుదగ్గరే ఆమె విన్నది. అతడి భార్యవచ్చి తలుపుతీసి, రాజ్యాన్ని చూసి పలకరింపుగా నవ్వింది.

"రండి లోపలకు" అంది పక్కకు జరుగుతూ.

''లాయరుగారున్నారా?''

"ఇప్పుడే కోర్టునుండి వచ్చి పడుకున్నారు... మీరు కూర్చోండి...లేపుతాను" అంటూ లోపలకు వెళ్ళింది.

సరసయ్య కళ్ళునులుముకుంటూవచ్చి, "ఏంటమ్మా?'' అన్నాడు.

జరిగింది చెప్పింది రాజ్యం. అతడి నిద్రమత్తు వదిలింది. కళ్ళు టపటపకొట్టుకున్నాయి. ఊడిపోతున్న లుంగీని పైకిలాగి కట్టుకున్నాడు. ''ఎంతమందిని తీసుకెళ్ళారో?'' అన్నాడు స్వగతంగా.

''నాకు తెలియదండీ'' అంది తనను అడుగుతున్నాడనుకుని.

''నేను స్టేషన్‌కు వెళ్తాను. నువ్వు కూడా రామ్మా! అవసరమైె జామీను కావాలంటే వెంటనే సంతకం పెట్టవచ్చు'' అన్నాడు లోపలకు వెళ్తూ.

పదినిమిషాలలో రెండు రిక్షాలలో స్టేషన్ చేరారు. అప్పటికి స్టేషన్ ఆవరణ నిండా జనం.ఎవరిముఖాల్లోనూ ఆనందం లేదు. ఉండదని రాజ్యానికి తెలుసు. నరక కూపంలో నవ్వడం సాధ్యంకాదు.

లాయరుతోపాటు ఆమె కూడా లోపలకు వెళ్ళింది. ఇన్‌స్పెక్టర్ కూర్చోమనికూడా చెప్పలేదు. కర్ర చేతపట్టుకుని గోడకు ఆనుకుని నిలబడింది. ఇంకా

ముగ్గురు లాయర్లు అక్కడ ఉన్నారు. లాయర్ నరసయ్య ఇన్‌స్పెక్టర్‌కు విష్ చేశాడుగానీ చూశాడో లేదో ప్రతిగా విష్‌చేయనూలేదు, పలుకరించనూలేదు. తోటి లాయర్లు నరసయ్యను చూసి తలలు ఊపారు.

"ఎందుకు వచ్చారు?'' అన్నాడు పావుగంట తర్వాత ఇన్‌స్పెక్టర్ నరసయ్యతో.

అతడు చెప్పాడు. "అతనిమీద మూడు కేసులున్నాయి. వాటిమీద యఫ్. ఐ. ఆర్.తో రేపే కోర్టుకు హాజరుపరుస్తున్నాం" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

''ఆ కేసులేమిటో తెలుసుకోవచ్చా?''

''చెప్పాల్సిన అవసరం మాకు లేదు గానీ, అడిగారుకాబట్టి చెబుతున్నాను. జనాన్ని రెచ్చగొట్టి, ప్రభుత్వం మీద తిరుగుబాటుచేయించడం ఒకటి కాగా ఒక భూస్వామిని చంపడానికి ప్రయత్నం చేయడం రెండోది, చట్టానికిదొరక్కుండా తప్పించుకుతిరుగుతున్న చట్టవ్యతిరేకులకు రక్షణ కల్పించి దాచిపెట్టడం మూడోది. ఇందులో రెండు రాజద్రోహం కిందకు; ఒకటి హత్యా సెక్షన్ కింద నమోదవుతాయి"

"అతడొక్కడే ఇందులో ముద్దాయా? ఇంకా ఉన్నారా?''

''ఇటువంటివాటిలో ' ఒకరిద్దరు ఉంటారా? పదులు...వందలూ ఉంటారు"

బయటకు వచ్చారు ఇద్దరూ. మరోలాయరు చుట్టూ కొందరుచేరి ఆందోళనగా ఏదో అడుగుతున్నారు. నరసయ్య అతడివద్దకు వెళ్ళినిలబడ్డాడు.

"మొత్తం యాభై మంది ఇక్కడే అరెస్టు చేయబడ్డారు?" అన్నాడు. లాయరు నరసయ్య తల ఊపాడు. ముందు మనం చేయవలసింది వారిని తక్షణం కోర్టుకు హాజరుపరచేలా చేయడం"

"మనం చెప్పినా పోలీసులు వినరు. కోర్టుద్వారా ఆర్డరు పొందడంకంటే గత్యంతరంలేదు. పోలీసులనుండి మెజిస్ట్రేటు పరిధికిందకు వెళ్ళే కేసుల విషయం నింపాదిగా ఆలోచించవచ్చు" అన్నాడు రెండో లాయరు.

బాధపడుతూ, ఏడుస్తున్నవాళ్ళకు నచ్చచెప్పి లాయర్లు బయటకు నడిచారు. వారితోపాటు రాజ్యం కూడా నడిచింది. వెనుక ఎవరో అంటున్నారు- "ఈ కుంటి దాని మొగుడే మావాడిని రెచ్చగొట్టి పాడుచేశాడు"

"దీని మొగుడే మా పిల్లాడిని రోజూ దువ్వి దువ్వి ఈ గతికి తెచ్చాడు"

వారి మాటలు విన్పిస్తున్నా వెనుదిరిగి చూడలేదు. చాలామంది చాలా రకాలుగా మాట్లాడుతున్నారు. వారందకీ జవాబివ్వ శక్తిలేదు. వాళ్ళందరూ కలిసి తన భర్తను రెచ్చగొట్టి నాశనం చేశారని తాను భావించింది. సరిగ్గా అదే పద్ధతిలో వాళ్ళూ ఆలోచిస్తున్నారు. ఇదంతా చూస్తే ఎవరినీ ఎవరూ రెచ్చకొట్టుకోవడం లేదేమో? ఎవరంతకు వారుముందుకువస్తున్నారేమో? అనుకుంది.

లాయరు ఆమెను రిక్షా ఎక్కించి "ఏం భయపడకమ్మా! ఇలాంటి కేసులేం చేస్తాయి? అప్పుడప్పుడు పిళ్ళు అరెస్టులు చేస్తూనేవుంటారు. రేపు బెయిలు తీసుకుని ఇంటికి వస్తాడు. అన్ని ప్రయత్నాలూ మేం చేస్తాంకదా" అన్నాడు. ఆమె తల ఊపింది. ఆ రోజు రాత్రి అన్నం తినలేదు. తన జీవితంలో ఇలా అన్నం తినకుండా ఉన్నరోజులు ఎన్నో ఆమెకే తెలియడంలేదు. చిన్నపుడు అవిటి




పని తల్లి చిదరించుకుంటు, మధ్య వయిస్సులో పిల్లలు చీదరించుకుంటే, ఇంట్లో దావ విషయంలో అక్క చీదరించుకుంటే, సుబ్రహ్మణ్యం, జయధీర్‌ల చర్యలవల్ల తనను తనే చీదరించుకుంటే, ఆ తర్వాత మధు చర్యల వల్లనూ పస్తులతో కాలం గడుపవలసి వస్తున్నది. తన జీవితంలో పస్తులుండటం కూడా ఒక భాగంగా కొనసాగుతున్నది. రాత్రంతా ఆలోచనలతో తలనొప్పి, గుండెపోటు, వేధిస్తూ నిద్ర రాకుండా చేశాయి.

ఉదయం పది గంటలకే కోర్టుకు వెళ్ళింది. ఈమెలాగే ఆత్రుతపడేవాళ్ళు చాలామంది వచ్చారు. పదకొండు గంటలకు కోర్టు తెరుస్తారని ఆమెకూ తెలుసు. కానీ, అంతవరకూ ఇంటి దగ్గర ఉండే ఓర్పు లేదు.

ఒంటిగంట సమయంలో, మేజిస్ట్రేటు కింద తన రూంలో ఉండగా యాభై మందిని ప్రవేశపెట్టారు పోలీసులు. నాలుగు వ్యానులనిండా, మూడు జీపుల నిండా పోలీసులు వచ్చారు. ప్రభుత్వానికి ఎంత ఖర్చోననుకుంది రాజ్యం. ఈ డబ్బంతా ఎక్కడినుండి వస్తుంది? ప్రజలు పన్నులుచెల్లిస్తేనే వస్తుంది. అంటే ప్రజలు తిరుగుబడుతూనే, తాము తిరగబడకుండా చేయడానికి సిబ్బందికీ తామే ఖర్చుచేయవలసి వస్తున్నది.

లోపలకు ఎవరినీ రానివ్వలేదు. ముద్దాయిల తరఫున నలుగురు లాయర్లు వెళ్ళారు. వారి వాదన అరగంటసాగింది. పబ్లిక్ ప్రాసిక్యూటర్ నోరుమూసుకున్నాడు. ఆ చర్చ బెయిల్ ఇవ్వడానికి మేజిస్ట్రేటు అంగీకరించేవరకూ సాగింది.

యాభైమందికి బెయిల్ తీసుకుని బయటకువచ్చారు లాయర్లతోసహా. కోర్టు ఆవరణ వారి నినాదాలతో రణగొణధ్వనిగావుంది. పోలీసులు తుపాకులు వేలాడేసి వ్యాన్లదగ్గర నిలబడ్డారు. ఈ పీకులాట ఇంతటితో అయిపోయినందుకు వాళ్ళు సంతోషించారు. లేకుంటే యాభై మందిని ఉంచడానికి సబ్‌జైలు చాలదు గనుక, వీరిని మరోచోటికి తీసుకెళ్ళాలి. ప్రయాణంలో వీళ్ళు పారిపోడానికి ప్రయత్నంచేస్తే అంతా రసాభాస.! ఇంతటితో పీడ వదలిపోయింది వారి దృష్టిలో. ఆఫీసర్లకు మాత్రం కంటగింపుగా ఉంది. తాము ఎంతో కష్టపడి అరెస్టుచేసి తెస్తే ఈ మేజిస్ట్రేటు లాయర్ల వాదనల్ని విని ఒక్క కలంపోటుతో విడిచిపెడతాడా? వెధవ ప్రజాస్వామ్యం అనుకున్నారు ఆఫీసర్లు.

ఖైదీల అరుపులు వారి గుండెలు పగలగొడుతున్నాయి. వీళ్ళ కథ ఇలాకాదు, తగినబుద్ధివచ్చేలా చేయాలి- అనుకుంటూ జీపులుఎక్కి వెళ్ళిపోయారు.

మధు దూరంగా నిలబడివున్న రాజ్యం వద్దకు వచ్చాడు నవ్వుతూ. అతడు నవ్వుతుంటే ఆమె ఏడుస్తున్నది. ఆమె కళ్ళ నీళ్ళు తుడిచి "ఏమయింది? ఇదిమామూలే వాళ్ళు ఇంతకుమించి ఏం చేయలేరు" అన్నాడు.

"మీకు అలాగే ఉంటుంది" అంది బాధగా.

రిక్షానుపిలిచి,ఆమెను రిక్షాలోఎక్కించి తానూ ఎక్కాడు. ఆమెకు ధైర్యం కలిగిస్తున్నట్లు భుజంచుట్టూ చెయ్యివేశాడు.

"పోలీసులకూ, ఆఫీసర్లకూ తేడా చూశావా?" అన్నాడు ఆమెను ఉత్సాహపరచే ధోరణిలో మాట్లాడుతూ. ఆమె అతని ముఖంలోనికి చూసింది.

"కోర్టుకువచ్చేటప్పుడు పోలీసుఆఫీసర్ల

ముఖాలు ఉత్సాహంతో వెలిగిపోతున్నాయి. పోలీసుల ముఖాలు దీనంగా, నీరసంతో ఊగిపోతున్నాయి. తిరిగి వెళ్ళేటప్పుడు పోలీసులు ఉత్సాహంగా వెళ్ళిపోతున్నారు. వారి ఆఫీసర్ల ముఖాలు ఆముదం తాగినట్లుగా తయారయ్యాయి"

"ఇవన్నీ చెప్పి నన్ను ఉత్సాహపరచడానికి ప్రయత్నించి లాభంలేదు. మీపనులంటే నాకు చిరాకువేస్తున్నది. కాని, భార్యగా నాకూ బాధ్యత ఉండటంవల్ల ఈ ఖర్మ భరిస్తున్నాను. ఇలా కొంతకాలం జరిగితే ఏమయ్యో గొయ్యో నేను చూసుకోక తప్పదేమో?" అంది నీరసంగా.

మధు మాట్లాడలేదు. రోడ్డువేపు చూస్తున్నాడు. ఆమెను సంతోషపరచి బాధపడకుండా చేయాలని అతడి ప్రయత్నం. కానీ ఆమె నీరసించిపోతున్నది. ఆమెను మార్చడంగానీ, నచ్చచెప్పడంగానీ ఇప్పట్లో సాధ్యంకాదు. ఈ పరిస్థితిలో తాను తిరుగుతుంటే ఆమె తట్టుకోలేకపోవడమేగాక, తననుండి దూరంగా వెళ్ళడానికి, ఇద్దరిమధ్య సంబంధాలు తెంచుకోవడానికికూడా ప్రయత్నం చేసుకోవచ్చు. ఆర్థికంగా ఒకరిమీద ఆధారపడవలసిన అవసరం ఆమెకులేదు. పురుష తోడులేనంతమాత్రాన, స్త్రీలు బతుకలేకుండాపోరు. ఇవన్నీ ఆమె ఆలోచించి ఆ దిశగా వెళితే, ఇద్దరిమధ్యా వున్నదారం తెగిపోతుందని అతడికి తెలుసు. ఆమె ఒంటరిగా బతికితే అతడికీ సంతోషమే. కానీ, ఆమె ఎంతవరకు అంగీకరిస్తుంది? తనతోపాటు ఇలా బాధలు నిత్యకృత్యమయ్యేదానికంటే, శాశ్వతంగా దూరంగావడంవల్ల ఆమె బాగుపడితే మంచిదే. కాని లోకంలో స్త్రీ ఎంతవరకు ఒంటరిగా నిలబడుతుంది? అందునా అవిటివ్యక్తి ఎలా నిలదొక్కుకుంటుంది?



## 10

డెలివరి సమయం కావడంతో రాజ్యం హాస్పిటల్‌లో చేరింది. మధు ఆమెతో సన్నిహితంగానే వుంటున్నా, ఒంటరితనం ఫీలవుతూనే ఉంది. రేపు ఈ పిల్ల గతేమిటి? మధుతోవ మధుది. తన తోవ తనది. ఇంటిదగ్గర ఈ పిల్ల పెరిగే ఉపాయమేమిటి? ఎవరిమీదనో ఆధారపడితే ఎంతవరకు సాధ్యం! సాధ్యమయినా పిల్లలకు తల్లిదండ్రులదగ్గరున్న ఆప్యాయతలు మిగిలినవారినుండి ఎలా లభిస్తాయి?

రాత్రి పగలు ఆమెకు ఇవే ఆలోచనలు. మధు వచ్చిపోతున్నాడు. రాత్రి అంతా అక్కడే పడకవేస్తున్నాడు. అతని భార్యా విధేయతకు నర్సులు నవ్వుకున్నారు చిలిపిగా.

ఓరోజు మధు మళ్ళీ అరెస్టయ్యాడని ఎవరో వచ్చి చెప్పారు. రాజ్యం భయాందోళనకు లోనయింది. తాను రేపో, ఎల్లుండో ప్రసవించబోయే సమయం. అతడి అవసరం తనకు ఎంతగానో ఉంది. ఈ సమయంలో అతడు లేకపోతే తాను తట్టుకోలేదు. ఆ విషయం తెలిసిన నర్సులు ఆమెను ఓదార్చారు. "మీరు ఈ సమయంలో మానసికబాధకులోనుకావద్దు.

కాన్పు కష్టమవుతుంది" అన్నారు వాళ్ల వారి మాటలు వినేస్థితిలో లేదు రాజ్యం. మంచంలోపడి వెక్కివెక్కి ఏడ్చింది. లాయరు నరసయ్య సాయంత్రం అక్కడకు వచ్చాడు. ఆయనవెంట ఆయన భార్య కూడా వుంది. ఏడుస్తున్న ఆమెను అతడి భార్య శివసుందరి ఊరడిస్తున్నది.

"ఎలా జరిగింది లాయరుగారూ!" అంది రాజ్యం.

"బాంబులు తీసుకురావడానికి వెళ్ళారనే సమాచారం పోలీసులకు అందిందట! వాళ్లు అన్ని ప్రాంతాలలో నిఘావేసి కూర్చున్నారు. తీసుకువస్తున్న వాళ్లిద్దరూ దొరికిపోయారు. వారిని నాలుగుతన్ని ప్రశ్నించడంతో ముఖ్యులపేర్లు బయటపెట్టేశారు. ప్రధానమైన నలుగురిలో ఇద్దరు దొరికారు. ఇద్దరు తప్పించుకు పారిపోయారు."

"ఎప్పుడు కోర్టుకు హాజరుపరుస్తారు?"

"కోర్టుకా?" నీరసంగా నవ్వాడు తల గోక్కుంటూ నరసయ్య. "వారిని అరెస్ట్ చేసినట్లే పోలీసులు ఒప్పుకోవటంలేదు. వాళ్ళసంగతి మాకు తెలియదు పొమ్మంటున్నారు. కోర్టుద్వారా ప్రయత్నాలు చేస్తున్నారు లాయర్లు. అయినా ఆమాకీ బయట పెడతారన్న నమ్మకంలేదు"

"మరి ఎలా... ఏంచేస్తారు?"

నరసయ్య సమాధానం ఇవ్వలేదు. చుట్టూ చూస్తున్నాడు, ఎక్కడో చంపేసి పోలీసులకు ఎదురుతిరిగి పోట్లాటలో చచ్చారని రేపు వాళ్లు ప్రచారం చేస్తారు. కోర్టుకు హాజరుపరచడానికి వాళ్ళు సిద్ధంగాలేరు. వారిమీద పోలీసు ఆఫీసర్లకు కుత్తుకదాకా మండిపోతున్నది. వాళ్ళ పీడ విరగడచేసుకోడానికే ఈ ప్రయత్నం చేశారు. నిజంగా బాంబులు దొరికాయో లేదో, వాళ్లు వీరిపేర్లు చెప్పారో లేదో పోలీసు ఆఫీసర్లకుతప్ప మరెవరికీ తెలియదు. పోలీసులు చెబుతున్నదిమాత్రమే అందరూ వింటున్నారు. ఈ పరిస్థితిలో అతడు తిరిగి వస్తాడని ధైర్యం ఇవ్వాలా? లేదు. ఇలా చేయవచ్చని ఊహించి ఆమెకు చెప్పాలా? అతనికి అర్థంకాకనే చాలాసేపు నిలబడి చుట్టూ చూస్తున్నాడు.

చివరకు వెళ్ళడానికి సిద్ధపడుతూ "నేను మళ్ళీ వస్తానమ్మా! నీకు డెలివరీ సమయంకదా! ప్రసవించేవరకూ మీ వదిన ఇక్కడే ఉంటుంది. నువ్వేమీ సంశయాలు పెట్టుకోవద్దు. మధు తొందరలోనే బయటకు వస్తాడు" అనిచెప్పి బయటకు వెళ్ళాడు.

శివసుందరి మంచంమీద కూర్చుంది. రాజ్యం చెయ్యి చేతిలోకి తీసుకుని ''నిమురుతూ - ఈ మొగవాళ్ళందరూ ఇంతేనమ్మా! మీ అన్నయ్య మొదటినుంచీ ఇలాగే తిరుగుతున్నారు. లాయరుగనుక పోలీసులతోనెగ్గుకొస్తున్నారు. నేనూ ఇంతే! బతుకని సర్దుకపోవలసివచ్చింది" అంది.

రాజ్యం కళ్ళనుంచి నీరు కారుతున్నది. భవిష్యత్తు ఆమెకు అంధకారంగా ఉంది.

''మీ బంధువుల్ని ఎవరినయినా పిలిపించే ఏర్పాటుచేశారా?'' అంది శివసుందరి.

"మాకు బంధువులంటూ ఎవరూ లేరండీ! మిగిలింది స్నేహితులే'' అంటూ తన జీవితకథ ఆమెకు వినిపించింది. ఆవిధంగా కొంత బాధ తగ్గించుకుందామని ప్రయత్నం. ఎదుట జాలితో విని సానుభూతి చూపించేవాళ్ళుంటే, కొంత ఉపశమనం కలుగుతుంది.

సాయంత్రం ఏడుగంటల ప్రాంతంలో అంజయ్య వచ్చాడు. అతడి ముఖంలో

నవ్వు కన్పించడంలేదు. మనిషి చాలా అదుర్దాపడుతున్నాడు.

"అరెస్ట్ చేశారటకదా?'' అడిగాడు రాజ్యాన్ని.

తల ఊపింది ఆమె - "మీవరకూ రాలేదా?" అంది.

తల ఆడించాడు అంజయ్య, "వీళ్ళిచ్చే జవాబులుబట్టి మా పరిస్థితి ఆధారపడి ఉంటుంది. మమ్మల్ని గురించి కూడా వీళ్ళు చెబితే మా పనీ అయిపోతుంది" అన్నాడు ఆందోళనగా.

''అసలెట్లా జరిగింది?'' అంది - అత డయితేగానీ పూర్తిగా చెప్పగలడని ఆమెకు తెలుసు. వాళ్ళకున్న సంబంధాలలాంటివి.

''ఏం జరిగింది? ఏమీ జరగలేదు... మాకు తెలిసినంతవరకూ ఇద్దరూ కాఫీ హోటల్లో కాఫీ తాగి, రోడ్డుమీదకు వస్తూంటే పట్టుకున్నారు. దొంగలు, దొంగలని కేకలేస్తూ జీపులో పడేశారు. ఆ తర్వాత ఏమయిందీ ఎవరికీ తెలియదు"

"బాంబులు తెస్తూ పట్టుబడినవాళ్లు వీరి పేర్లు చెప్పారట కదా" అంది ఆశ్చర్యంతో చూస్తూ రాజ్యం.

అంజయ్య బాధతోనవ్వాడు, "బాంబు లంటే దోసకాయలనుకున్నారా...ఎక్క డంటే అక్కడ దొరకడానికి, తేవడానికీ. వాటి పేరుచెప్పి ప్రజల్ని భయపెట్టడానికి పోలీసులుచేసే హడావిడి ఇది. ఎవరూ దొరకలేదు...అదంతా కట్టుకథ''

''ఇప్పుడేం జరుగుతుంది?" అంది సంశయంగా.

అంజయ్య కూడా చెప్పడానికి వెనుకంజవేశాడు. పకడ్బందీగా తీసుకు పోయిన తరువాత పోలీసులు చేసేదేమిటో అందరికీ తెలుసు. వాళ్ళ శవాలు ఎక్కడ కన్పిస్తాయోనని జనం ఎదురుచూస్తుంటే తాను మాత్రం అంతకంటే ఏం చెప్ప గలడు? తీరా ఆమె ప్రసవించేసమయంలో ఇలాంటివన్నీ ఆమెకు చెప్పి బాధపెట్టితే లాభమేమిటి? అందువల్ల తెలియదని తప్పించుకున్నాడు.

తాను వెళ్ళిపోతాననీ, తనను గురించి తెలిస్తే తననూ వెంటాడుతారనీ అతడు చెప్పాడు. ఆ పరిస్థితిలో అతన్ని ఉండ మనడం భావ్యంకాదని వెళ్ళమనే చెప్పింది. అప్పుడప్పుడు వివరాలు తెలుసుకుని వచ్చి చెప్పమని కోరింది. అతడు తల ఊపి బయటకు పోబోయేంతలో పోలీసులు రానే వచ్చారు. అంజయ్య మరో గదిలోనికి పారిపోవాలనుకున్నాడు కానీ ముందుగానే పోలీసులు జాగ్రత్తపడి వచ్చారు. కళ్ళ ముందే జరిగిన ఆ హఠాత్ సంఘటనకు మరింత బాధకులోనయింది రాజ్యం. అంజయ్యను తీసుకుపోతూ ఇన్‌స్పెక్టర్ తనవైపు చూసిన చూపుకు భయపడింది. అసలు అంజయ్య ఇక్కడికి ఎందుకు వచ్చాడు? ఎందుకు దొరికాడు? ఈవిధంగా తనమీద అనవసరంగా అనుమానాలు ఏర్పడతాయి. బాధతో కణతలు నొక్కు కుంటూ పడుకుంది. శివసుందరి లేచి వరండాలోనికి వచ్చింది. నర్సులు కొందరు సానుభూతితో, కొందరు ఆశ్చర్యంగానూ పలకరిస్తున్నారు.

ఉదయం ఏడుగంటలకు పోలీసు జీప్ వచ్చి హాస్పిటల్ ముందు ఆగింది. అందులోనుండి పోలీసులు, ఇన్‌స్పెక్టర్ దిగారు. నేరుగా డాక్టర్ రూంలోనికి వచ్చారు. డాక్టర్‌కు విష్ చేసి కూర్చున్నాడు.

"ఇక్కడ మా ఆధీనంలోకి తీసుకో వలసిన వ్యక్తి ఒకరున్నారు. అందువల్ల వచ్చాము'' అంటూ చెప్పాడుఇన్‌స్పెక్టర్,

డాక్టర్ నవ్వింది, "ఇక్కడ అందరూ ఆడవాళ్ళు. పైగా ప్రసవించడానికి సిద్ధంగా ఉన్నవాళ్ళో, ప్రసవించేవాళ్లో ఉంటారు. వారిలో అంత అవసరం వచ్చినవా రెవరు?" అంది.

"రాజ్యలక్ష్మి అనే టీచరు ఇక్కడ జాయినయింది. ఆమెను తీసుకుపోవాలి"

డాక్టరు కనుబొమలు ముడిచింది. నొసలు పైకెగరేసి "ఏమిటి పని? ఆమె ఈరోజో, రేపో కనేస్థితి లో ఉంది" అంది.

"ఆమె ప్రసవించేస్థితిలో ఉందో లేదో మాకు తెలియదు. ప్రసవిస్తూ ఉన్నా మేము తీసుకుపోకతప్పదు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ గంభీరంగా.

డాక్టరు కూడా సీరియస్‌గానే ముఖం పెట్టింది. "ఆల్‌రైట్! అరెస్ట్‌వారెంటు చూపండి" అంది చెయ్యి ముందుకుచాపి.

"సారీ మేడమ్! మేము తీసుకురాలేదు. ఆ అవసరం కూడాలేదు. ఆమె ఒక ఉగ్రవాది భార్య. అతడిని పోలీసులు ఎదురుకాల్పుల్లో చంపేశారు. ఆమెతో మాట్లాడవలసినవి చాలా వున్నాయి. ఆమెను పోలీస్టేషన్‌కు తీసుకుపోకతప్పదు దానికి మీరు అనుమతి ఇస్తే గౌరవంగా ఉంటుంది"

డాక్టర్ లేచినిలబడింది-"ఇన్‌స్పెక్టర్! ఆమె మా హాస్పిటల్‌లో జాయినయినట్లు మూడు రోజుల కిందటే రిజిష్టర్లకు ఎక్కించాము. ఈరోజు ఆమె ఇక్కడి నుండి వెళ్ళవలసివస్తే, ఎలా, ఎందుకు వెళ్ళింది మేము రికార్డుచేయాలి. రేపు పైఆఫీసర్లు వచ్చి అడిగితే జవాబు చెప్పుకోవాలి. ఆమె ఇప్పట్లో బయటకు వెళ్ళడం డాక్టరుగా నేను అంగీకరించను. కాదూ కూడదు అంటే వారంట్ చూపక తప్పదు. డాక్టరుగా ఒక పేషెంటు బాగో గులు నేను చూసుకోవాలి... తప్పదు"

"ఇది పోలీసు వ్యవహారం"

"ఏ వ్యవహారమయినా మాకు రికార్డు పూర్వకంగా ఉండాలి. ఇక్కడ బలవంతం చేయడం వల్ల లాభంలేదు"

"ఆమెను మేము ఏవిధంగా తీసుకెళ్ళ డానికయినా సిద్ధమే. కాకుంటే మీకు తగిన గౌరవమిచ్చి అనుమతితో తీసుకెళ్దామని అడిగాము" అన్నాడు లేస్తూ.

"ఆమెను ఇక్కడినుండి కదిలించే ప్రసక్తిలేదు" అంది ఖండితంగా.

"సరే గౌరవాన్ని నిలుపుకోలేకపోతే మేం చేసేదేం లేదు. మేము తీసుకుపో తున్నాం" అంటూ రూం వైపు కదిలాడు. అతడితోపాటు పోలీసులూ కదిలారు.

"రాజ్యంగారూ! మీరు పోలీసుస్టేషన్‌కు రావాలి...వస్తున్నారు అంతే" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఆమె బిత్తరపోయింది. ఇప్పుడో, రేపో ప్రసవించబోయేస్థితిలో ఉన్న తాను ఎలా వెళ్ళగలుగుతుంది? ఎందుకు తీసుకెళ్తున్నారు? అడగడానికి ఆమెకు ధైర్యం చాలలేదు.

"లేవండి. బయట జీప్ ఉంది మీరు లేవకపోతే బలవంతంగా తీసుకువెళ్తాం"

రాజ్యం లేచి నిలబడింది. అసలే అవిటిమనిషి కావడంవల్ల నడుం ముందుకు వచినట్లు ఉంటుంది. దానికితోడు నిండుచూలాలు కావడంతో మరింత ముందుకు తోసుకువచ్చి తల చాలా వెనక్కు వాలిపోయింది. శివసుందరి భుజంమీద చెయ్యివేసి బయటకునడిచింది. కారుతున్న కన్నీటిని చేతితో తుడుచు కోలేకపోయింది. జీప్ ఎక్కించి శివసుందరి ఒకవైపుగా నిలబడింది. కన్నీళ్ళతో

చేతులెత్తి నమస్కారం చేసింది రాజ్యం. శివసుందరి ముఖానికి కొంగు కప్పుకుని వలవల ఏడ్చింది. నిశ్చేష్టులై నిలబడి పోయిన నర్సులు, విజిటర్స్ కళ్ళలో నీరు కమ్మింది. డాక్టర్ తన రూం దాటి బయటకురాలేదు. రూంనుండి ఎవరికో ఫోన్ చేస్తున్నట్లున్నారు.

డ్యూటీ నర్సు లోపలకు పరుగెత్తుకుంటూవచ్చి వగరుస్తూ చెప్పింది. డాక్టర్ నర్స్‌వైపు చూసింది ఒక నిముషంసేపు, తల ఊపి, "నువ్వు వెళ్ళు" అంది. నర్స్ బయటకువచ్చింది.

శివసుందరి అక్కడినుండి వెళ్ళిపోయింది. మరో పదినిముషాల్లో లాయరు నరసయ్యతోపాటు పదిమంది అక్కడకు వచ్చారు. డాక్టరును అడిగారు వివరాలు. జరిగినదంతా చెప్పింది. "పోలీసులను మేము ఏవిధంగా ఎదిరించగలం? మా బాధ్యత ఆమెను రక్షించడం. ప్రయత్నించాము. వాళ్ళు అహంకారంగా మామాట వినకుండా తీసుకెళ్ళారు. డిపార్ట్‌మెంటల్‌గా మేం చర్య తీసుకునే పద్ధతిన చర్య తీసుకుంటున్నాం" అంది.

"మీరు చర్య తీసుకునేదాకా ఆమె బతికి ఉంటుందా డాక్టర్?" అన్నాడు నరసయ్య ఆవేదనగా.

"సాటి ఆడమనిషిగా నాకూ బాధగానే ఉంది లాయర్‌గారూ! కానీ మనుషులకు జవాబివ్వగలమే తప్ప జంతువులకు ఇవ్వలేం, ఎదిరించనూలేము మొదటి కాన్పు. ఇప్పుడో, రేపో ప్రసవమయ్యే స్థితిలో ఆమె బయటకుపోవడం శారీరకంగా ప్రమాదకరం...పిల్ల-తల్లీ ఇద్దరికీ కష్టమే"

ఆమెతో ఎంత మాట్లాడినా ఫలితం అంతకంటే ఉండదని తెలుసుకున్నారు.

అక్కడినుండి జిల్లా కలెక్టరును కలుసుకుందామని నిర్ణయించుకున్నారు.

* * *

పోలీసు జీపు స్టేషనుముందు ఆగింది. అందులోనుండి కిందికి దిగడానికే రాజ్యానికి కష్టమయింది. మెల్లిగాదిగి అతి మెల్లిగా నడిచి వరండాలోనికి వచ్చేసరికి ఆయాసం, ఎగశ్వాస వచ్చాయి. గోడకు ఆనుకుని ఒక నిముషం నిలబడింది. తిరిగి లోపలకు నడిచింది.

ఇన్‌స్పెక్టర్ రూంలో ఆమెను హాజరు పరిచారు పోలీసులు. ఆమెను నిలువెల్లా చూస్తూ, "నీ భర్త ఎవరెవరితో మాట్లాడేవాడు, ఎవరెవరు నీ ఇంటికి వచ్చేవారో పూర్తి వివరాలు మాకు కావాలి. అవి ఇవ్వగలిగితేనే నీవు బయటపడతావు" అన్నాడు. అతని ముఖం భీకరంగా ఉంది.

"ఆయన విషయాలు నేను ఎప్పుడూ పట్టించుకోలేదు. ఏం చేస్తుంటాడో కూడా నేను అడగలేదు. ఎవరెవరో వస్తూపోతూ వుంటారు. వారు ఎందుకు వస్తారో నాకెలా తెలుస్తుంది?" అంది చెదరిన జుత్తును వ్రేళ్ళతో పైకి తోసుకుంటూ.

"ఇలాంటి కల్లబొల్లి మాటలతోనన్ను మోసపుచ్చలేవు. అంజయ్య అనేవాడు నీతో మాట్లాడుతూ ఉండగానే పట్టుకున్నాం. ఇలాంటివాళ్ళంతా నీకు పరిచయం లేకుంటే నీ దగ్గరకి ఎందుకు వస్తారు?"

"అంజయ్యగారి గ్రామంలోకొన్నాళ్ల నేను ట్యూషన్సు చెప్పుకున్నాను. అందువల్లఅతడు పరిచయం. మిగిలినవారెవరో నాకు తెలియదు"

ఇన్‌స్పెక్టర్ రాసుకుంటూ కూర్చున్నాడు. ఆమెకు అన్నీ తెలుసునని అతడి ఉద్దేశం. బెదరించి, బలవంతం చేసి




అయినా ఆమెచేత నిజం చెప్పించి అంప రినీ పట్టుకోవాలనుకుంటున్నాడు.

"ఆడదానివి... పైగా గర్భవతివి. నా డ్యూటీని నిర్వర్తించేటప్పుడు ఎవరినీ జాలితలచను. చెప్పు...నిజంచెబితే బతికి పోతావు?లేకపోతే నీ ప్రాణం నిష్కారణంగాపోతుంది"

నాకు తెలియదని మరోసారి చెప్పింది ఆమె. ఇన్‌స్పెక్టర్ లేచి టేబుల్ చుట్టూ తిరిగి ఆమె వద్దకు వచ్చాడు. చాచి చెంప పగులగొట్టాడు. ఆ దెబ్బకు కళ్ళు తిరిగి ఆమె కిందపడింది. ఆ రూం కిందకూ మీదకూ గిర్రున తిరుగున్నట్లయింది. జీవితంలో ఏనాడూ దెబ్బతినని ఆమెకు ఆ దెబ్బ భయంకరంగా అనిపించింది. కళ్ళనుంచి కారిన కన్నీరు తుడుచుకోలేక పోయింది. కానిస్టేబుల్ లోపలకు వచ్చాడు. నరసయ్య అనే లాయరు వచ్చాడని చెప్పాడు.

"ఎవరా గాడిదకొడుకు? ఇలాంటి గాడిదల్ని రెచ్చగొట్టి అందర్నీ రౌడీలను చేస్తున్నారు. రమ్మను" అన్నాడు. తిరిగి ఆలోచించాడు. రూంలో ఎదురుగా రాజ్యం ఉంది. ఆమెను అక్కడినుంచి తొందరగా తరలించడం సాధ్యంకాదు. అందువల్ల తానే బయటకు వచ్చాడు. బెల్ట్ సరిచేసుకుంటూ వసారాలోనికి వచ్చేసరికి నరసయ్య నిలబడి ఉన్నాడు.

"ఏమిటి?" అన్నాడు కళ్ళెరగజేసి ఇన్‌స్పెక్టర్.

తాను ఎందుకు వచ్చింది వివరించాడు నరసయ్య. అతనితో పాటు మరో నలుగురు ఉన్నారు.

"ఆ మనిషి ఎవరో నాకు తెలియదు. మేం తీసుకురాలేదు" అన్నాడు.

"ఇన్‌స్పెక్టర్‌గారూ! ఆమెను మీరు తెచ్చారో లేదో మాకు తెలుసు... మీకూ తెలుసు. ఎక్కడనుండి తెచ్చారో అక్కడ అందరికీ తెలుసు! ఆమెను ఇప్పటికయినా మా స్వాధీనం చేయడం మంచిది. లేకుంటే దాని ఫలితం మరోలా ఉంటుంది" అన్నాడు నరసయ్య. ఇన్‌స్పెక్టర్‌కు ఒళ్ళు మండిపోయింది. లాయర్ మాట్లాడటానికి ఇది కోర్టుకాదు. తన అధికారం కింద ఉన్న పోలీసుస్టేషన్. ఇక్కడ ఎవరినయినా తాను చంపినా ప్రశ్నించే హక్కులేని చోటు. ఇది తన సామ్రాజ్యం. తన సామ్రాజ్యంలోనికి వచ్చి తనను హేళనగా మాట్లాడటమా? పళ్ళు పటపట కొరికాడు.

"నువ్వు లాయరునని మిడిసిపడుతున్నావేమో? నీ వాదన నా దగ్గర వినిపించకు. అతిగా నీల్గితే నిన్నూ,నీ వెనుక ఉన్న వాళ్ళనూ బొక్కలో తోస్తాను. త్వరలో నువ్వూ ఈ స్టేషన్ లాకప్‌లో కూర్చుంటావ్...వెళ్ళు.వెళ్ళినీ ఇష్టంవచ్చిన పనిచేసుకో" అన్నాడు వెనుతిరుగుతూ.

లోపలకు వెళ్ళి ఊపిరి పీల్చివదిలాడు రాజ్యం మెడ పట్టుకొని పక్కనేఉన్న రూంలోకి లాక్కుపోయాడు. ఆమె ఆయాసంతో వగరుస్తున్నది, నడవటం అసలు సాధ్యం కావడంలేదు. బలవంతంగా అతడు లాగుతుంటే చచ్చిన కుక్కను లాగినట్లు వుంది. "నీ కథ తర్వాత చూస్తాను. ఆ లాయర్‌గాడుకాదు, దేవుడు అడ్డువచ్చినా నీనుండి రహస్యాలు లాగేస్తాను" అన్నాడు బయటకుపోతూ.

"నాదగ్గిర ఏం రహస్యాలు లేవు" అంది గట్టిగా- బయటనున్నవారికి వినిపించాలనే ఉద్దేశంతో. బయటకు పోబోయిన ఇన్‌స్పెక్టర్ వెనుతిరిగి వచ్చాడు.

"బయటవున్న ఆనాకొడుకులు విని వస్తారని ఆశిస్తున్నావేమో?ఏంలాభంలేదు. వాళ్ల నూబొక్కలోతోస్తా" అంటూకాలితో తన్నాడు. అసలే పెరిగిపోయిన ఆ శరీరానికి ఈతాపు తీవ్రంగా తగలడంలో విరుచుకు పడిపోయినట్లు నేలన పడింది. ఇన్స్పెక్టర్ ఆవేశం కొంత తగ్గింది.'ఖర్మగాలి చచ్చిందేమో?' అనుకున్నాడు. దగ్గరగా వచ్చి బోర్లపడిన మనిషిని వెల్లకిలా తిప్పి, ముక్కుదగ్గర వేలు పెట్టి చూశాడు. శ్వాస ఆడుతున్నట్లు కనిపించకపోవడంతో అతడి ఆవేశం నీరుగారిపోవటం ఆరంభించింది. ఒక నిమిషం పాటు ముక్కు దగ్గర వేలు పెట్టి చూశాడు. ఫలితం లేకపోవడంతో నాడిపట్టి చూశాడు. వెంటనే కానిస్టేబుల్ను పిలిచాడు. కానిస్టేబుల్ లోపలకు వచ్చి నిలబడ్డాడు.

"ఇది చచ్చినట్టుంది చూడరా !" అన్నాడు ఆత్రుతతో. అతని శరీరం చెమట కారుతున్నది. ఆవేశంలో తాను కొట్టడం పొరపాటయింది. అసలే నిండు చూలాలు. ఆ తాపులకు మామూలు వ్యక్తులే గింగుర్లు తిరిగిపడతారు. మరి ఈ మనిషి బతికి ఉందన్న నమ్మకం అతడికిలేదు. కానిస్టేబుల్ కూడా నాడి కోసం ప్రయత్నించి విఫలమయ్యాడు.

"సార్... లాభంలేదుసార్! చచ్చిపోయిందిసార్" అన్నాడు భయంగా.

ఇన్స్పెక్టర్లో ఉన్న కోపపు నిషా పూర్తిగా దిగి భయం అంతకంతకూ పెరుగుతున్నది. ఆమెను తీసుకురావటం ఒక తప్పయితే, కొట్టి చంపడం రెండో తప్పు. దీనికి తాను సంజాయిషీ ఇచ్చుకోవడం కష్టం. ఈమెను దూరంగా ఎక్కడికయినా తీసుకెళ్ళి ఎన్కౌంటర్లో చనిపోయినట్లు సృష్టించడం ఒక్కటే తనకు మార్గం. ఆపద్ధతిన అయితే తనపైఆఫీసర్ల సహకారం తనకు దొరుకుతుంది. వెనుకదన్నుగావుండి తనను రక్షిస్తారు. లేకుంటే తాను ఉద్యోగం పోగొట్టుకోవడమటుంచి, యావజ్జీవ శిక్ష అనుభవించాలి.

పోలీసులను లోపలకు పిలిచాడు. అందరూ పరిస్థితి అర్థంచేసుకున్నారు.

"దీన్ని ఇక్కడనుండి తరలించాలి. లేకుంటే మన పోలీసుస్టేషన్కు మూడుతుంది" అన్నాడు అధికారపూర్వకంగా.

"కానీ ఎలా సార్! బయట జనం వున్నారు. రెండు ఎన్కౌంటర్స్ జరిగేసరికి ఎక్కడచూసినా ఇదే చర్చ! ఇంతలోనే ఒక నిండుచూలాలిని తీసుకు వచ్చారనేసరికి కొందరు కోపంతో ఊగుతున్నారు. ఈ సమయంలో బయటకు తీయాలంటే కష్టంసార్! మనం దొరికిపోతాం" అన్నాడు సబ్ఇన్స్పెక్టర్.

"ఎలాగయినాసరే! దీని పీడ వదలించాలి. లేకుంటే ఇరుకునపడతాం"

"తీసుకురాకపోతే సరిపోయేదిసార్! అప్పటికీ మీకు చెప్పాను...ఆ మనిషికి ఇందులో ఎలాంటి సంబంధాలులేవు. నిండుచూలాలిని తెస్తే పాపం సార్ అని. మీరు వినలేదు. పైగా ఆ నిండుచూలాలిని తన్ని చంపితే అల్లా క్షమించడు సార్" అన్నాడు సబ్ఇన్స్పెక్టర్.

ఇన్స్పెక్టర్ అతనివైపు దీర్ఘంగా చూశాడు. తన ఆజ్ఞ నిర్వర్తించవలసినవాడు తనకు నీతులు చెబుతున్నాడు! ఈ గండంనుంచి బయటపడనీ పీడి తోలు తీసి డోలు కడతాను. అనుకున్నాడు. ప్రస్తుతం ఇరుక్కున్నది తను గనుక బయటపడేదాకా మంచిగానే ప్రవర్తించాలి.

"ఎలాగయినాసరే! బయటకుతీయాలి.

జీప్‌స్టార్ట్‌చెయ్యి" అన్నాడు డ్రైవర్‌తో. డ్రైవర్ బయటకు పరుగెత్తాడు. తిరిగి అంతే వేగంతో లోపలకు వచ్చాడు. అతడు వణుకుతున్నాడు. ఏమిటని కళ్ళ తోనే అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఆ లాయరు నరసయ్య బయటే వున్నారు సార్! అతడితోపాటు మరో నలుగురుకూడా వున్నారు"

ఇన్‌స్పెక్టర్ శరీరం ఎండుటాకులా వణకింది. ఆ భయం బయటకుచూపలేదు. తనే డీలాపడితే ఇక్కడున్న ఏఒక్కడూ బాధ్యత వహించకుండా అందరూ తప్పు కుని తననెత్తిన తోస్తారు. పైకి బింకంగా బయటకు నడిచాడు.

పోలీసులు లాఠీలు గడ్డంకింద పెట్టు కుని రాజ్యాన్ని చూస్తున్నారు.

యస్.ఐ. సెంట్రీ దగ్గరకు వచ్చాడు. యస్.ఐ.కి అర్థమవుతున్నది ఒక్కటే- బయటకుపోతున్న ఇన్‌స్పెక్టర్ తిరిగి వస్తాడన్న నమ్మకంలేదు. బయట లాయరు ఏ మేజస్ట్రేటుకో రిపోర్టు చేసు కుని, పోలీసుస్టేషన్‌కు పిలిపించడానికి ప్రయత్నిస్తూ బయటకురాజ్యాన్ని ఎక్క డికీ తీసుకుపోకుండా కాపలా వున్నాడు. రాజ్యాన్ని బయటకు తీసుకపోవడం సాధ్యంకాదుగనుక, ఇన్‌స్పెక్టర్ చేసేపని పారిపోవడమే. అతడు పారిపోయి, మేజస్ట్రేటు వచ్చేటప్పటికి తాము దొరికితే ముందు అందరూ ఇళ్ళకుపోవాలి, విచా రణ తర్వాత. అందువల్ల అతడు ఒక నిర్ణయానికి వచ్చాడు "ఆమెను చంపింది. ఇన్‌స్పెక్టరేనని నీకు తెలుసా?" అన్నాడు యస్.ఐ.

"నేను చూశాను సార్! నన్ను నాడి చూడమన్నాడు" అన్నాడు సెంట్రీ. మిగిలినవాళ్లుకూడా అదే చెప్పారు.

"మంచిదే. అదే మన ఆడపిల్ల ఈ చావుచస్తే మనకెంత కోపం, బాధ కలుగు తుందో ఆలోచించండి. ఈమెను చంపి ఇన్‌స్పెక్టర్ పారిపోతున్నాడు. ఎంక్వయి రీకి ఎవరు వచ్చినా మనం ముందు దొరికి పోతాం. తప్పుచేయని మనం దొరికి పోవడం, అతడు తప్పించుకునేదానికి అవకాశం కల్పించడం ఎందుకు? అతడు చేసినతప్పు కళ్ళతో చూస్తున్నాం గనుక బాధ్యతగల వ్యక్తులుగా అతన్ని అరెస్టు చేయాలి" యస్.ఐ. మాటలకు పోలీసుల్లో అలజడి బయలుదేరింది. ఇన్‌స్పెక్టర్ పారిపోతే తాము ఇరుక్కోవాలి. బయట నరసయ్య కావాలనే కాపలా కూర్చున్నా డంటే స్టేషన్‌చూడటానికి ఏ పెద్ద ఆఫీసరో వచ్చే ఏర్పాటుచేసివుంటారని వారికి అనుమానం. తమమీద ఒక నిందుమూలాలి హత్య మోపుకోవలసిన ఖర్మ ఎందుకు? అసలు వాడినే పట్టించాలని నిశ్చయించారు.

"మీరు ఈ స్టేషన్‌కు ఇప్పుడు ఆఫీసర్‌సార్! మీరు ఆజ్ఞాపిస్తే మేం ఏం చేయమంటే అదిచేస్తాం" అన్నాడు హెడ్ కానిస్టేబుల్.

ఇన్‌స్పెక్టర్‌ను అరెస్ట్ చేయమన్నాడు యస్.ఐ. ఆపాటికి పోలీసుస్టేషన్ ఆవరణ దాటి జనంలో కలిశాడు. అతని వెంటపడి పట్టుకుని పోలీసులు స్టేషన్ లోపలకు ఈడ్చుకుంటూ వెళ్తుంటే జనం ఆశ్చ ర్యంతో నిలబడ్డారు. అందరూ స్టేషన్ వైపు కదిలారు. లాయర్ నరసయ్య పోలీసుల ప్రవర్తన చూశాడు. మొత్తానికి ఏదో జరిగిందనే నమ్మకం ఏర్పడింది.

అదే సమయంలో మేజస్ట్రేటు అక్కడ దిగాడు జీపునుండి. అతనికొరకే ఎదురు చూస్తున్న నరసయ్య ముందుకు వచ్చి జరిగిన వివరాలుచెప్పాడు. ఇన్‌స్పెక్టర్‌ను

పోలీసులే పట్టుకుపోవడమేమిటో తెలియని మేజస్ట్రేటు ఆశ్చర్యంగా తలపంకించి లోపలకు కదిలాడు. అతనితోపాటు నరసయ్య కదిలాడు. యస్.ఐ. ఊహించింది నిజమయింది. మేజస్ట్రేటు ఎంక్వయిరీకి వస్తాడనే అనుకున్నాడు. బలవంతంగా మరోకొద్దిసేపట్లో ప్రసవించవలసిన స్త్రీని తీసుకువస్తే, హాస్పిటల్ వాళ్ళయినా, మరెవరయినా చర్య తీసుకుంటారనే అతడు భావించాడు.

మేజస్ట్రేటు లోపలకు వస్తూనే అటెన్షన్‌లో నిలిచి శాల్యూట్ చేశారు పోలీసులు. వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

"హాస్పిటల్‌నుండి ఒక అమ్మాయిని బలవంతంగా తీసుకువచ్చారనీ, ఆమె నిండు గర్భవతి అనీ, ఆమెను స్టేషన్‌లో దాచి పెట్టారనీ మాకు వర్తమానం అందింది...ఇది నిజమేనా?" అన్నాడు యస్.ఐ.తో.

యస్.ఐ. అంతవరకూ జరిగింది చెప్పాడు. "పారిపోతుంటే పట్టిలోపల వేశాం సార్!" అన్నాడు.

మేజస్ట్రేట్ అవాక్కయిపోయాడు. అంత దౌర్జన్యంగా తీసుకువచ్చి చంపివేయడమంటే ఎంతఅహంకారం, పొగరు. పైగా పోలీసుస్టేషన్‌లోనే చంపడం. నరసయ్య ముఖం జేవురించింది. అతని వెంట వున్న నలుగురూ పళ్ళు పటపట కొరికారు. మేజస్ట్రేట్ నిస్త్రాణగా లేవలేక ఐదునిమిషాలు కుర్చీలో కూర్చుండిపోయారు.

బయట గగ్గోలు ఆరంభమయింది. ఆమె ఒక అవిటి వ్యక్తి! ఒక నిండు చూలాలు! మంచో, చెడో పదిమందికి సహకారం చేసిన వ్యక్తి భార్య! ఎన్‌కౌంటర్లో అతన్ని చంపిన తడి ఇంకా ఆరనేలేదు. ఆమెకు రాజకీయాలంటే ఏమిటో తెలియవు. ఆమెను కర్కశంగా, బలవంతంగా స్టేషన్‌కు తేవడమే నేరం. చంపడం మహా నేరం-అని వారి భావన. వారిలో తొక్కిడి ఆరంభమయింది. వారిచేతికి ఆసమయంలో ఇన్‌స్పెక్టర్ దొరికితే జరిగేదేమిటో మేజస్ట్రేటుకు తెలుసు. ఫోన్‌చేసి ఇతర పోలీసు స్టేషన్‌ల నుండి బందోబస్తు తెప్పించమన్నాడు యస్.ఐ.తో. యస్.ఐ. ఫోన్ తీసుకుని సూపరింటెండెంట్‌కు తెలుపుకున్నాడు. అంతవరకూ జనం లోపలకు రాకుండా అడ్డుకోడానికి ఉన్న ఇరవైమంది పోలీసులనూ బయటకుపంపి స్టేషన్ తలుపులు వేశారు.

మేజస్ట్రేటు లేచి ఆ రూం వద్దకు వెళ్ళారు. ముందు యస్.ఐ., వెనుక మేజస్ట్రేట్, ఆయనవెంట నరసయ్య, మిగిలినవారు ఉన్నారు.

ఉండలాగా కిందముడుచుకు పడివున్న రాజ్యాన్ని చూశాడు మేజస్ట్రేటు. దగ్గరగా వచ్చి ముక్కు దగ్గర వేలుపెట్టి చూశాడు నాడి చూశాడు. ఏమీలేదు. పైగా శరీరం చల్లబడుతున్నది. మేజస్ట్రేటు ఆమె చుట్టూ తిరిగి పరిశీలించాడు. కాళ్ళ దగ్గరగా వచ్చి మోకాళ్ళమీద కూర్చుని చెయ్యి ఆమె తలమీద వేశాడు. లేచి మౌనంగా నిలబడ్డాడు తలపంచుకుని.

అతని కళ్ళనుండి అప్రయత్నంగా రెండు అశ్రువులు రాలి ఆమె తలమీదపడ్డాయి.





# చతురసమీక్ష

ఇటీవల విశేషంగా పెరిగిన పాఠకాదరణను పురస్కరించుకుని 'చతుర'ను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది మీ పత్రిక 'చతుర'. ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవల బాగోగులను చర్చించే ఆ శీర్షిక పేరు "చతుర సమీక్ష".

సాధారణంగా పత్రికలలో సాహిత్యానుభవంగల విమర్శకులచే వివిధ రచయిత(త్రు)ల పుస్తకాలను సమీక్షింపజేయటం రివాజు. కాని 'చతుర'లో ఈ శీర్షికవల్ల ఆ అవకాశం పాఠకులకే లభిస్తుంది. పాఠకులు చేయవలసిందల్లా 'చతుర'లో ప్రచురించే నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల తమకు ఆ నవల నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులను గురించి రాయవచ్చు!

ఇక ఈ శీర్షికలో పాల్గొనే పాఠకులు గమనించవలసిన ముఖ్యాంశాలేమంటే :

1. "చతుర సమీక్ష"కు పంపే మీ రచన అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపు మాత్రమే రాయాలి.

2. మీ సమీక్షలు మాకు ఏ నెల నవలవి ఆ నెల 15వ తేదీలోపు అందాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఇందులో ఇస్తున్న కూపన్‌ను జతపరచాలి.

4. కవర్‌పై "చతుర సమీక్ష"కు అని పేర్కొనాలి.

మాకు అందిన పాఠకుల సమీక్షలలో ఉత్తమమైనవిగా మేము ఎంపిక చేసిన మూడింటిని ప్రచురించి రూ. 100, 75, 50 చొప్పున నగదు బహుమతులు పంపగలం.

ఈ నెల నవలపై పాఠకుల "చతుర సమీక్ష"లు అక్టోబర్ సంచికలో ప్రచురింపబడతాయి.

ఇక విరివిగా పాల్గొని ఈ శీర్షికను సద్వినియోగం చేసుకునే వంతు పాఠకులదే!

కూపన్

ఆగస్ట్ 'చతుర' నవల : అశ్రుతర్పణం

సమీక్షకుని పేరు :..............................

చిరునామా :..............................

..............................

..............................

# చతుర కథలు

## సస్పెన్స్

నాకు ఇష్టంలేని విషయాల్లో మొట్టమొదటిది-నన్ను నేను రచయితగా పరిచయం చేసుకోవడం.

రచయితగా ఎవరికైనా పరిచయం



కావడమంటే నా వ్యక్తిగతజీవితంలో కొంతభాగాన్ని పోగొట్టుకోవడమే- అదీ నా అభిప్రాయం.

పైగా రచయిత అనేటప్పటికి చాలామంది గౌరవభావంతో దూరం దూరంగా మసలుతారు. అది నాకిష్టం లేదు.



అందుకే 'అజ్ఞాత్' అనే కలం పేరుతో రచనలు చేస్తుంటాను.

నేను 'అజ్ఞాత్' పేరుతో కథలు రాస్తా సన్న సంగతి ఎవరికీ తెలియదు- ఆఖరికి మా ఇంట్లో కూడా.

అజ్ఞాత్ పేరున నాకొచ్చే పోస్ట కలెక్ట్ చేసుకోవడానికి రోజూ పోస్టాఫీసుకి వెళ్ళి తెచ్చేసుకుంటాను.

మా బంధువులు, స్నేహితులు, ఇంకా చాలామంది అమ్మాయిలు నా కథ చదువుతూ అజ్ఞాత్ గురించి చర్చించుకొంటుంటే నవ్వుకునేవాణ్ని.

నా ఫొటోగాని, వివరాలుగాని ఏ పత్రికలో ప్రచురించబడలేదు. నేను

సీరియల్ నవల్లో సశేషం అనే పదం లాంటి సస్పెన్స్‌గా మిగిలిపోయాను.

నాకు పెళ్ళిచేశారు మా ఇంట్లోవాళ్ళు సత్యభామతో.

పెళ్ళయిన మూడురోజులకే మాఆవిడ 'సత్యభామ'ని తీసుకొని వేరు కాపురం పెట్టాను.

ప్రింటయిన నా రచనలన్నింటినీ నీట్‌గా బైండ్‌చేయించి, అల్మైరాలో వుంచాను. వాటినిచూసి "ఏమిటివన్నీ?" అని అడిగింది సత్యభామ.

"ఏవో పుస్తకాలులే" చెప్పాను-ఇక అంతకంటే ఎక్కువ వివరాలు చెప్పదల్చుకోలేదు.

రెండు రోజులపాటు మా ఆవిణ్ని సస్పెన్స్ సముద్రంలో ముంచేసి, ఆ తర్వాత నిజం చెబుదామనుకున్నాను.

ఆరోజు సాయంత్రం నేను ఆఫీసు నుండి రాగానే ఎదురొచ్చి, ఆనందంగా చెప్పింది సత్యభామ-"యాభై రూపాయలు వచ్చాయి. అంత వస్తాయనుకోలేదు"

"ఏమిటి?"

"అల్మైరాలో పుస్తకాలని, పత్రికలని, ఆ కాగితాల కట్టల్ని తూకాల లెక్కన అమ్మేస్తే, యాభై రూపాయిలొచ్చాయి. అసలు నాకా సాహిత్యం గీహిత్యం అంటే బొత్తిగా పడదు. అబ్బా! పీడా వదిలిపోయింది" చెప్పింది మా ఆవిడ.

—విపంచి

## ఆదర్శ పతి!

రామారావు, సీత ఇద్దరూ ప్రేమించుకున్నారు. అయితే చదువు సంధ్యలు వున్నా ఇద్దరూ నిరుద్యోగులే. వాంటెడ్ కాలమ్స్ చూసి అర్హతలు వున్న ప్రతి ఉద్యోగానికీ అప్లికేషన్లు పెట్టుకున్నారు. పిలిచిన ఇంటర్వ్యూలకివెళ్ళారు. ఉద్యోగం వస్తే కాని పెళ్ళిచేసుకోకూడదని ఉద్యోగాల వేట తీవ్రంచేశారు. తమ ఇద్దరిలో ఎవరికి ఉద్యోగం వచ్చినా పెళ్ళిచేసుకుని వెంటనే ఒక ఇల్లు తీసుకుందామనీ నిశ్చయించుకున్నారు.






ఇద్దరికీ ఉద్యోగం వస్తే ఇక చెప్ప క్కరలేదు. రామారావుకి ఉద్యోగం వస్తే సరేసరి. ఒకవేళ సీతకి ఉద్యోగం వచ్చి రామారావుకి రాకపోయినా, రామారావు చిన్న బుచ్చుకోకూడదు- అలా అను కున్నారు ఇద్దరు. ఆ ఇద్దరూ పట్టినపట్టు విడవకుండా ఉద్యోగాలకి ప్రయత్నిస్తే ఒక శుభముహూర్తాన సీతకి ఉద్యోగం వచ్చింది.

"ఏమనుకోకు డియర్! నీకూ వస్తుంది ఉద్యోగం. అంతవరకూ మనం ఆగక్కర లేదు. నాకు వచ్చిందిగా...వెంటనే పెళ్ళి చేసుకుందాము" అంది సీత.

సీత రెండు కాళ్ళమీద ఇద్దరూ నిల బడదామనుకుని నిశ్చయించుకుని పెళ్ళి చేసుకుని కాపురంపెట్టారు.

సీతకి ఆఫీస్ ఉదయం 9 గంటల నుంచి సాయంత్రం 5 దాకా. శని, ఆది వారాలు సెలవు. సీత ఆఫీస్‌కి వెళ్ళడానికి రామారావు కావలసిన సహాయం చేయడం మొదలుపెట్టాడు. అన్నంవండటం దగ్గర నుంచి అంట్లు తోమటం వరకూ; బట్టలు ఉతకడం దగ్గర నుంచి ఇస్త్రీ చేయడం వరకు; దుమ్ము దులపడం దగ్గరనుంచి చిమ్మడం వరకూ...అన్ని పనులు తన మీదే వేసుకున్నాడు. భార్యకి ఫ్లాస్క్‌లో కాఫీ పోసి, కారియర్‌లో భోజనం సర్ది, హేండ్‌బాగ్‌లో డబ్బులు సరిగ్గాపెట్టి ప్రతి రోజూ ఆఫీస్‌కి పంపించేవాడు.

సీతకి మొగుడు అలా సేవచేస్తూ వుంటే అలపూసొలపూ అన్నదిలేక ఆఫీస్ పని యమ పర్‌ఫెక్టుగా చేస్తూ ప్రమోషన్లు, ఇంక్రిమెంట్లూ అన్నీ కొద్ది కాలంలోనే సంపాదించేసింది.

ఒకరోజున సీత ఆఫీస్‌కి సెలవు. సీత ఇంట్లోనే కూర్చుంది. రామారావు రేషనుకి వెళ్ళాడు. ఆ సమయంలో పోస్ట్ వచ్చింది. రామారావు పేర వచ్చిన కవరు తీసుకుని, విప్పి చదివి సీత ఎగిరి గంతేసింది. ఇంతలో పండగకి ఇచ్చిన ఒక కిలో ఎక్స్ట్రా పంచదార తీసుకుని రామారావు వచ్చాడు.

"ఏమండోయ్...మీకు ఉద్యోగం వచ్చింది" అంది సీత.

రామారావు ఎగిరి గంతెయ్యలేదు. ఆ లెటర్ తీసుకుని చదవడానికి ఏమంత ఆసక్తి కనపర్చలేదు. అది చదివి ఆనందించనూ లేదు.

"అదేమిటి...ఉద్యోగం కోసం ఎంత కష్టపడ్డారు. అది వచ్చేసరికి కొంప కూలిపోయినట్లు అనిపిస్తోందా ఏమిటి?" సీత అడిగింది.

"అవును. నిజంగానే కొంప కూలి పోయినట్లే అనిపిస్తోంది. నువ్వంటే నాకు చచ్చేటంత ఇష్టం. నువ్వూ నేను ఉద్యోగాలకి వెళ్తే ఇంటిపనీ, వంటపనీ అంతా నువ్వే చేస్తావు. ఆఫీస్ పనిమీద నీకు ఇంట్రెస్ట్ తగ్గిపోతుంది. నీ ఎఫిషియెన్సీ తగ్గిపోతుంది. ఇంక్రిమెంట్లు తగ్గిపోతాయి. ఇద్దరూ ఉద్యోగాలకి వెళ్ళేకన్నా ఒకరు ఇంటిపట్టున వుండటం మంచిది. ఆ ఒకరు నేనయితేనే మంచిది. ఎందుకంటే పెళ్ళయిన దగ్గర నుంచీ ఇంటిపనులకి నేనే అలవాటు పడిపోయాను. ఇంటిపను లలో నేను పర్‌ఫెక్టుగా వున్నాను. నన్ను డిస్టర్బ్ చేయకు" అని చిన్న లెక్చర్ దంచేసి, "అన్నట్లు...ఈపూట ఏం వండమన్నావు?" అన్నాడు రామారావు.

సీత - పాపం రామారావు పెళ్ళాం నోటమ్మట మాటరాక కుర్చీలో కూలబడి పోయింది.

—తాజీప్రసాద్

# సితార

• మీరు అభిమానించేది ఏ తారనైనా సరే
మీకు కావల్సింది సితార

• మల్టీకలర్ ముఖచిత్రమే కాదు, అనేక రంగుల సెంటర్ స్ప్రెడ్‌తో మిమ్మల్ని మురిపించి, మైమరపిస్తుంది
సితార

ఆకాశంలో వెలిగేది ధ్రువతార
సినీజగతిలో వెలిగేది సితార

• సినిమాకు సంబంధించిన అన్నిరకాల వార్తలకు, వ్యాఖ్యలకు, కబుర్లకు, విమర్శలకు పెట్టింది పేరు
సితార



ఈనాడు కాంపౌండ్, సోమాజీగూడ
హైదరాబాద్ - 500004



Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 482.

# టెక్నాలజీలో అత్యున్నత శిఖరాల నధిరోహిస్తూ...



## తోషిబా

# డిజియానా

## 207 R3E రిమోట్ కంట్రోల్ మోడల్

ఎలక్ట్రానిక్ యుగాన్ని సృష్టించి మౌంట్‌ఫ్యూజీ శిఖరాన్ని అధిష్టించిన జపాన్‌వారి వినూత్న అధునాతన తోషిబా టెక్నాలజీ అపూర్వసృష్టి డిజియానా టి.వి. డిజియానా 207.R3E కార్డ్‌లెస్ రిమోట్ కంట్రోల్ మిమ్ములను సమ్మోహితం చేస్తుంది. ఒక్క బటన్ నొక్కితే చాలు ప్రపంచాన్ని మీ కళ్ల ముందుంచుతుంది. బొమ్మలో సజీవ స్పష్టత శబ్దంలో సహజ విశిష్టత కలబోసుకున్నది డిజియానా టి.వి.

మీ కంటికి ఎటువంటి హాని, అలసట, ఆటంకం - కలిగించని స్క్రీన్ ఉంది. దీని సున్నితమూ, సుందరమూ అయిన రూపం మీ ఇంటికి, కంటికి హుందాగా కొత్త వెలుగు లిచ్చే దీపం. మీ ఇంటికి తరిగిపోని శ్రీవి, డిజియానా టి.వి. ఈ రోజే మిమ్మల్ని మంత్రముగ్ధుల్ని చేసే డిజియానా వినోద ప్రపంచంలో అడుగు పెట్టి చూడండి!




